ఆంధ్రసచిత్రవార

# పత్రిక

25 నయాపైసల

23-3-62



## తెలుగు పత్రికలన్నిటిలోనూ ఆంధ్రసచిత్ర వారపత్రిక సర్క్యులేషన్ అత్యధికమైనది!



# PHILLIPS ఫిలిప్స్ సైకిళ్ళు

## మీకై నిర్మితమైనవి

సొగసై కంటికి నదరైన ఫిలిప్స్ సైకిలు నేటి మీవంటి వుత్సాహవంతులైన యువకుల కొరకై నిర్మితమైనది ఎట్టి మోటు వాడుకకైనను తట్టుకొన జాలునట్లుగా అనలైన పదును చేయబడిన ఉక్కుతో దృఢముగా నిర్మింపబడినది

డెబ్బై ఏండ్లుగా ప్రపంచ ఖ్యాతి నొందిన ఫిలిప్స్ సైకిళ్ళు, యిప్పుడు టి. ఐ. సైకిల్స్ వారి అత్యాధునికమైన కర్మాగారంలో, ఖచ్చితమైన పద్ధతులలో తయారుచేయబడుచున్నవి.




**టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా** *అంబత్తూరు — మద్రాసు*

JWT/TIC/PH/1604

మీ వ్యవసాయ అభివృద్ధికి అధిక ఫల సాయమునకు

## తక్కువ ధరకే ఎక్కువ పనితనాన్ని చూపే

# జెటార్ 3011-33H.P. డీశిలు ట్రాక్టర్లు



మావద్ద రెడిస్టాకునుండి లభించగలవు

ఎక్సు వర్క్సు ధర :
రు 10975/-
డెలివరీ ఛార్జీలు, పన్నులు అదనము

జెకోస్లేవికియానుండి దిగుమతి చేయబడి, అధునాతన పద్ధతులు అమర్చబడినవి
* దమ్ము చేయుట * కుప్ప నూర్పుట * దుక్కి దున్నుట * బరువు లాగుట
* నీరు తోడుట మొదలగు అన్నిరకాల పనులు అతి సునాయాసంగాను, వేగంగాను చేయును

ఈ జెటార్ 3011-33 H P డీశెల్ ట్రాక్టర్లకు హైడ్రాలిక్ లిఫ్టు, బెల్టు పుల్లీ, గాలి కొట్టు మిషనుతో సహా సప్లయిచేయబడును

వివరములకు :

## శ్రీ భాస్కర ఆటోమోబైల్సు & జనరల్ ఏజన్సీస్,

"శ్రీ రామదాసు బిల్డింగ్సు", పోస్టుబాక్సు నెం 42, కాకినాడ
ఫోను నెంబర్లు: 329, 297 & 60

SWASTIK

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్‌తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో పడుతూ ఉంటాయి





# వయోలా

పరిమళ

ఎస్సెన్సులు మరియు ఆహార రంగులు

ఐస్‌క్రీమ్ సిరప్
ఎరేటెడ్ పానయం
మిఠాయి మొదలైన వాటికి

మోడీ అండ్ కో., బొంబాయి

ఓం తత్ : సత్



# సుఖ జీవిత సేవ

"సిద్ధ ఔషధ మహిమ"

సిద్ధుల సాటిలేని మహిమకు ఒక తార్కాణము

## కె. టి. కృష్ణమూర్తి ఆచ్చారి గారి

# "మేల్ మాయిల్ మందు"

(Regd.)

**దీర్ఘకాల చర్మరోగములకు ఉత్తమ నివారిణి**

నల్లరంగు, ఎఱ్ఱరంగు పొడలు, దద్దులు, పొట్లు, గజ్జి, (చర్మ సంబంధము) పొడలు గల చోట్లలో తిముర్లు, సూదితో పొడిచినప్పుడు నొప్పి లేకుండుట, నిప్పుపడి బొబ్బలు గలిగిన తెలియకుండుట, దుర్ నీరు సర్వ అవయవములందు వ్యాపించి, రక్తములో కలిసి మత్తు కలుగజేయుట, (నరముల సంబంధము) చేతి వేళ్లు ముడుచుకొనుట, బొబ్బలు లేచుట, ముక్కు బంధనములు, పాదమునందు పల్లపు పుండ్లు ఏర్పడుట, కాలు చేతులు వ్రేళ్ళు తగ్గుట, ముక్కు సొట్ట పడుట, చూచుటకు వినుగు పుట్టించు రణములు (అస్థి సంబంధము) వీటికి ఉత్తమ నివారిణి

**1 మండలం నూనె, లేహ్యము 8 oz శ్రీ పరమాత్మస్నాన తైలం తపాల ఖర్చులతో రు 12**

పూర్తి వివరములకు వ్రాయండి :

## సిద్ధ డాక్టర్ K. T. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు,

*5/22,* మేల్‌మాయిల్ P.O. (N A Dt)

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ఈవారం ఆంధ్ర సచిత్ర వారపత్రిక అట్టమీద జాక్లిన్ కెనెడీ చిత్రం చూచి చాలా సంతోషించాను మాకు ఇలాంటి ఇతరదేశ మహిళల పరిచయం చాల మెచ్చుకోదగ్గ విషయం ఎలిజబెత్ రాణికిమల్లే ఈమెను కూడా పరిచయంచేసినందుకు మా అభినందనలు.

ప్రైలవరపు సూర్యకాంతం (విజయవాడ)

* * *

## ఫోటో

9—3—62 పత్రికలో పి ప్రభాకర్ (మద్రాసు) గారి "మాతృమూర్తి" ఫోటోలో కొంత సహజత్వం ఉన్నప్పటికీ అది చాలా అసభ్యంగా ఉందని చెప్పడానికి చింతిస్తున్నాను

"లక్ష్మీ చక్రవర్తి (హైదరాబాద్)

* * *

## కథ కాని కథలు

క. కథకాని కథకు నిజమౌ
కథలే రాకున్న మీరు కల్పిత కథలీ
గతి ప్రచురించుటకున్ గల
స్థితమేదో ? నాకు కొంత సెలవిచ్చెదరా !

పోవిశెట్టి బుచ్చిలింగం గుప్త (అమరాబాదు)

## చదువులరావు

మన చదువులరావు ఇకనైనా అమ్మాయిల వెంటపడటం మాని బుద్ధిగా చదివి ఫస్టుక్లాస్‌లో పాసవాలని నేను చెప్పానని చెప్పండి!

మాదాబత్తుల రామారావు (పాలకొల్లు)

* * *

## సందేహం

ఎప్పుడూ ఇంతే—119 లో 'పందార డబ్బా' అని చదివి, శంకర్‌గారు 'పంచదార డబ్బా' బదులు పొరపాటున 'చ' అక్షరాన్ని లోపింపచేశారేమో నను కున్నాను ఇంతకుముందూ ఎప్పుడో ఒకసారి శంకర్‌గారు ఏదో అక్షరం లోపింపచేసినట్లు జ్ఞాపకం వచ్చి, అలా అక్షర లోపాలు గావించడం పరిపాటనిపిస్తూ 'ఎప్పుడూ ఇంతే' చేస్తారా? అనిపించింది

కాని ... అది చూచిన మా తల్లిగారు—నేనే పొరబడుతున్నాననీ, స్వచ్ఛ తెనుగులో 'పందార' అనే అంటారనీ అనడంతో తెల్లమొహం వేశాను

ఐనా, నా జ్ఞాన పరిధిలో ఎక్కడా 'పందార' అని చదవలేదు, పంచదార అనే చదివాను

ఎస్ నారాయణరావు (హైదరాబాదు)

* * *

## కవిసార్వభౌముడు

"కవిసార్వభౌముడు" సీరియల్ అయిపోయిందే అని చాల విచారంగా ఉన్నది అంత మంచి నవల పాఠకలోకానికి సమర్పించినందుకు రచయితకూ మీకూ గౌరవ కృతజ్ఞతాభివందనములు త్వరలో అంటే వచ్చేసంచికనుండేవారి "సహజపాండిత్యుణ్ణి" పాఠకులకు పరిచయం చేస్తారని విశ్వసించుచున్నాం

వి. శ్యామవతి (కొర్రపాడు)

* * *

మీ పత్రికలో ప్రతివారం నన్ను బాగా ఆకర్షిస్తున్నది కవిసార్వభౌముడు అన్న సీరియల్ నవల నాటి పరిపాలనలో కళాకారుల కున్న స్థానాన్ని వివిధ దృక్పథాల్లో వివిధ కోణాలనుంచి చక్కగా ప్రతిబింబించింది పాత్రలకు ఉదాత్తమైన భావాలు చేర్చబడినవి సాంఘిక విషయలోలత్వంతో కొట్టుకుంటున్న నేటి ప్రజావాహినికి చారిత్రకంగా చక్కని మేలుబాటలు చూపబడ్డాయి

వి. వి కె వి నాగేశ్వరరావు (ఏలూరు)

* * *

మీరు ప్రచురించిన 'కవిసార్వభౌముడు' నవల అద్భుతంగా ఉంది ఇంత చక్కని నవలను ప్రచురించినందుకు మీకు, శ్రీ నోరి నరసింహశాస్త్రి గారికి నా అభివందనములు ఇటువంటి నవలలు ఇంకా ప్రచురిస్తారని ఆశిస్తున్నాను

అరుణ (గుంటూరు)

* * *

"కవిసార్వభౌముడు" చాలా బావుంది శ్రీనాథుడు విద్యానగరంలో ఉన్నంతకాలం చదవడానికి చాలా ఉత్సాహంగా ఉంది తిరుగుప్రయాణం కుతూహలంగానే ఉన్నా ఉత్సాహంగామాత్రం లేదు కారణం రచనలో లోపం మాత్రం కాదు వేమారెడ్డిప్రభువు మరణించడమే. డిండిమభట్టుని జయించడం, శతావధానం మొదలైన ఘట్టాలు చాలా బావున్నాయి

నండూరు శ్యామలాదేవి (ఆరుగొలను)

* * *

## కథలు

శ్రీ సూర్యప్రకాశరావుగారు వ్రాసిన చక్రాలు కథ బాగుంది రాజా పడిన కష్టాలు చదవలేక పోయాను

ఎస్ వాసుదేవయ్య, టి డి గిరిధర్ (రాజంపేట)

* * *

'చక్రాలు' రచయిత శ్రీ సూర్యప్రకాశరావుగారి కథలు వేరే ఏమైనా ప్రచురించారా ?

కె ఆర్ కె (రామచంద్రాపురం)

గమ్యస్థానం, చిత్తరువు, సినిమాకథ ఇవి ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురించాము

* * *

ఈవారం పత్రికలో వ్రాసిన 'భగ్నప్రేమికుడు' కథ చాలా బాగుంది శేషగిరిపాత్ర చాలా చక్కగా విశదీకరించారు భగ్నప్రేమికుడికి అర్థం బాగా వ్రాశారు

శ్రీమతి పి రత్నమాల, (సోంపేట)

* * *

'చికిముకి' కథలో ఆఖరున ముకుందరావు పార్వతిని 'చికిగాడేడి?' అని అడిగారు కాని ఆ సాంకేతిక పదం గుమాస్తాలైన కోదండపాణి, కాశీపతులదే కాని ముకుందరావు, చక్రధరరావులది కాదు. ఆ సాంకేతికపదాలు వారివికూడ అయితే అది అసందర్భంగా ఉంటుంది ఎందుకంటే ఎవరూ తమని తాము 'నిక్‌నేమ్' తో పిల్చుకోరు అందుచేత అటువంటి చిన్న తప్పులు రాకూడదని నా ఉద్దేశం

ఇంద్రకంటి హనుమంతరావు (ఢిల్లీ)

* * *

'లేచిపోవడం' సమర్థించిన మొదటి తెలుగు రచయిత 'హవిస్' కాదేమో ! ఏమయినా అందులో అసభ్యత లేదనుకుంటున్నాను పైగా అందులోని యుగధర్మం జరుగుతున్నదీ, జరగాల్సినదీని. కులాలయుగం అంతరించింది స్వామీ ! మనిషి మనసు పెరగా లిప్పుడు సదాచారాలు మంటగలిపిన పెద్దలు వైరినమ్మకాల్ని ఆరాధించాలనటం సబబా ? కాత్యాయిని చేసింది రచయిత రాసింది రెండూ రైటయినవే

పి ఆదిమూర్తి, బాలరామారావు (విజయవాడ)

* * *

'హవిస్' గారు వ్రాసిన 'యుగధర్మం' చదివాను చిన్న సందేహం "రాధాకృష్ణ సుల్తాన్ బజారులో సిగరెట్లను కొని ప్రక్కనే మూసియున్న కొట్టుతాలూకు అరుగుపై కూర్చున్న తరువాత కాత్యాయని, రమణారావు కలిసినపుడు ఆనందంలో కేకవేస్తే కూతవేటుదూరంలో నున్న పోలీసు స్టేషనుకు వినిపిస్తుందని వ్రాశారు పోలీసు స్టేషను 'సుల్తాన్‌బజారులో' లేదుగాని 'బడీచావుడి' వద్ద పుత్లీబౌలీ వద్దనే ఉన్నది అప్పుడు వారి కూత అంత దూరం ఏలా వినిపిస్తుం దనుకున్నారు ? సందేహం తీర్చగలరని ప్రార్థన

పి జగన్నాథవర్మ (హైదరాబాదు)

* * *

'ఆకర్షణ' అనే కథ వాస్తవానికి చాలా దగ్గరగా వున్నది భవిష్యత్తు గురించి తియ్యని కలలుకంటూ, ఊహాసౌధాలు నిర్మించుకొని కాలంగడుపుతుంటాము తీరా వాస్తవరూపందాల్చే సరికి మనం కన్నకలలు కల్లలని అప్పటికిగాని తెలియదు

టి ప్రేమా బి ఎ (విడదవోలు)

★

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు


## విషయానుక్రమణిక


శుక్రవారం *23-3-62*

ప్లవసం॥ ఫాల్గునమా॥ బ॥ విదియ

సంపుటము 54 సంచిక. 29

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

విడిప్రతి: 25 న పై

సంవత్సర చందా: 13-0-0 రు

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి, మద్రాసు-1


★






లోకంపోకడ



"ఎన్నికల్లో ఓడిపోయినట్లు తెలియగానే, ఆయన మూర్ఛపోయారు, అప్పటినుంచీ ఇలాగే ఉన్నారు."



నౌకా భద్రతకు
నాయకుల సహకారం
స్వతంత్ర పార్టీ సవాల్
ఆంధ్ర మంత్రివర్గం
కమ్యూనిస్టు పార్టీ సవాల్
స్వతంత్ర సభ్యుల సవాల్




మైసూరు
ముఖ్యమంత్రి
పీఠం
నిజలింగప్ప




కేంద్ర
ఆర్థిక
మంత్రి
పీఠం
అభ్యర్థిత్రయం




కుడి
ఎడమ
విభిన్న దృక్పథాల మధ్య
నలిగిపోతున్న పి ఎస్ పి



న్యూఢిల్లీలో గాంధీజీ సమాధిమీద శ్రీమతి కెన్నెడీ తెల్లగులాబీ దండలు ఉంచారు

# లోక్, శాసనసభలలో వివిధ పార్టీల బలాబలాలు: సాంస్కృతిక ప్రగతికి జంతు ప్రదర్శనశాల ప్రాముఖ్యం

## శ్రీకృష్ణ

భారత ప్రజానీకం శ్రీ నెహ్రూకు మరో ఐదు సంవత్సరాల పరిపాలనాధికారాన్ని దత్తం చేసింది భారతీయ ప్రజాస్వామ్య నిర్మాతగా సంక్షేమ రాజ్య సిద్ధాంతం, సామ్యవాదవ్యవస్థ నిర్మాణం అన్న రెండు ప్రధాన లక్ష్యాలను ముందు ఉంచుకుని ఎన్నికల్లో ఆయన విజయం సాధించారు ఆయన యందు, ఆయన సిద్ధాంతాలయందు, ఆయన అనుసరిస్తున్న విధానాలయందు ప్రజలు విశ్వాసం వెల్లడించారు ఇంతకుమునుపు లోక్‌సభలో కాంగ్రెసు పార్టీకి గల మెజారిటీ కొద్దిగా తగ్గినా, ప్రతిపక్షాల నాయకులు శ్రీయుతులు డాంగే, అశోక్‌మెహతా, కృపలానీ, బాజ్‌పాయ్ మొదలైనవారంతా అదృశ్యులయ్యారు అంతేకాక ఈమారు ప్రతిపక్షాలవారు సమైక్యంగా అధికార పక్షాన్ని ఎదుర్కొనే అవకాశం బొత్తిగా లేదు వీరిలో మత తత్వవాదులు, స్వతంత్రపార్టీ సభ్యులు, సోషలిస్టులు, జనసంఘీయులు, హిందూమహాసభవారు ఉండటంచేత సునిశితమైన అభిప్రాయ భేదాలు చీలదీస్తాయి

మనది ప్రపంచంలోకెల్లా పెద్ద ప్రజాస్వామ్యం 21 కోట్ల మంది వోటర్లకు వోటింగ్ సదుపాయాలు కలిగించటమంటేనే ఘనకార్యంగా ఎంచవలసి వస్తుంది. 700 టన్నుల కాగితంతో 42 కోట్ల బాలట్ పత్రాలు ముద్రించారు 2,40,000 పోలింగు కేంద్రాలు నెలకొల్పారు వీటిలో 16,80,000 మంది ఉద్యోగులు పని చేశారు

పార్లమెంటులో రెండు సభలు ఉన్నాయి దిగువ సభ—లోక్‌సభ—లో ఏడు నామినేటెడ్ స్థానాలతో సహా మొత్తం 507 స్థానాలు ఉన్నాయి ఆరు స్థానాలు కాశ్మీరుకు ప్రత్యేకించారు మిగతా 494 స్థానాలకుగాను 485 స్థానాల ఫలితాలు ఇంతవరకూ తెలిశాయి వీటిలో 353 స్థానాలు కాంగ్రెసుపార్టీ, 29 స్థానాలు కమ్యూనిస్టుపార్టీ, 18 స్థానాలు కొత్తగా ఏర్పడిన స్వతంత్రపార్టీ గెలుచుకున్నాయి మిగతా స్థానాలన్నీ కూడా కాంగ్రెసుపార్టీకే లభించినా, వెనుకటి లోక్‌సభలో ఆ పార్టీకి ఉన్న స్థానాల కంటే ఇప్పుడు 11 స్థానాలు తక్కువగా ఉంటాయి

భారతదేశంలో కాశ్మీర్ కాక, 14 రాష్ట్రాలు, 4 కేంద్ర పాలిత ప్రాంతాలు ఉన్నాయి గోవా యింకా భారతదేశంలో విలీనం కాలేదు పార్లమెంటు శాసనరీత్యా అందుకు ఆమోదం తెలియజేయవలసి ఉన్నది

జమ్ము, కాశ్మీర్ రాష్ట్రంలో 19 స్థానాలకు, ఇతర రాష్ట్రాలలో మరో 7 స్థానాలకు మినహా, శాసనసభా స్థానాలన్నీ భర్తీ అయ్యాయి. ఈ మిగిలిన స్థానాలలో పోలింగ్ తరువాత జరుగుతుంది

ఇంతవరకు ఫలితాలు తెలిసిన 2,904 శాసన సభా స్థానాలకుగాను కాంగ్రెసుపార్టీ 1,774 స్థానాలు, స్వతంత్రపార్టీ 167 స్థానాలు, కమ్యూనిస్టుపార్టీ 153 స్థానాలు, ప్రజాసోషలిస్టుపార్టీ 149 స్థానాలు, జనసంఘం 115 స్థానాలు గెలుచుకున్నాయి జమ్ము కాశ్మీర్ రాష్ట్రంలో ఇంతవరకు ఫలితాలు తెలిసిన 56 స్థానాలలో 55 స్థానాలు జాతీయ మహాసభకు దక్కాయి

1957 ఎన్నికలతో పోల్చి చూస్తే ఇప్పుడు వివిధ పార్టీల బలాబలాలు దిగువ విధంగా ఉన్నాయి

1957 లో —కాంగ్రెసు 1913, కమ్యూనిస్టులు 107, జనసంఘం—46, ప్రజాసోషలిస్టులు 188, హిందూమహాసభ—0, సోషలిస్టుపార్టీ 0

1962 లో :—కాంగ్రెసు 1774, కమ్యూనిస్టులు 153, జనసంఘం 113, ప్రజాసోష

62—వ పేజీ చూడండి



## ముఖ్యమంత్రి శ్రీ కామరాజ్

ఇటీవల మద్రాసులో శ్రీ కామరాజ్ గురించి మాట్లాడుతూ ప్రధాన మంత్రి వీరు 'ఇంగ్లీషుకులం' వారు కారన్నారు మన నాయకులలో చాలామంది పాశ్చాత్య సంస్కృతి అలవరుచుకున్న తర్వాతనే స్వదేశాభిమానులయ్యారు సామాన్య ప్రజలతో ఏకీభావం కోసం లోలోపల పాశ్చాత్య వైఖరులు బాగా పాతుకుపోయినవారు కూడా వారి వేషభాషలు స్వీకరించారు మొదటినుంచీ నిరాడంబరంగానే ఉంటున్న దేశనాయకులు శ్రీ కామరాజ్ ఒకరేననిపిస్తుంది

అయితే ఈ నిరాడంబరం వెనుక ఎంత రాజనీతి దాగి ఉన్నదో వర్ణించటం తేలికయిన పనికాదు. మద్రాసు, బెంగాల్‌లలో తప్ప భారతదేశమంతటా వర్గవిభేదాలు చీలికలు అధికం అయిపోతున్నాయి. అంటే మద్రాసులో రాజకీయ పరిస్థితి క్లిష్టంగా లేదనికాదు. ప్రాకృతింగా సంపద ఎక్కువలేని ఈ రాష్ట్రానికి కావలసినన్ని సమస్యలు ఉన్నాయి. ద్రవిడ కజగం వంటి పార్టీల బలం తక్కువకాదు. అయినప్పటికీ కాంగ్రెసును సురక్షితంగా నడుపుకుంటూ వచ్చినకీర్తి శ్రీ కామరాజ్ దే ననటానికి సందేహం లేదు. బొంబాయి, పశ్చిమ బెంగాల్‌ల తర్వాత పారిశ్రామికాభివృద్ధి అధికంగా ఉన్న మద్రాసు రాష్ట్రం త్వరలో బొంబాయినే ఉత్పత్తిలో దాటిపోవచ్చునని నిపుణులనుకుంటున్నారు. మొన్నటిదాకా అఖిల భారత వ్యక్తిగత ఆదాయం కన్నా బాగా తక్కువగా ఉన్న మద్రాసు రాష్ట్రం వ్యక్తిగత ఆదాయం దేశం సంఖ్యను మించడం గమనింపదగ్గ విషయం.

కొందరికి రాజకీయాలు ప్రజాసేవకే అవకాశం తప్ప తమ అభిప్రాయాల ప్రకటనకోసం కాదని బ్రిటిష్ లేబర్ పార్టీ నాయకులు శ్రీ గైట్‌స్కెల్ ఒక సందర్భంలో వ్రాశారు ఇది శ్రీ కామరాజ్ విషయంలో పూర్తిగా నిజం ★



# కార్ట్యూనులు. 25

క్లిష్టపాత్రల్లో చతురంగారావు
దుష్టపాత్రల్లో క్రూరంగారావు
హడలగొట్టే భయంకరంగారావు
హాయిగొలిపే టింగురంగారావు
అలరించే విలాసంగారావు
రొమాన్సులో (చెయిస్తే) ఘూలరంగారావు
మనిషి మధు మధురంగారావు
మాటల్లో మహాచమత్కారంగారావు
కధ నిర్బలం అయితే హావభావాలు పాత్రపరంగా రావు
కళ్ళకట్టినట్టు కనబడేది ఉత్తి యశ్వైరంగారావు
ఆయన శైలి శీవి అన్యులకు సులభంగారావు
ఒకొక్కసారి డైలాగుల్లో మాత్రం యమకంగారంగారావు



193—



194—



195—



196—

రాజకీయ పరిణామాలు

# వర్గాతీత మంత్రి'వర్గం': హామీల అంతరార్థాలు

**కౌండిన్య**

మంత్రివర్గ నిర్మాణంలో శ్రీ సంజీవరెడ్డి కొత్త ఆలోక్యం చూపడంవల్ల రాష్ట్ర రాజకీయాలలో కల్లోలం సద్దుమణిగే ప్రమాదం తప్పిపోయింది. అసలు తగాదా అనేది లేకపోతే రాజకీయ జీవితం స్తబ్ధంగా ఉంటుందని మన నాయకుల నమ్మకం. ఇందులో కొంత నిజం లేకపోలేదు. ఒరపిడివల్ల జ్వాల పుట్టినట్లు, సంఘర్షణ లుంటేగాని కొత్తవారు పైకి రారేమో? పూర్వం పట్టాభి, కళా వర్గం ఒక వైపున, రంగా, ప్రకాశం వర్గాలు మరొక వైపున తల పడకపోతే శ్రీ సంజీవరెడ్డి యింతటి వాడయ్యేవాడా అని సందేహం. అట్లాగే సంజీవరెడ్డి అల్లూరి మధ్య తగాదా లేకపోతే సంజీవయ్య రాష్ట్ర నాయకు డయ్యేవాడు కాదనడం నిస్సంశయం. ఈ పరమ సత్యాన్ని గ్రహించి రాష్ట్ర



శ్రీ ఎన్. సంజీవరెడ్డి.

క్షేమాన్ని కాంక్షించి, ఆనాటినుండీ నేటి వరకూ తగాదాలు ఆగిపోకుండా జాగ్రత్తగా పోషించుకుంటూ వస్తున్నట్లు కన్పిస్తోంది. అదీగాక బహునాయకత్వానికి ప్రసిద్ధిచెందిన మనం నిత్యమూ స్పర్థలలో నిమగ్నమై పదేపదే ఢిల్లీకి పరుగెత్తుతపోతే, పైవారి దృష్టి మనపై ప్రసరించదేమో నన్న భయం కూడా ఉంది.

శాసనసభా కాంగ్రెస్‌పార్టీ నాయకుడుగా శ్రీ సంజీవరెడ్డి ఎన్నికవగానే, ఇక వర్గాలనేవి ఉండవు, అంతా నా వర్గంవారే నని హామీ యిచ్చేసరికి మనస్సులు మారాయని, ఇక ఈ అగ్ని ఇంతటితో చల్లారిపోవచ్చుని కొందరు భ్రమపడ్డారు. అది భ్రమేనని, తరువాత పరిణామాలవల్ల తేలిపోయింది. అదిగాక పదవుల పంపిణీ వద్ద తగాదా పడకపోవడ మన్నది మానవ స్వభావానికి, అందులోనూ మన కాంగ్రెస్‌వారి నైజానికి పూర్తిగా విరుద్ధం. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటయ్యే ముందు ముఖ్యమంత్రిత్వం కోసం సంజీవరెడ్డి, గోపాలరెడ్డి తగాదా పడ్డారు. అనంతరం సంజీవరెడ్డి, అల్లూరి మధ్య వ్యవహారం బెడిసింది. ఆ తగాదా రాజీగా మారి శ్రీ సంజీవయ్య హయాం వచ్చింది. అంతలోనే మళ్లీ మొదలు. ఇప్పుడు శ్రీ సంజీవరెడ్డి మంత్రివర్గం, ముందు రాజీతో మొదలై రగడలో పడింది. ఇదీ ఆంధ్ర రాజకీయాల చరిత్ర. ఈ చరిత్రగతి గమనిస్తున్నవా రెవరికీ, ఇప్పుడు శ్రీ



శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి.

సంజీవరెడ్డి నిర్మించిన మంత్రివర్గ స్వరూప స్వభావాలు చూచి ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. స్వజనంతో నిండిన ఏకాండపు మంత్రివర్గమని కొందరు విమర్శిస్తున్నారు. ఇక వర్గాలనేవి ఉండవని అంతా నావారే నని ఆయన మొదట్లోనే నిర్మొగమాటంగా చెప్పారు గదా? దాన్ని అపార్థం చేసుకుంటే ఎట్లా. అయితే అధిష్ఠానవర్గం సలహా త్రోసివేసినట్లు కాదా, అన్ని వర్గాలకు తావిచ్చి విశాల ప్రాతిపదికపై మంత్రివర్గాన్ని నిర్మించమని వారు చెప్పలేదా అని అనవచ్చు. అలా అనే వారు పొరపడుతున్నారు. శ్రీ సంజీవరెడ్డి కాంగ్రెస్ అధ్యక్షపదవికి రాజీనామా యిచ్చినా, ఆ రాజీనామాను



శ్రీ ఎం. చెన్నారెడ్డి.

ఎ. ఐ. సి. సి. ఇంకా ఆమోదించలేదు గాబట్టి, ఇటు ముఖ్యమంత్రిత్వంతోబాటు, అటు కాంగ్రెస్ అధ్యక్షులుగా కూడా వా రుంటున్నారు. అటువంటప్పుడు కాంగ్రెస్ అధ్యక్షులకు మించిన అధిష్ఠానవర్గమేమిటి? ఒకవేళ యూ దాలా సంగా అ సలహాలు అంకించినా, అమలు జరుపడానికి వచ్చేసరికి మనస్సు మార్చుకునే హక్కు తమకున్నదని ఆయన అననేఅన్నారు. మనస్సనేది బహు చంచలం

59—వ పేజీ చూడండి



శ్రీ మీర్ అహమ్మద్ అలీఖాన్.

# తెర వెనుక తారలు-4



వార్ధక్యంలో "శబరి" గా పండరీబాయి
ప్లాస్టిక్ మేకప్‌లో

"మానసిక ప్రవృత్తులకు విషయసూచక ముఖారవిందం" అని పెద్దల సుద్ది. ముఖం చూడగానే దాని యజమాని ఎటువంటి గుణగణాలు కలవాడో మనం చదువుకోగలుగుతాము. ఇది సృష్టిలోని వైచిత్రి. లలితకళలంటే అభిరుచి కలవాడు, అందులో ప్రవేశం ఉన్న వ్యక్తి, ప్రావీణ్యం సంపాదించిన కళాకారుడు, ప్రఖ్యాతి నందుకున్న ప్రబుద్ధుడు— ఈ నాలుగురకాల మానవులకూ, నాలుగురకాల సూచనలు వారి ముఖాల్లో కనుపించకుండా దాక్కోలేవు. అదే విధంగా దుష్టబుద్ధులు వారి తొలిచూపులోనే ద్యోతక మౌతూంటారు. వారి ముఖంలో కళ్ళు, కనుబొమలు, ముక్కు, మూతి, నుదురు, జుట్టూ, కట్టూ, బొట్టూ వారి మనస్సుల్లో దాగిన ప్రకృతిని బైటపెడుతూంటాయి.

మనోభావాలకు వ్యతిరేకంగా మరో భావాలను ప్రదర్శించే గోముఖవ్యాఘ్రాలుకూడా రెల్లు దుబ్బులచాటున గుడ్లు మిటకరించే "కుమావ్ పెద్దపులి"లాగ పట్టుబడక మానరు. ప్రతీ పోలీస్ స్టేషన్‌లోనూ నికార్సయిన చలామణిలో ఉన్న దొంగల ఛాయాచిత్రాలన్నిటినీ ఒక్కసారి రవ్వంత ఓర్పుతో పరిశీలిస్తే వారి ముఖారవిందాలలో "చోరభావం" చురచుర మని తెలుస్తూనే ఉంటుంది; వారిలో పోలికలు, అంతర్గత మానసిక భావాల సామీప్యం స్పష్టమౌతూనే ఉంటాయి. గుణాలు జీవితంలో మారవు; కాని, శారీరకంగా మార్పులు కనబడతాయి. అది వయో ప్రభావం.

వయస్సుయొక్క నడకలనుబట్టి మానవుల రూపం మారుతూంటుంది ముఖం వయస్సుని కూడా దాచుకోలేదు. చేటలో చెలరేగె చిరునవ్వుల ప్రాయంనుంచి, పరలోకపు ప్రయాణానికి శ్రీముఖం అందబోయే అవస్థవరకు ముఖంలో నాలుగుదశలూ కనబడతాయి.

సృష్టిలోని ఈ మాయాజాలాన్నంతని కవులు తీరుబడిగా, తాపీగా సుగుణాలరాశినీ, దుర్గుణాల ప్రోవునీ భౌతిక, మానసిక లక్షణాలను వివరిస్తూ వ్రాస్తారు. వాటికి చిత్రకారులు కుంచెతో రూపం అందిస్తారు; మేకప్ కళాకారులు ముఖారవిందాన్ని ఆ గుణాలతో తద్వ్యతిరేకమైన ముఖంపై ముద్రిస్తారు. నటుడు గుణగణాలను కుదించి మేకప్‌మాన్ అందించే ఆహార్యంతో అతికే నటనను, మాటల్లో చేతల్లో చూపించి ఒక పాత్రను కళ్లకు కట్టినట్లు నిర్వహిస్తాడు.

చలనచిత్ర రంగంలో చలామణీ అవుతున్న నటీనటులు హీరోలుగా, హీరోయిన్లుగా, విలన్‌గా, వాంప్‌లుగా విభజింపబడ్డారు. కొత్తగా ప్రవేశించే నటవర్గంలోనివారిని ఈ నాలుగు తెగలలోనూ ఏదో ఒక తెగకు "టైప్" చేసేస్తారు మరొక ముఖ్యమైన తెగ ముసలివేషాలు; చిన్న వయస్సులోనివారు నిర్వహించవలసివచ్చే ఈ రకం వేషాలలో దూర్చటం, నిర్వహించటంకూడా చాలా కష్టం.

[ఈ ఉపోద్ఘాతాన్నిబట్టి చిత్రసీమలో విలన్, వాంప్ వేషాలు నిర్వహించేవారు దుష్టులని నిర్ణయించరాదని మనవి. అది వేరొక అధ్యాయం దుష్టపాత్రలకు కావలసిన అలంకారాలను విలన్‌లుగా నటించేవారి ముఖారవిందాలపై తేలికగా దిద్దవచ్చుననే భావంతో ఆయానటులకు ఆయా పాత్రలు అందిస్తారని పాఠకులు గుర్తుంచుకోవాలని కోరుతున్నాము ]

నటుడికి ఒక ఆకృతిని అందించటం ఒక ఎత్తు; దాని ఊతతో ఆపాత్రను నిర్వహించటం మరొక ఎత్తు ఈ రెండురకాల యత్నాలూ సమగ్రంగా సాగిననాడు ఒకపాత్రకు జీవం వస్తుంది తెలుగు చలనచిత్రరంగంలో రూపాలంకరణకళాకారులలో పితామహులు మంగయ్య, హరిబాబుగార్లు హరిబాబుగారు చేసిన పీట్స్‌లో ఇప్పటికీ తలుచుకుంటే కళ్లెదుట ప్రత్యక్షమయ్యే ప్రతిబింబాలు రెండు — కోటయ్య, శ్రీ రంగారావు (ఎస్ వి)లు, "బంగారుపాప" చిత్రంలో వీరిద్దరూ విడదీయ వీలులేని కవలలు దుష్టుడుగా, సాధువుగా మారిన మామూలు మనిషి కోటయ్యలోని భౌతికపరిణామాలను అటు హరిబాబుగారు, ఇటు రంగ రావుగారు ఉత్తమంగా ప్రదర్శించారు

నటనకు ప్రాథమికమైన, అత్యవసరమైన ఈ రూపాలంకరణలో గురుదేవుడైన హరిబాబుగారి శిష్యుడు పీతాంబరం ఈమధ్య విడుదల కానున్న "భీష్మ" చిత్రంలో శ్రీ ఎన్ టి రామారావుకి మూడుదశలలోని భీష్మాచార్య రూపాన్ని ప్రతిభావంతంగా అందించాడు, అద్వితీయంగా శ్రీ రామారావు ఆ పాత్రను నిర్వహించారు వీరిద్దరి కృషి ఆ చిత్రానికి, ఆ పాత్రకు సమగ్రంగా సాగింది

మేక్స్ ఫేక్టర్ కంపెనీవారు ప్రపంచంలోని చలనచిత్రపరిశ్రమకు ఉపయుక్తమైన మేకప్ సామగ్రిని ఉత్పత్తిచేస్తున్నారు అన్ని రకాల రంగులు, రంగుల్లో ముదర, లేత ( షేడ్స్), పేస్ట్‌లు, పౌడర్లు తయారుచేసి మేకప్‌రూపాన్ని అలంకరింప జేస్తున్నారు వాటిని ఏయే పాళ్లలో, ఎక్కడెక్కడ, ఏవి వెలుగునీడలకు ఏవిధంగా, ఏయే ముఖంపై ఏవిధంగా వాడాలో తెలును

—58 వ పేజీ చూడండి



మేకప్ కళాకారుడు పీతాంబరం ఎన్ టి రామారావుకు
"భీష్మ" రూపురేఖలు దిద్దుతున్నాడు

# ఈ వారం సినీ విహారం

మధుమూర్తి

సరిగ్గా పదకొండు సంవత్సరాల అనంతరం తిరిగి చెన్నపురిలో తారలకూటమి సంభవించింది 1951 లో మద్రాసుకి బొంబాయి నుంచి సినిమాతారలు వచ్చి ఇక్కడున్నవారితో చేరి క్రికెట్‌ఆట ఆడారు తిరిగి ఈ ఏడాది ఈనెల 10 వ తేదీన మదరాసులో మహత్తరమైన గ్రహకూటమి ఏర్పడింది

రెడ్ క్రిసెంట్ కేన్సర్ హాస్పిటల్ నిధి సేకరణకు ఆసంస్థ నిర్వాహకులు తారల క్రికెట్ ఆట తలపెట్టడం, ఈ మహోన్నతమైన దేశసేవకు బొంబాయి మదరాసు తారలు అంగీకరించటం జరిగింది మార్చి 11 వ తేదీని క్రికెట్ ఆటకు నిర్ణయించారు

ఆ తేదీకి ఒకరోజు ముందుగానే విమానంలో బొంబాయి తారలు చెన్నపురి చేరుకున్నారు ఆక్షణంనుంచి ఈ పట్టణంలో పాతికవేల మంది దృష్టి తారల క్రికెట్ ఆటపై ప్రసరించబడింది

రాజ్ కపూర్, దిలీప్‌కుమార్, అశోక్‌కుమార్ (పద్మశ్రీ బిరుదాంకితుడైన తార), షమ్మికపూర్, అజిత్, రాజేంద్రకుమార్, ఆగా, జానీవాకర్, శశికపూర్, ప్రాణ్, ఐ ఎస్ జోహర్, మహమూద్, మారుతి, సంగీతదర్శకుడు జైకిషన్, నిరుపారాయ్, వహీదా రహమాన్, శ్యామ, షమ్మి, శుభాఖోటే, నంద, షైలా లతీఫ్, రాజ్ కౌర్‌లు బొంబాయినుంచి వచ్చిన వెండితెర వెలుగులు

ఈ ఆటలో చెన్నపురి చిత్రపరిశ్రమకు చెందిన తారలు ఇంచుమించు అందరూ పాల్గొన్నట్లే ప్రముఖులలో నాగేశ్వరరావు, ఎన్ టి రామారావు, తంగవేలు, ఎం ఆర్ రాధ, జగ్గయ్య, బి సరోజాదేవి, గుమ్మడి వీరిలో కలవకపోవటం విచిత్రంగాకే కనబడింది జెమినీగణేశన్, శివాజీగణేశన్, నంబియార్, ఎస్ వి రంగారావు, రమణమూర్తి, హరనాద్, అశోకన్, బాలాజీ, చంద్రబాబు, టి ఆర్ రామచంద్రన్, ఆనందన్, నాగేష్, పార్థివన్, మనోహర్, ప్రేమ్‌నజీర్, సావిత్రి, జమున, దేవిక, రాగిణి, రాజసులోచన, వాసంతి, విద్యావతి, పద్మినీ ప్రియదర్శిని, ఇ వి సరోజ, చంద్రకాంత, విజయలక్ష్మిలు ఈ క్రికెట్ ఆటలో పాల్గొన్నారు ఎం జి రామచంద్రన్ ఆడకపోయినప్పటికీ ఈ కార్నివల్‌కు హాజరయాడు

రెండు జట్లులుగా విభజించబడ్డారు ఈ తారలు అందులో ఒక బృందానికి రాజ్ కపూర్, మరొకదానికి జెమినీగణేశన్‌లు కెప్టెన్లు

49—వ పేజీ చూడండి



మద్రాసు కార్పొరేషన్ స్టేడియంలో జరిగిన ఫిల్మ్‌తారల క్రికెట్ పోటీలో పాల్గొన్న పద్మినీప్రియదర్శిని, రాజసులోచన, వహీదారెహమాన్, రాగిణి, జమున.




## లివరు: ప్రోటీనులు

ప్రోటీనులు, శర్కరలు, కొవ్వుపదార్థములు అని భోజనపదార్థములు మూడు విధము లని ఇదివరకే తెలుసుకున్నాము అందులో శర్కరలు, కొవ్వుపదార్థములు జీర్ణమై, ఆహరించబడి, శరీరంలో ఎల్లా ప్రవేశించేదీ, ఆకార్యక్రమంలో లివరు ఏ విధులు నిర్వహించేదీ ఇదివరకే తెలుసుకున్నాము ఇప్పుడు ప్రోటీనులు ఏవిధంగా జీర్ణమయ్యేదీ ఎల్లా ఆహరించబడేదీ' అవి లివరులో ఏ మార్పులు చెందేదీ తెలుసుకుందాము

"ప్రోటోస్" (Protos) అన్న పాశ్చాత్య భాషాపదానికి 'మొదటి' అని అర్థము తక్కిన ఆహారపదార్థముల పేరులు వాటిలోఉండే వస్తువులనుంచి వచ్చినవి 'కార్బో హైడ్రేట్' 'హైడ్రోకార్బన్' ఇటువంటివి కాని ప్రోటీనులలో 'నైట్రొజన్,' 'హైడ్రొజన్', 'ఆక్సిజన్' మరికొన్ని మూలవస్తువులు చేరివుంటవి వాటి నన్నిటినీ సూచించే పేరు కల్పించకుండా 'ప్రోటీన్' అనే మాటనే వాడడానికి చాలా కారణములు ఉన్నవి దేశభాషలలో ప్రోటీన్ అన్న మాటను 'ప్రోటీను' అనే వాడవలసిన అవసరం ఎంతైనా ఉన్నది

జీవితానికి మూలము "ప్రాణశక్తి" అత్యంత ఆధునిక వైజ్ఞానిక పరిశోధనలవల్ల, "ప్రాణశక్తి" అన్ని రసాయనికవస్తువులలోనూ సంచరించి వాటిని సంచలింపచేయలేదు ఒక పంచదార కణము 'ప్రాణిగా' చరించలేదు కాని ప్రోటీన్ కణము ప్రాణిగా చలించగలదు ఎలెక్ట్రిసిటీ కొన్ని వస్తువులలోనుండి మాత్రమే ప్రవహించగలిగినట్లు ప్రాణశక్తి కొన్ని వస్తువులలో మాత్రమే తన ప్రభావమును ప్రదర్శించగలదు 'చైతన్యత' వేరు, ప్రాణశక్తి వేరు వస్తువుకు 'జీవి' గా వ్యక్తిత్వాన్ని ఇచ్చేదీ, చలనం, వృద్ధి, ఆహారసేకరణ మొదలయిన ప్రాణిలక్షణములను ప్రసాదించేదీ 'ప్రాణశక్తి' జీవుల శరీరంలో అనేక రసాయనిక ద్రవ్యములున్నా ప్రోటీనులో మాత్రమే ప్రాణశక్తి సంచరించగలదు శర్కరలవంటి రసాయనిక పదార్థములలో, అణువులు కలిసి ఉండేవిధం వేరు, ప్రోటీనులలో కలిసి ఉండేవిధం వేరు, ఆవిషయం అర్థం చేసుకోటానికి చాలా రసాయనిక విజ్ఞానం కావాలి కాని, అన్ని మూల వస్తువులలో (Elements) వున్న అణువులకూ ఇతర మూలవస్తువుల అణువులను ఆకర్షించి వాటితో అంటిఉండే శక్తి ఉంటుంది దానిని ఇంగ్లీషులో "వేలెన్సీ" (Valency) అంటారు సాధారణ రసాయనికవస్తువులలో అణువులు ఒక దానిని ఒకటి తాగా అనుక్కుని ఉంటవి ప్రోటీనులలో అణువులు అంటివుండే ప్రదేశం అతి స్వల్పంగా ఉంటుంది ఇంతేకాదు ప్రోటీను కణంలో అణువులు, బిరడాలు తీసే కార్కు (స్క్రూ)లో లాగా, తీగల కొనలలాగా చుట్టు మెట్లులాగా, 'సవ్యక్రమం'లో (Clockwise) అనుకొని ఉంటవి ఒకప్పుడు ప్రోటీన్‌కణం (Molecule) లో అణునిర్మితి ఎల్లా ఉండేదో తెలుసుకునే సాధనములు ఉండేవికావు కాని, అణువిజ్ఞానం అభివృద్ధిచెందినతరువాత ఎలెక్ట్రాన్ మైక్రాస్కోప్ అనే దుర్భిణీయంత్రవిశేషంతో ప్రోటీన్ కణంలో అణువులు పై విధంగా ఏర్పడివున్నవన్న సంగతి శాస్త్రజ్ఞులు గ్రహించారు

ఈవిధంగా నైట్రోజన్ అణువులు ఇతర అణువులతో చుట్టుమెట్లలాగా సవ్యక్రమంలో అంటే గడియారంముళ్లు తిరిగినట్లుగా కుడినుంచి ఎడమకు— గోలీలు అనుకున్నట్లుగా అతుక్కుని ఉంటేనేగాని అది ప్రోటీనుకణము కాదు ప్రోటీన్‌కణములోగాని ప్రాణశక్తి సంచరించదు ప్రాణశక్తి ఉన్న వస్తుఖండము "ప్రాణి" ప్రాణిశ్రేణిలో అతి సూక్ష్మమైన జీవి ఏకకణశరీరి అయిన "ఎమీబాప్రోటియస్" ఇక్కడ "ప్రోటియస్" అన్న మాటకు "ఆది" అని అర్థము అల్లాగే ఇప్పటికి శాస్త్రజ్ఞులకు తెలిసిన పరమోత్కృష్టజీవి మానవుడు'! ప్రాణశక్తి ఉన్న అనేకకోట్ల జీవకణముల సముదాయంవల్ల మానవశరీరం ఏర్పడింది కాని ఈమధ్య ఎమీబాకన్న నూర్లాది సూక్ష్మములయిన 'వైరసులు' (Viruses) అనే క్రిము లున్నవని శాస్త్రజ్ఞులు కనిపెట్టారు అవి సాధారణ దుర్భిణిలో కనిపించవు ఇతరక్రిములను అరికట్టే ఫిల్టర్లలో నుంచి అవి దూరిపోతవి. కాని ఎలెక్ట్రాన్ మైక్రాస్కోప్‌ద్వారా వాటిని చూడవచ్చును. మరీ సూక్ష్మజీవి 'ప్రాణశక్తి' ఉన్న ప్రోటీన్‌ఖండము అంటే ఆశ్చర్యములేదు. ప్రోటీనుకూ ప్రాణశక్తికీ సంబంధం ఉన్నది. ప్రోటీనులు కృత్రిమంగా ఉత్పత్తిచేయడానికి వీలులేదు. ప్రోటీనులు మనకు ప్రాణులనుంచి రావలసిందే. ప్రాణులు, వృక్షములు, జంతువులు అని రెండురకములు. ఇందులో వృక్షములు, భూమిలోనూ, గాలిలోనూ ఉన్న నైట్రోజన్, ఆక్సిజన్ హైడ్రోజన్ కణములను సేకరించి తమకని కావలసిన ప్రోటీనులను సృష్టించుకొంటవి. కాని జంతువులకు ఆ శక్తి లేదు. అవి తమకు కావలసిన ప్రోటీనులను, ఇతరప్రాణులను భక్షించి సమకూర్చుకోవలసిందే. శాకాహారు లయినా, మాంసాహారులయినా ఇతరప్రాణులను భక్షించి జీవించేవారే కాని వృక్షములకున్న యీ ప్రోటీన్ నిర్మాణశక్తి కొందరు యోగసాధనులకు లభిస్తుంది అందుచేతనే వారు వాయువునుండి యీ వస్తువులను సేకరించి తమశరీరంలో జీవిత కార్యకలాపానికి కావలసిన ప్రోటీనుమ నిర్మించుకోగలరు కాని యోగులయినా వాయువుకూడా లేనిచోట జీవించలేరు ఈ భౌతికశరీరం—దీనినే మనవారు పాంచభౌతికదేహమన్నారు—వాయువు లేనిచోట, జీవించలేదు కొన్ని యోగసాధనముల ద్వారా వాయుభక్షణతో జీవించవచ్చును. ఈ విషయం చూచినవారు మాత్రమే నమ్మగలరు ఇది సాధారణ మానవదేహానికి సాధ్యంకాదు వ్యోమమార్గంలో పైకిపోయినకొద్దీ వాయువు — మనకు తెలిసిన గాలి—తగ్గిపోతుంది క్రమంగా అంతరించిపోతుంది అందుచేతనే వ్యోమయానం చేసేవారు ఆహారాన్నీ ప్రాణవాయువునూ దగ్గరపెట్టుకుని, ఈ శరీరం భరించే పీడనశక్తి ఉన్న గోళాల్లో కూర్చుని మరీ పైకిపోవాలి ఈ మన భౌతికదేహంతో కొంత వరకే పైకి పోవచ్చును కాని ప్రాణశక్తి ప్రసరించడానికి ప్రోటీన్ అధారమూ, ఆవరణమూ కూడా అయితే ఎంత ప్రోటీన్ ఈ ప్రాణధారణకు అవసరము? మనదృష్టికీ, మామూలు మైక్రోస్కోపుకూ కూడా అందని వైరస్ శరీరంలో ఎంత ప్రోటీన్ ఉన్నది ? జీవితకాలంలో మనచేత ఇన్ని అద్భుత కార్యములను చేయించే ఈదేహంలో ప్రాణమన్నది పోగానే, సర్వకార్యములూ ఆగిపోతవి మరణానంతరం ప్రాణ మేవుతున్నది ? అది వస్తు విశేషమా ? వస్త్వేతరమా ? (Material or Immaterial) వస్తుఖండమా ? మనకు అభిప్రాయాలూ, అభిరుచులూ, ఆశలూ, ఆశయాలూ కల్పించే మనస్సు, ఇతరులు గ్రహించలేని వాటిని గ్రహించేశక్తి యిచ్చే 'బుద్ధి', ఇది 'మంచి' అది 'చెడు' అని ప్రబోధించే అంతరాత్మ, శరీరభాగములా శరీరేతరములయిన శక్తులా ? వస్తువనే "ఆవరణ" "ఆధారం" లేకుండా శక్తి, శక్తిగా ఉండగలదా ? "జీవి" అన్నది వస్తుఖండమని వేస్మితమైన ప్రాణశక్తి ఆ శక్తి అన్ని జీవుల్లోనూ అన్ని ఖండములుగా ఉన్నదా ? లేక లోఛ్ను

56—వ పేజీ చూడండి



*జరిగిన కథ*

రామవరం ఆంధ్ర - ఒరిస్సా రాష్ట్రాల సరిహద్దు ప్రాంతంలో ఒక గ్రామం శ్యామబాబు అక్కడ దిగి, ఆ ఊరిలోనే వైద్యవృత్తి చేసుకుంటున్న రాధానాథ మిశ్రాగారిని కలుసుకుని ఆయన సహాయంతో ఉద్యోగం సంపాదించుకుంటాడు. రామవరంలోని మిల్లు యజమాని సత్యనారాయణరావుగారు తన పిల్లలకు శ్యామబాబు ట్యూషన్ చెప్పే ఏర్పాటు చేయిస్తాడు నారాయణ మిశ్రాగారి పనిమనిషి మిశ్రాగారు త్రాగుబోతు ఒకరోజున పోలీసులు ఆయనను పట్టుకుంటే శ్యామబాబు జరిమానా చెల్లించి విడిపిస్తాడు మిశ్రాను విడిపించుటకు హామీ నిల్చిన సూర్యప్రకాశరావు పేకాటలో ధనం పోగొట్టుకొని ఆత్మహత్యకు పూనుకొనగా శ్యామబాబు రక్షిస్తాడు మిల్లు గుమాస్తా ధర్మసూరి కుమార్తె లలితను చూసి శ్యామబాబుకు పూర్వస్మృతులు వస్తాయి లలితను వివాహం చేసుకోవాలని, ధర్మసూరి మేనల్లుడు శంకర్ ధర్మసూరిగారింటికి వస్తాడు ధర్మసూరిగారు తన కుమార్తెను శంకర్‌కు చేసుకోవలసిందిగా శంకర్ తలిదండ్రులను అడిగి విఫలుడౌతాడు. తన తలిదండ్రులకు ఇష్టంలేకపోయినా లలితను వివాహమాడ్తానని శ్యామబాబుతో శంకర్ అంటాడు ధర్మసూరిగారు వేరే సంబంధం చూసి లలిత పెళ్ళి చేయాలనుకుంటారు శ్యామబాబుకు రామవరం జమీందారగు కాంతారావుతోను, దినకరరావు అనే వ్యవసాయశాఖోద్యోగితోను పరిచయం ఏర్పడుతుంది బంగారం చేసే ప్రక్రియలో పిచ్చుగల కాంతారావును మిశ్రా, శ్యామబాబులు మంచిమార్గంలో పెట్టారు. శ్యామబాబుకు తలపై గాయం తగలగా లలిత డాక్టర్ని పిలుచుకొని మందిప్పిస్తుంది

కాదనీ, కేవలం స్నేహాభిమానాలతో లలితా, ఆమె తల్లీ మొదలైనవారు శ్యామ్‌బాబుకు సేవచేస్తున్నారనీ తెలుసుకున్నాడు పైగా శ్యామ్‌బాబు ట్రీట్‌మెంటుకు లలితవద్ద ఫీజు వసూలు చెయ్యడం సబబు కాదని అనుకొన్నాడు పైగా శ్యామ్‌బాబు తన ఫీజు పుంచుకోడని నమ్మకం కలిగింది

మరికొద్దిరోజులు గడిచాక, కుట్లను విప్పేసినప్పుడు డాక్టరు తనకు లలిత బంగారుబిళ్ళ ఇచ్చిన విషయం శ్యామ్‌బాబుతో చెప్పాడు కుట్లు బాగా కలిసిపోయాయనీ, మరేమీ భయపడవద్దనీ శ్యామ్‌బాబుకు చెప్పాడు ఆహార విషయంలో ఏమేమి జాగ్రత్తలు తీసుకోవాలో కూడా చెప్పాడు

మొత్తానికి గాయం పూర్తిగా మానటానికి నెలరోజులు పట్టింది ఈ నెలరోజులూ లలిత శ్యామ్‌బాబుకు చేసిన సేవ ఇంతా అంతా అని చెప్పడానికి వీలులేదు

ఈ నెలరోజులూ ధర్మసూరిగారి కుటుంబం ఎన్ని ఇబ్బందులు పడ్డారో ఒక్క భగవంతుడికే తెలుసు మొదటి విషయం హైద్రాబాదు వెళ్ళిన ధర్మసూరిగారు ఈనెలా పూర్తయ్యేదాకా తిరిగి రాలేదు తాము నిత్య దరిద్రం అనుభవించడంతో

పదమూడు రోజులు బాగా జ్వరం కాసింది శ్యామ్‌బాబుకు ఎంతసేపూ గాయం బాధ తప్ప, మరొక స్పృహలేదు "అబ్బా! అబ్బా!" అని మూలుగుతూండేవాడుగాని, అతనికి ఏం జరుగుతోందో కూడా తెలియటంలేదు నాలుగోరోజు జ్వరం తగ్గింది అంతవరకు ఆయనకు స్పష్టంగా ఆలోచించగల శక్తి కూడా లేదు ఈ మూడు రోజులలోను అయిదారుసార్లు "శశీ!" అని పిల్చాడు లలిత వెళ్ళి "ఏం కావాలి బాబాయి?" అని అడిగితే, ఆమె వేపు చూసి, "దేవీ! నువ్వా తల్లీ! దాహం!" అనేవాడు లలితను ఎక్కువసార్లు 'దేవీ!' 'దేవీ!' అని పిలుస్తూండే వాడు నాల్గవనాడు డాక్టరు రాగానే, "మద్రాసుకు ఫోన్ చేశారా?" అని అడిగాడు శ్యామ్‌బాబు అతన్ని

డాక్టరు, "లేదు ఫోన్ చెయ్యమంటారా?" అని అడిగాడు

శ్యామ్‌బాబు కొద్దిగా ఆలోచించి, "వద్దులెండి" అన్నాడు

డాక్టరు క్రిష్ణమూర్తి, శ్యామ్‌బాబు మొహాన్ని ఎక్కడో చూసినట్లుందనుకున్నాడు కాని జ్ఞాపకం తెచ్చుకోలేకపోయాడు కాని, అతను తను మొదట అనుకున్నంత సామాన్యుడు కాదనుకున్నాడు క్రమక్రమంగా అతను లలిత, శ్యామ్‌బాబుకేమీ చుట్టం

పాటు, శ్యామ్‌బాబుకు కాఫీ, బార్లీ, రొట్టె, కూర, నెయ్యి మొదలైనవాటన్నిటికోసం దేవుళ్ళాడాలి కిరాణా కొట్టువాణ్ణి లలిత వెళ్ళి గంటలకొద్దీ బతిమాలితేనే గాని అరువు ఇచ్చేవాడు కాదు ఇంట్లో కట్టెలు మొదలుకొని అన్ని వస్తువులకూ ఇబ్బందే వీళ్ళుపడే ఇబ్బందులు, లలిత తనదగ్గర లేనప్పుడు, రామునీ, శీనునీ, పద్మనీ తన దగ్గర కూర్చోపెట్టుకొని ఈ విషయాలన్నీ లాగేవాడు, శ్యామ్‌బాబు ఒక్క డాక్టరు విషయంలో మాత్రం తాము ఏమీ బెంగపెట్టుకో నక్కర లేకుండా జరిగింది ఇన్ని చికాకులు పడినా,

—46 వ పేజీ చూడండి

*

'కళ'

ఈమధ్య రోజులు మారిపోయాయని కోడళ్ళు అత్తలను ఏంతమాత్రం లక్ష్యపెట్టడం లేదని మన సంఘం దృక్పథంలో చాలా మార్పులు వచ్చాయని అనుకొంటూ ఉంటాము. అది కొంత వరకూ నిజమే కాని కొద్దిగానో గొప్పగానో మార్పు వచ్చినా అత్తల సాధింపులూ ఆడపడుచుల సాధింపులూ మాత్రం ఇంకా చాలచోట్ల చూస్తూనే ఉంటాం. ఆ అత్తగార్ల విషయం అనేకమంది రాస్తూంటారు. ఈమధ్య ఒక ఇంగ్లీషు పత్రికలో చదివాను—ఒక సైకాలజీ ప్రముఖుడు ఈ అత్తగార్లను గురించి రాస్తూ అత్తలు కోడళ్లను సాధించడం కోడలి పట్ల ఉన్న ద్వేషం కొద్దీ కాదు చిన్నప్పట్నుంచీ పెంచిన కొడుకు తనకన్నా ఎక్కువగా ఇంకొకరిమీద ఇష్టత చూపిస్తున్నాడని ఒక విధమైన హెల్ప్‌లెస్‌నెస్ అని వ్రాశారు. కోడల్నే సర్దుకుని ప్రవర్తిస్తే ఇదీ సరిపోతుందని వ్రాశారు.

కాని అత్తలమాట అటుంచి ఆడపడుచులు వదినెలను నానా మాటలూ అనడం వాళ్ళ మనసులు నొప్పించడం ఇప్పటికీ మన కుటుంబాలలో చూస్తున్నాము. మొన్న సంక్రాంతి పండగ వచ్చింది కదూ? అప్పుడు చుట్టుపక్కల నలుగురి ఇళ్లకూ ఆడపడుచులు వచ్చారు. వాళ్ల ఇళ్లల్లో జరుగుతున్న సంఘటనలన్నీ చూచేటప్పటికి మా యింట్లో ఆ సంగతి చర్చించడం మొదలెట్టాం. ఒక్కొక్కరూ ఈ విషయం గురించి కొన్ని కొన్ని అభిప్రాయాలు చెప్పారు. అంతే కాకుండా అక్కడక్కడ జరిగిన సంఘటనలు కూడ చెప్పారు.

మా యింటి ప్రక్కింట్లో ఒకావిడ ఉంది. ఆవిడ చాలా నెమ్మది మనిషి. వాళ్లింటికి పండక్కి ఆడపడుచులు వచ్చారు. ఆవిడ వాళ్లను తృప్తిపరచడానికి పడుతున్న బాధలు వాళ్ల సాధింపులూ చూస్తుంటే ఆవిడమీద ఎంతో జాలి కలుగుతుంది. ఆవిడకు నలుగురు ఆడపడుచులు. ఆఖరమ్మాయి కింకా పెళ్లి అవలేదు. అంచేత ఆ అమ్మాయి ఇక్కడే అన్నయ్యగారింట్లో ఉంది. మిగతా ముగ్గురూ పండక్కి హాజరయ్యారు. పండక్కి ఇంకా ఒక నెల రోజులు ముందే వచ్చేశారు. వీళ్ల ఆర్థిక పరిస్థితులు పడుతున్న ఇక్కట్లయినా గుర్తించకుండా నెల రోజులూ ఉండి తీరా వెళ్లిపోయేటప్పుడు నిష్ఠూరాలు పలికి వెళ్ళిపోయారు. వీళ్ళు పెట్టిన బట్టలు బాగులేవట. మా ఊరెళ్లి మా అన్నయ్యా వాళ్ళు ఇలాంటి బట్టలు పెట్టారని నగుబాటుతో ఎలా చెప్పుకోనూ? అని దీర్ఘం తీసిందో ఆవిడ. ఇంతమందికీ బట్టలు కొనట ఎంత కష్టమో, ఆ కొట్టు అరువు తమ అన్నయ్యా వాళ్లెప్పటికి తీర్చుకొంటారో అన్న జ్ఞానం ఆమెకు ఉండదు! ఇహ రెండో ఆవిడ కాస్త పట్నాలకి అలవాటుపడ్డ విడది. అయినా మరొకళ్లింటికి వచ్చాక ఆ యింట్లో వాళ్ళ స్థితిగతులూ సౌకర్యాలు ఆలోచించాలా? మా అత్త హార్లిక్స్ తప్పితే ఏదీ తాగదు. మా దొడ్డి పాలల్లో కారన్‌ఫ్లేక్స్ వేస్తేగానీ ముట్టుకోదు. మా పాపకి బంగాళా దుంపలు ఇలా వండుతే సయించవు అని ప్రతీ దానికీ వంకలు పెడతారు. నలుగురితో కలిసి ఉన్నప్పుడు సర్దుకుపోవాలన్న జ్ఞానం ఉండదు. ఇంకా పైపెచ్చు ఇలాంటి మాటలూ సాధింపులే వాళ్ల పిల్లలకీ నేర్పుతారు. దాంతో వాళ్ళ మిగతా పిల్లలతో తమ ఇంటి గొప్పలూ ప్రతాపాలు చాటుకోవడం మొదలెడతారు. మా యింట్లో మేము గేదెపాల తాగనే తాగం మీ ఊరు వచ్చి ఎలా చిక్కిపోయానో చూడు. ఇంతవరకూ పెడతాయ్ వాళ్ల మాటలు. చిన్న పిల్లల్నికూడా చెరిపినవారవుతారు ఆ పెద్దవాళ్లు.

అసలు ఈ ఆడపడుచులు అది తమ అన్నగారి ఇల్లేనని తమ పుట్టింటివారినే అంటున్నావన్న సంగతి కూడ మరచిపోతారు. ఏదో పెత్తనం అంతా తమ వదినెగారిదే ననీ ఏది అన్నా ఆవిడకే వర్తిస్తుందని అనుకొంటారు. తీరా వస్తే మా అన్నయ్య ఎంతో మంచివాడు మా వదినే అతని మనస్సు మార్చేసింది అని ఒక్క అన్నయ్యకు సర్టిఫికెట్టు పారేస్తారు.

ఏదో అదృష్టం కొద్దీ తాము కాస్త గొప్పింటి కోడళ్లైనంత మాత్రంలో అంత అహంభావం గొప్ప ఎందుకు రావాలి ఈ ఆడపడుచులకు? ఒకప్పుడు మనం ఈ ఇంట్లోనే పుట్టి పెరిగాము. ఈ ఆర్థికస్థితిలోనే ఉన్నామన్న సంగతే గుర్తుకు రాదు! వాళ్ల అత్తారింటి హోదాకు తగట్టుగా కానుకలిచ్చి సేవలు చేయాలంటారు. పెళ్లయి నలుగురు పిల్లలు పుట్టాక కూడ పుట్టింటివారు గాని అన్నదమ్ములు గాని పెట్టిపోస్తూ ఉండాలనుకోవడం పొరబాటు! చదువూ సంస్కారం ఉండి పట్నాలలో నాగరికులని మెలిగేవాళ్లే ఇలా ప్రవర్తించడం శోచనీయం.

ఈ వ్యాసంలో ఇంట్లోనే ఉండి సాధిస్తున్న ఆడపడుచుల సంగతి అసలు వ్రాయనే లేదు. వాళ్ల సంగతి వ్రాయాలంటే పెద్ద గ్రంథం తయారవుతుంది. అసలు మన కుటుంబాలలో చాలా కాలం నుంచి వస్తున్న చీడపురుగుల్లాంటి సాంప్రదాయాలలో ఆడపడుచుల సాధింపొకటి.

ఆడపిల్లలకి పుట్టింటిమీద మమకారం ఉండడం, అప్పుడప్పుడు వచ్చి కొద్దిరోజులు పుట్టింట్లో గడపాలని ఆశించటం సహజం. తల్లీ తండ్రీ లేని పక్షంలో ఒక్కొక్కప్పుడు ఉన్న అన్నదముల యిళ్లే పుట్టిళ్లవుతుంది. అక్కడికి వెళ్లడంలో తప్పేమీ లేదు. కాని వెళ్లినప్పుడు తమ హోదాకి తగినట్లుగా వాళ్ళు చేయలేకపోతే తప్పులు పెట్టకూడదు. ఎవరెవరి కష్టసుఖాలు వాళ్ళకుంటాయి. నిష్ఠూరాలు పలికితే మనస్పర్థలు తప్ప ఏమీ మిగలవు. ఎన్నిరోజులైనా ఇంకా పుట్టింటివారు అవీ ఇవీ పెట్టాలనుకోవడం పొరబాటు ★



# వనితా వాణి

## వృద్ధాప్యంలో కోరికలు

వృద్ధులను చంటిపిల్లల లాగ చూడుకోవాలి మా అత్తగారు ఆమె అత్తగార్ని గురించి చెప్తూ వుంటారు. చాల ముసలావిడైంది ఆవిడకి అన్నీ తినాలని కోరిక వుండేదట. ఆమెకు తినాలనివున్నదాటపేరు చెప్పి, చాల బాగుంటాయని అనుకునేవారట అది విని మా అత్తగారు వెంటనే చేసిపెడితే ఆవిడ ఎంతో సంతోషించేవారట. చిన్నతనంలో ఎవరికి వారే చేసుకుంటారు పెద్దయ్యాక వాళ్లకు శక్తి లేనప్పుడు ఎవరు చేస్తారు? మాకు తెలిసిన ఒకావిడ వుంది ఆమె అత్తగారు నడవలేదు కళ్ళు కనిపించవు చాల డబ్బు వుంది కాని, సరియైన గుడ్డ కట్టకపోవటమే కాకుండా తిండికూడా సరిగా పెట్టదు చలికాలమైనా వరండాలో ఒక చాపమీద పడుకుని వుంటుంది ఆమెను చూస్తే మాకు జాలివేస్తుంది కోడలికి ఏమాత్రము జాలిలేదు వృద్ధులకు సరియైన సేవ చేయాలని మా ఉద్దేశ్యం

జి గిరిజ, కే లజ ( రాజమండ్రి )

* * *

శ్యామసుందరిగారికి వృద్ధులయందులకు జాలికి నా జోహార్లు నిజంగా వృద్ధాప్యంలో శాంతమ్మమునంద కలుగు వైపరీత్యమునకు ఆగ్రహపడి అశక్తులైన అన్నలను నిష్ప్రయోజకులుగా వేరు చేసి వ్యథల పాలించుట మానవజాతి లక్షణము కాదు

కాపూరి రాజ్యలక్ష్మి ( గుంటూరు )

* * *

'వృద్ధస్సితత్ చింతామగ్న' అన్న శ్రీ అది శంకరుల మదుపు నెరిగియు, వృద్ధుల బుద్ధులు చంచలించవే అన్న పన్నయార్యుని వ్యాఖ్య చదివియు మన వృద్ధులగోడన మనము శాంతితో జీర్ణము చేసికొని, వారిని మనతోపాటు ఉన్న సౌకర్యముల నిచ్చుచు మనవిచ్చని మానవ నాగరికతేమిటి? ఒకప్పుడు మనముమా అట్టి ముసలితనము వంద గలమని గ్రహించి, కందుకూరి వీరేశలింగము పంతులు గారి "మన జడివదుపులు" జ్ఞప్తియుందుంచుకొన్న యెడల ఎన్నడుమా ముసలివారిని హింసించము— శ్యామసుందరిగారి గ్రహింపుకు వందనములు—

నన్నపీను మాధవీకుమారి ( గుంటూరు )

* * *

శ్యామసుందరిగారు వ్రాసిన వృద్ధాప్యంలో కోరికలు అన్న వ్యాసము నాకు చాల బాగున్నది

టి మోహిని ( ఏలూరు )

* * *

"ముసలోల్లకు ముద్దాన" అనే సామెతను నిజమనిపించారు నిజంగా వయస్సుమీరినవారి చేష్టలు పిల్లల చేష్టలువలె వుంటాయి.

సి. ఎస్ రాజకుటి ( కర్నూలు )

* * *

కుమారి జోయిన శ్యామసుందరిగారు వివరించినట్లు గొడవచేసే ముసలివాళ్లు అక్కడక్కడ వున్నారు కాని, పెద్దవారు ఉండుటవలన ఇంటికి నిండుతనము వచ్చును ఏది ఏమైనా వారికి కావలసినవి ఏలోపము రానీయకుండ చూడవలెనని నా ఆశయము

కుమారి తూతా శకుంతలాదేవి ( శిలగూరెం )

* * *

మా ఇంట్లో వృద్ధులు లేరు కాని, నేను చాలామంది ముసలివాళ్లను చూశాను వారు చిన్నపిల్లల కంటె అన్యాయం చిన్నపిల్లలు ఏడుస్తూ ఉంటే తల్లులు చిన్నట్లు, మిఠాయిలు ఇస్తే మామ్మలు వాళ్ళను అడిస్తూ అవి కాస్త వారు తినేస్తారు ఇంకా కొంతమంది పిల్లలు ఏదీ ఎక్కువగా తినరు అవ్వా నువ్వు తిను నాకొద్దు అంటే చాలు వాళ్లకు ఎక్కడలేని "ప్రేమ" వస్తుంది ఆ పిల్లమీద అదే చిన్నపిల్ల, అవ్వని పదేపదే అడిగి తింటే, ఆ చిన్నపిల్లమీద ఎంత కోపం వస్తుందో మనం చెప్పలేము ఇది ముసలివారి సహజస్వభావం.

శ్రీమతి వాణి జయరాజ్ ( అలందూర్ )

* * *

వ్యాసం చదివిన తరువాత మా బంధువుల ఇంట్లో ఉన్న, ఒక మామ్మగారి ప్రవర్తన జ్ఞప్తికి వచ్చింది ఆవిడకూడ అదేవిధంగా, తనకు కావలసిన తినుబండారాల కొరకు చంటిపిల్లల కంటె ఎక్కువగా ఆశపడేది ఆ కోడలు అమాయకురాలు ఆమెకు అన్ని సేవలు చేస్తూ అన్నీ తెప్పించి పెడుతుండేది ఇన్ని చేసినా ఆమెకు ఈమెను చూస్తే సూటిపోటిమాట అనాలని పిస్తుందో ఏమో! ఎప్పుడూ ఆమెను వేధించుకు తింటుంది కాని ఆమె ఏం చేస్తుంది

కానీ, వృద్ధాప్యంలో ఉన్నవారిలో రెండు రకాలు ఉంటారు మొదటి రకంవారు ఎంత ప్రతిమాలినా ఏమి తినకుండా చాలా మంచిగా ఉంటారు రెండవరకంవారు చంటిపిల్లలకంటె ఎక్కువగా మారాం చేస్తున్నట్లుగాను, ఎక్కువ ఆకలి గలవారిగాను ప్రవర్తిస్తుంటారు మనం కూడా సమయానుకూలంగా ప్రవర్తించిన ఇరువురకు అందంగా ఉంటుంది.

అంబటి దేవకి ( అలహాబాదు )

## వర్గాంతర వివాహాలు

ఇంతవరకు ఈ వర్గాంతర, ప్రేమ వివాహాల కొరకు చాలమంది సోదరీమణులు విమర్శిస్తూ వ్యాసంతో చాలభాగంలో ఉత్తేజపర్చే ఉన్నతభావాలను వ్రాస్తూ, చివరకు, బాల్యవివాహాలే మంచివని, బాధ్యతాయుతంగా చేసే పెద్దల చేతుల్లోనే మన జీవిత భవిష్యత్తునుపెట్టి, వారి గౌరవప్రతిష్ఠలను కాపాడుకొనుటకు జీవించాలనిచెప్పి తప్పుకున్నారు. పైగా అనుభవసీయులు వదిలేసినా యోచించి, అంధునిచేతికి కంచుకాగడా ఇస్తారనటం గూడ అతిశయోక్తేమీ కాదు పూర్వాచారాల ననుసరించి గాక, "వాని"గారు వారి భావాలను తిన్నని త్రోవలో తెలిపి తిలమకభావాలతో పాఠకులకు వినుగెత్తించక ఉన్న భావాన్ని రూపుమార్పక తెలిపినందుకు వారికి నా ధన్యవాదాలు

కుమారి వి ఈశ్వరి ( ఆలదు )

* * *

"వాని" గారు వ్రాసిన "వర్గాంతర వివాహాలు" చదివిన తర్వాత రెండు ముక్కలు వ్రాయకుండా ఉండలేకపోయాను అన్ని తెలిసిన తల్లిదండ్రులే ఈ వివాహాలకు అంగీకరించటం లేదు మూఢనమ్మకములతో ఉన్న వాండ్లు ఇంకేమి వింటారు వారు నిజమును గ్రహించకపోగా ఈ పత్రికలే పిల్లలకు నేర్పుతున్నాయి అని దెప్పి పొడవటం కూడ కద్దు ప్రేమించి పెండ్లి చేసుకున్నప్పుడే భార్యాభర్తలకు మనస్సులు అర్థమవుతాయి. అలాంటప్పుడే వారి జీవితాలు స్వర్గతుల్య మగుటకు అవకాశ ముంది వీలయినంతవరకు పిల్లలు పెద్దలమాట ప్రకారం చేసుకోవడం మంచిది. కాని పిల్లలు ఇష్టంలేని వివాహం చేసుకొని ఏమి సుఖపడతారు? నేటి సమాజంలో జరుగుతూన్న వర్గాంతర వివాహాలు చక్కగానే ఉంటున్నాయి. కాని వారి సంసారంలో ఒడిదుడుకులు లేకపోలేదు అంతమాత్రంచేత కేవలం వర్గాంతర వివాహాలు కారణం అనటానికి వీలులేదు

ఆడపిల్లల తల్లిదండ్రులకు ఈ వ్యాసం కనువిప్పు కలిగించుటయే కాక వారికి వర్గాంతర వివాహములయందు ఆసక్తి కలిగిస్తుంది జాతి, రంగు ముఖ్యంకాదని, గుణం అన్యోన్యత ముఖ్యమని "వాని" గారు వారి వ్యాసంలో తీర్చిదిద్దారు

ఎస్ వసుంధర ( విజయవాడ )

## సాధింపులు

అత్తగార్ని వేరేట్టి చూపెట్ట నవసరంలేదు. ఈరోజులలో కోడళ్లు కూడ చాలమంది అత్తగార్ని సాధించుతున్నారు మా స్నేహితురాలి వదినగారు క్రొత్తగా కాపురానికి వచ్చింది అత్తగారు ఆడపడుచులు ఉంటే చూడలేదు ఎట్లాగో పోరుపెట్టి వేరే ఉంది అత్తగారు ఆడపడుచులు చాలా మంచివాళ్ళు కాని ఆవిడకు కిట్టదు ఇప్పుడు సుఖంగా ఉందని అందరితోనూ చెప్తుంది మా చుట్టాల్లోనే ఇంకొక కోడలుంది ఆవిడ చెల్లెలు కొడుకుని పెంచుకుంది చెల్లెలు చనిపోయినది కొడుక్కు పెళ్లిచేసికోడల్ని చాలా బాగా చూస్తుంది కాని కోడలు ఎప్పుడూ దెబ్బలాడుతూ మా సొంత అత్తగారా అని అడుగుతుంది ఈ మధ్యనే యింకొక వార్త విన్నాను మా తెలుసున

వారి కోడలు అవలా పనిచెయ్యదు అత్తగారు చాలా మంచిది భర్త లొంగిపోయాడట "నాకేం చేసేందుకు పనిచేస్తాను మావాళ్ళు చాలా కష్టం ఇచ్చారు" అంటుందట అందుకని ఈ రోజుల్లో అత్తల్ని సాధించే కోడళ్ళు కూడా ఉన్నారు

ఎస్. నారాయణమ్మ (హిందు)

* * *

అటువంటి వాళ్ళే చాలా గొడవలు వస్తుంటాయి నాకు తెలిసిన అమ్మాయి ఉంది పట్టి అసూయాపరురాలు నిష్కారణముగా వేరే అమ్మాయిమీద అపనిందలు మోపింది ఉన్నవి, లేనివి చెప్పింది ఇక అగ్నికి ఆజ్యం పోసినట్టు విద్యార్థులు తోడయి గోరంత విషయాన్ని కొండంత చేసి చాలా బాధపెట్టారు వీరి కింతకన్నా వేరే పనిలేదు. నేరం చేసింది ఒకరయితే అనుభవించినది ఈ అమ్మాయి ముందు వెనుకలు ఆలోచించక సమయం దొరికితే చాలని ఉంటారు ఈ అసూయ వల్లే ఎన్నో అనర్థాలు వస్తుంటాయి ఒక్కొసారి జీవితాలకే ముప్పు రావచ్చు

కాంత, సావిత్రికుమారి (కడప)

* * *

'తమ కూతురు అత్తింట్లో సుఖపడాలి, తమ కోడలు తప్పక చాకిరీ చెయ్యాలి' అనే అత్తలు చిందరలో ఉన్నారు నిజంగా అత్తలూ, ఆడబడుచులు అయినవారు మాటిపోటీ మాటలు విసురుతూ ఇతరుల ముందర తమ గొప్పదనం చాటుతూ కోడళ్లను సాధించేవారు తమ మనస్సు మార్చుకుంటారని ఆశిస్తూ, ఇకముందు కూడా ఇటువంటి వ్యాసాలే పత్రిక ద్వారా పాఠకుల కందజేసి ఇంకా పురాతన కాలంలోనే ఉండి దురాచారాలు జరిపేవారి కళ్ళు తెరిపిస్తారని ఆశిస్తూ, తమ పత్రికకే నా అభినందనములు ఈ లేఖ ద్వారా అందజేయుచున్నాను

కుమారి దుంపూరి సుబ్బలక్ష్మి (గుంటూరు)

* * *

## స్త్రీలూ – ఉద్యోగాలూ

"స్త్రీ ఉద్యోగం చేయుటంవల్ల ఎంతో ఆర్థిక లాభం ఆకుటుంబానికి కలుగుతుంది" — అక్షరాలా నిజమే కాని ఈ రోజులలో ఎక్కువగా మధ్య తరగతి ఆడవాళ్ళుకన్న ధనికవర్గమే ఆడవాళ్ళు ఉద్యోగాలు చేస్తున్నారు ధనాశ అనండి మరేమయినా అనండి మొగవాళ్ళకు పోటీగా ఈ విధముగా గొప్ప ఇంటి ఆడవాళ్ళు ఉద్యోగాలకు ఎగబడటము అన్యాయమంటాను

"సుందరవల్లి" (హైద్రాబాదు)

* * *

"వాణి" గారు వ్రాసిన "స్త్రీలు—ఉద్యోగ సమస్య" వ్యాసం చదివాక నా కెంతో సంతోషమయినది కాని ఒక్క విషయము మాత్రము నేను చెప్పగలను ఒక స్త్రీ ఉద్యోగం చేస్తున్నదంటే, భర్త నిరుద్యోగి అయినప్పుడు ఆమె భర్తకు "వంటఇల్లు" అవుతుంది. సామాన్యంగా ఆమెగారు భర్త అనగా లెక్క చేయక తను ఉద్యోగం చేయుచున్నానని, తనే భర్తను పోషించుచున్నానని అనుకుంటుంది స్త్రీకి ఉద్యోగముచేసే అర్హత తప్పితంగా కలదు. కాని, వారు భర్తల విషయంలో, తామే విద్యావంతుల మని విర్రవీగక వారికి అనుకూలురై ఉండాలని నా కోరిక

సిద్ది సర్వమ్మ (తెర్యాల)

* * *

శ్రీమతి డి రత్నమ్మగారి లేఖ నన్ను చాలా ఆశ్చర్యపరచినది పాశ్చాత్యులలో నయినా మంచి లక్షణాలుంటే నేర్చుకోవడం దోషంకాదు ఉద్యోగం చెయ్యడం ఈ కాలంలో చాల అవసరం దారి తెన్ను లేక దారిద్ర్యంతో కుమిలిపోవడం కన్న ఉద్యోగం చెయ్యడం చాలా ఉత్తమం అవివాహితలే కాకుండా వివాహితలు కూడా ఉద్యోగాలు చేసి ఎంతో ఆనందంగా కాలం గడుపుతున్నారు కొన్ని ఉద్యోగాలు స్త్రీలకే సరిపోతాయి వాళ్ళు లేక పోతే కుదరదు కూడ అటువంటి లేడి డాక్టర్లు, నర్సులు ముఖ్యమైనవి నిజంగా లేడి డాక్టరు లేక పోతే ఎంత అవస్థ మన కందరికి తెలిసినదే ఒక కొత్త సంఘాలోకి వచ్చినప్పుడు కొన్ని సమస్యలు కలుగుతాయి వాటిని మన తెలివితేటలతో పరిష్కరించుకొని ముందువారికి మార్గదర్శకుల మవాలి అంతేకాని భయపడకూడదు.

అయ్యగారి కనకవల్లి (ఏలూరు) ★



# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి

## రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!

ఎందుకంటే : ఒక్కసారి తోముకొంటేనే

**కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85 % వరకు తొలగించును**

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోట దుర్గంధమును వెంటనే అపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని దంత శాస్త్ర చరిత్రలో పూర్వమెన్నడూ తెలియచేయనంతటి శాస్త్ర పరిశోధనం ఫలితముగా నిరూపించబడినది !

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కాల్గేట్ తో పళ్లు తోముకోండి దాని చేవగలమైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లి పోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది !

పిల్లలు కాల్గేట్ తో పళ్లు తోముకొనుటకు యిష్టపడతారు ఎందుకంటే చాల సేపు ఉండే దాని పిప్పర్ మెంట్ వంటి రుచి అంటే వారికి ప్రీతి !







మీకు పొడరు కావాలంటే, ఈ లాభములన్నిటిని మీరు కాల్గేట్ టూత్ పొడరు ద్వారా పొందగలరు. ఒక డబ్బా వెంట వస్తుంది

కాల్గేట్ తో క్రమం తప్పకుండా పళ్ల తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




నోరు ఎక్కువ శుభ్రముగా తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్ నే ఎక్కువ మంది వాడుతున్నారు

# విశ్రాంతి

## విశాఖ

నేను మా రాధని చూద్దామని నాలుగైదు ఆదివారాలు వెళ్లాను కానీ ఒక్కసారైనా కలుసుకోలేకపోయాను ఆఖరికి ఒకరోజు బజార్లో కనపడ్డప్పుడు రాధని అడిగితే "ఏదో ఆదివారం అలా బయటకెళ్ళి ఎక్కడేనా భోజనంచేసి వచ్చేస్తాం అందువల్ల నేను ఆదివారాలు ఉండను" అంది

"ప్రతీ వారమూనా" అన్నాను నేను

"అవును వారం పూర్తిగా కష్టపడుతుందా అందుకని ఆదివారాలు మాత్రం నేను బయటికి వెళ్దాం అని పోరుపెట్టగా పోరుపెట్టగా ఈ మధ్యే కొంచెం చెప్పినమాట వింటోంది" అన్నారు రాధావాళ్ళ ఆయన

అప్పుడే నాకూ అనిపించింది అమ్మావాళ్ళూ ఒక్క నిముషం విశ్రాంతి లేకుండా పనిచేస్తున్నారు కదా విసుగు వెయ్యదా అని అమ్మా అప్పుడప్పుడు "ఏం సంసారం బాబు కాశీయాత్రేనా చేసుకువస్తాను మీ రెండు నెలలు ఈ ఇంటిని మీరే చూసుకోండి" అంటుంది కానీ ఎప్పుడు వెళ్ళదులెండి అది వేరే విషయం

మగవారు ఆఫీసులో పనిచేసి ఇంటికివచ్చి విశ్రాంతిగా ఉందాం అనుకుంటారు మరి ఆడవారికి విశ్రాంతి వద్దా? ఎవరింటిపని వాళ్ళు చేసుకోవాలి మగవారికి వారానికో ఆదివారమేనా ఉంటుంది మరి ఆడువారికి మాత్రం 365 రోజులు చాకిరీనే వుంటుందికదా! వారికి మాత్రం ఈరోజుండే పరిస్థితులనుంచి విశ్రాంతి వద్దూ? పాశ్చాత్య దేశాలలో విహారయాత్రలనీ అవీ వెళ్తూ ఉంటారు కానీ మనదేశంలో మాత్రం ఆడువారికి విశ్రాంతి వద్దనో, ఎందుకనోలావుంది, మనవారు వనితల స్థానం వంటయిల్లు అని ప్రత్యేకించారు ఇప్పుడిప్పుడు మనవారు మారుతున్నారు

నేను ఇంటిపనులు చెయ్యకూడదు అని అనను ఆడది అన్నాక ఒళ్ళువంచి పనిచేయాలి కానీ పని చేశాక విశ్రాంతి అనేది ఎంతైనా అవసరం నాకు తెలిసిఉన్న ఒకాయన ఏడాదికి రెండు నెలలు సెలవు పెట్టి ఏ వూరేనా వెళ్తారు కానీ భార్యని, పిల్లల్ని తీసుకువెళ్ళాలని తెలియదు అతనికి అంతగా ఆవిడ అడుగుతే ఆవిడని పుట్టింటికి వెళ్ళ అంటాడు అక్కడికివెళ్తే మళ్ళీ మామూలేగా తల్లివెనక తమ్ముళ్ళని తన పిల్లాడిని చూసుకుంటూ చాకిరీ చెయ్యడమేగా ఆవిడ ఆశకొద్దీ ఒకవారం ఉండి తిరిగి వచ్చేస్తుంది

ఆ వెళ్ళేఊరుకి తన సంసారాన్ని కూడా తీసుకెళ్తే ఏంపోయింది ఆవిడకి ఎంత సంతోషంగా ఉంటుంది నే పదే అంటే "ఆడవాళ్ళకి విశ్రాంతి ఏమిటమ్మా" అని తేలికగా కొట్టేస్తారు అతను "అవునులెండి ఆడవాళ్ళు గానుగెద్దుతో సమం" అనుకున్నాను కోపంతో మనసులో

మా యుగోస్లేవియన్ స్నేహితురాలు, ఆవిడ భర్త కష్టపడి పనిచేసి డబ్బు కూడబెట్టుకున్నారు. ఆవిడ ఇంట్లో పనులు చూసుకుంటూ, ఆఫీసు పని చేస్తూ కష్టపడింది కానీ ఇద్దరూ విశ్రాంతికోసమని డబ్బు కూడ బెట్టుకుని ఇప్పుడు నెల్లాళ్ళు స్విట్జర్లాండు వెళ్ళారుట ప్రతీరోజూ చూసిన సుందరదృశ్యాల్ని వర్ణిస్తుంటే, ఆ ఉత్తరాల్ని చదువుతూ నేనూ వాటిని కళ్ళారా చూసినట్లు ఉప్పొంగి పోయాను

అసలు నెలకేనా రెండు నెలలకైనా సినిమాకిగాని, అలా బయటికిగాని విశ్రాంతికోసరం తమ యింటి ఆడవాళ్ళి తీసుకెళ్ళుదామనిగానీ, పంపుదామనిగాని చాలామందికి తోచదు పొద్దున్న పెందరాడే లేచి వంచిన నడుము ఎత్తకుండా పనిచేసే ఈ వనితలకు మధ్యన కొంచెం విరామం అవసరం ఆఫీసుల్లో మధ్యాహ్నం ఒక గంట విశ్రాంతి ఉంటుంది అలాగే సాయంత్రం వంట అయ్యాక చల్లగాలికోసరమైనా కొంచెంసేపు ఆ వంటయింటిని వదిలి బయట కుర్చీలు వేసుకుని కూర్చోడమో, డాబాల్లో కూచోడమో చెయ్యాలి ఇది కాకుండా వీలయితే అలా షికారుగా నడచివెళ్తే మరీ మంచిది వీటన్నిటికీ కారణం విశ్రాంతి కావాలనడమే

పురుషులు కూడా స్త్రీల విశ్రాంతి విషయంలో తగిన శ్రద్ధ తీసుకోవాలి "చూడూ! ఇవాళ అలా వెళ్ళొద్దాం పదా! ఎప్పుడూ ఉండేదేగా" అని పిలిస్తే ఆ భార్యకి ఎంత ఆనందంగా ఉంటుంది అంతేనే గాని, "ఇరవై యేళ్ళాయి, సంసారం చేస్తున్నానుగాని ఈ విధిమొగ ఎలా ఉంటుందో తెలియదు ఏదో ఈ జీవితం ఈ వంటింటితోటే ముడి పడిపోయింది విశ్రాంతి ఏమిటి లెద్దూ" అనేవారిని చూస్తే నాకు చాలా జాలి వేస్తుంది విశ్రాంతివల్ల తిరిగి ఎక్కువ పని చేసుకోగల్గుతారు అది మాత్రం నిజం అందుకే ప్రభుత్వం పనివాళ్ళ విషయంలో కూడా రోజుకి ఇన్ని గంటలకన్న పని చేయకూడదు అని నిబంధన పెట్టింది అలాంటప్పుడు సంసారపు స్త్రీల గూర్చి వేరే చెప్పాలా

వేకువజామునలేచి రోజంతా కష్టపడి పనిచేసి రాత్రి పడుకుని విశ్రాంతి తీసుకుందామంటే చంటాడికి జ్వరం రాత్రి నిద్రపోనియ్యడు లేదా ఎడపిల్లవానికి లొంపదగ్గు వాడ్ని చూస్తే నిద్రపట్టదు. పక్కనే కూర్చుని సేవచేస్తుంది మర్నాడు తెల్లవారగట్నే కాఫీ ప్రయత్నం అయ్యాక వంట ఊపిరేనా పీల్చుకోడానికి సందు దొరకదు అలాంటప్పుడు వారిని చక్కగా ఒకరోజు అయినా బయటికి ఎక్కడకైనా తీసుకెళ్ళి ఏదో చూపించి తీసుకొస్తే ఎంత బాగుంటుంది?

స్వతహాగా ఆడువారు పని చేసుకుంటారు వాళ్ళకి "అయ్యో రోజూ వుండాలే" అనే బాధే వుండదు, ఉండకూడదు కానీ విశ్రాంతి అనేది అందరికీ కావాల్సినది కనుక పురుషులు వనితలకి కూడా ఎప్పుడేనా ఈరోజువుండే మామూలు పనులనుంచి విశ్రాంతి కలిగే సదుపాయాలు చేయాలి ఏదో సినిమాకనీ, షికారుకనీ, ఏదో ఊరు చూద్దామనీ, పెద్ద వయసు వాళ్ళయితే పురాణ కాలక్షేపమనీ, యాత్రలనీ ఉంటే ముచ్చటగా ఉంటుంది 



# డాక్టర్ రాజు

బొమ్మల కథ

**దేవిక**

17















"ఊరి(—హబ్బా— నువ్విక్కణ్ణించి వెళ్ళనలు—ఊం—వెళ్ళు" కసురుకుని కృష్ణమూర్తి మూలుగుతూ, కుడివైపు తిరిగి పడుకుని, శాలువా మొహంమీద కంటా లాక్కున్నాడు అతని కదలికకి మంచం కిరకిర మంటూ అటూ, ఇటూ ఊగింది తలకింద దిండు జారి నేలమీదపడింది

చట్టున ఆ దిండు తలకింద అమర్చి లేచి నిలబడింది ఊర్మిళ

వెలిగించిన కిరసనాయిలుదీపం మంట పెద్దదై, పొగతో గోడ మసిబారుతుంటే, నెమ్మదిగా వెళ్ళి దీపం బాగా తగ్గించి, ఇంకో గంటకి పుచ్చుకోవాల్సిన మోతాదు మందు గాజుగ్లాసులో పోసి, కిటికీ గూట్లోపెట్టి పక్కగదిలోకి వెళ్ళికూచుంది

కిటికీలోంచి కనబడే నల్లని చీకటిలో ప్రపంచం అంతా లయమైనట్టుంది మంచు కన్నీళ్ళని నింపుకుని, పడమట రెండు నక్షత్రాలు మిణుకుమిణుకంటున్నాయి

ఊర్మిళ కళ్ళల్లో నీళ్ళు ఇంకిపోయాయి 'కష్టం' అంటే అంతా భయపడినట్టు, ఆమె 'సుఖం' అంటే భయపడుతోంది

—44వ పేజీ చూడండి



# జూల్స్ వెర్న్



# భూగర్భంలోనికి సాహసయాత్ర

## జరిగిన కథ

హాంబుర్గ్ నగరనివాసి ప్రొఫెసర్ లిడెన్ బ్రోక్ ఒక పాత గ్రంథం సంపాదిస్తాడు. దానిలో ఒక శ్వేతపత్రం దొరుకుతుంది

'ఆర్నె సాక్నుస్సెమ్' అనే ప్రాచీన శాస్త్రజ్ఞుడు, ఐస్‌లాండ్‌లో ఆరిపోయిన ఒక అగ్నిపర్వతం ముఖద్వారంలోనుంచి భూగర్భంలోనికి వెళ్ళినట్లు అందులో వ్రాసి ఉంటుంది తమ్ముడు కొడుకు ఆక్సెల్ తో కలిసి ప్రొ॥ లిడెన్‌బ్రోక్ అక్కడికి ప్రయాణం కడతాడు వారు హాన్స్ అనే గైడ్ ను కుదుర్చుకుంటారు. స్కార్టారిస్ శిఖరం దిగువన వారికి మూడు రంధ్రాలు కనిపిస్తాయి మధ్య రంధ్రంమీద స్కార్టారిస్ నీడ పడేవరకు కనిపెట్టుకొనిఉండి, నీడపడిన రోజున అరంధ్రంగుండా లోనికి దిగుతారు. కొంత దూరం వెళ్ళేసరికి వారికి రెండుదార్లు కనిపిస్తాయి తూర్పువైపు సొరంగం లోంచి పోగాపోగా ఆదారి ఒకచోట ఆగిపోతుంది పొరపాటు తెలుసుకుని వారు మళ్ళీ రెండుదార్లు చీలినచోటకు తిరిగివెళ్ళి, రెండవ సొరంగంలో ప్రయాణం కొనసాగిస్తారు ముందు నడుస్తున్న ఆక్సెల్ దారితప్పి ఒంటరివాడవుతాడు హాన్స్, లిడెన్‌బ్రోక్ అతణ్ణి స్పృహతప్పి ఉన్న స్థితిలో కలుసుకుంటారు ఆక్సెల్ కి తిరిగి స్పృహవచ్చిం తరువాత ఎదురుగా కనిపించిన సముద్రంచూచి ఆశ్చర్యపోతాడు హాన్స్ తయారుచేసిన చిన్న తెప్పలో ఆ సముద్రం అవలి ఒడ్డుకు బయలుదేరుతారు ఆరురోజులు ప్రయాణం చేసినా ఒడ్డు కనిపించదు రెండు పెద్ద జలచరాల పోరాటంచూచి వారు భయకంపితులవుతారు

## 34

**బుధవారం, ఆగస్టు 19**—అదృష్టవశాత్తు, గాలి బాగా వీచి మమ్మల్ని ఆ ప్రదేశం నుంచి శీఘ్రంగా అవతలికి తీసుకు వెళ్లినది హాన్స్ చుక్కాని వద్ద అడు ఈ 'యుద్ధం' వల్ల తక్కిన విషయాల సంగతి ఆలోచించటం మానివేసిన మా పెద్దనాన్న ఆత్రంగా సముద్రం పరీక్షించటం ప్రారంభిస్తున్నాడు

ప్రయాణంలో విశేషమేమీ లేదు—నిన్న జరిగినటువంటి ప్రమాదం కన్నా ఇదే మంచిది!

**గురువారం, ఆగస్టు 20**—వాయవ్యానికి ఉత్తరంగా గాలి ఉష్ణోగ్రస్థితి కొంచెం అధికంగానే ఉన్నది గంటకి పదిన్నరమైళ్ళ ప్రయాణం చేస్తున్నాము

మిట్టమధ్యాహ్నానికి దూరంగా ఒక శబ్దం వినిపిస్తున్నది అది ఏమిటో చెప్పలేకుండా ఉన్నాము. గర్జన వలె ఉన్నది

—41వ పేజీ చూడండి

# చదువుల్రావు


ఏంట్రావు గారు
అలా ఉన్నారు
ఓ జయశ్రీ గారా
న్నా కళ్ళజోడు పడి పోయిందండీ


అది దారికి తేనే కానీ నా కళ్ళజోడు
కనిపించేలంలేదు...
సత్యమూర్తి

సామర్లకోట ప్లాట్‌ఫారంమీదకు మెడ్రాస్‌నించి వచ్చే మెయిల్ వస్తోంది—

అంత దూరాన్నించే మెయిల్ రాకని గమనించిన జనం హడావిడిగా సామాన్లు సర్దుకుంటూ కూలీలని తొందరచేస్తున్నారు.

కృష్ణా, ప్రియంవదాకూడా, కదిలి కాకినాడ కంపార్టుమెంట్ కోసం వెతుక్కుంటూ వెడుతున్నారు.

"రాజా—" కంపార్టుమెంట్ గుమ్మంలో నిలబడి కృష్ణను గుర్తించి ఆత్రంగా పిలుస్తోందో కంఠం.

అంత సందడిలోను ఆపిలుపు కృష్ణ కర్ణేంద్రియాలని స్పందించింది.

"అమ్మా! —" అంటూ అటు తిరిగాడు.

అప్పటికి రైలు పూర్తిగా ఆగింది.

ఆమె రైలుదిగి— "రాజా—అంత చిక్కిపోయావేమిరా" అంటూ సంతతధారగా స్రవిస్తున్న అశ్రువులతో కృష్ణ చెక్కిళ్లు నవరించి, గడ్డం పుణికింది.

ఆనందాబ్ధి చెలియలికట్ట తెంచుకుంటే పొలికివచ్చిన నీరు అది.

"అత్తయ్యా—" ప్రియంవద పలకరించింది. ఆ కంఠంలో తన ఉనికిని విస్మరించినందుకు రవంత మాత్సర్యం తొణికి ఉండవచ్చు.

అప్పుడు తెలిసివచ్చింది అత్త గారికి.

పరిస్థితి సంభాళించుకుంది.

"అదేమిటే పిల్లా—కళ్లల్లా లోతుకి పోయాయే?—తిండితినడంలేదా మీరిద్దరూ?" అంటూ కోడల్ని దగ్గిరికి తీసుకుంది.

"బాగానే ఉన్నాం అత్తయ్యా, మామయ్య రాలేదేం?" అడిగింది ప్రియంవద.

"తీరా బయలుదేరే వేళకి ఏదో అర్జంటుపని అడ్డం వచ్చింది. నన్ను వెళ్లమన్నారు. ఆయన పన్లేమిటో ఆయనేమిటో — ఇంకెవళ్ళగొడవా అక్కర్లేదు." దగ్గర లేకపోవడంతో ఆయనమీదకు మళ్ళింది విసురు.

'కూలీ'ని కృష్ణ పిల్చి సామాన్లు దింపించి వాడినెత్తి కెక్కించాడు.

"అయ్యా-మీరు పైనించిరండి. నేను సామాను దాటించేస్తాను" అన్నాడు కూలీ.

ఓవర్‌బ్రిడ్జి దాటి కాకినాడ బండి ఎక్కేలోపున ఒక వందసార్లు ఇద్దర్నీ చీవాట్లు పెట్టింది కమలమ్మగారు, ఆరోగ్యం విషయం ఇద్దరూ అశ్రద్ధ చేస్తున్నందుకు.

ఇంటికి వచ్చారు. ఇల్లు తల్లికి ఆశ్చర్య నచ్చినట్టు లేదు.

"దీనికెన్ని రూపాయలు? మండిపోతోంది దేశం-" అంది తమ ఊళ్ళో ఉన్న భవంతిని తల్చుకుని

"అమ్మా యిందాక అడిగావు చిక్కిపోయావేమని. మేనకోడలని మురిపెంకొద్దీ నా మెడకి తగిలించావు. ఇది అన్నం పెట్టడం లేదమ్మా." ప్రియవదంకేసి క్రీగంట చూస్తూ నవ్వుతూ అన్నాడు

"చూడత్తయ్యా ఆమాటలు! తన ఫ్రెండ్సేమిటో— ఆ బాతాఖానీ లేమిటో అంతే— నాగొడవ అక్కర్లేదు నీముద్దులకొడుక్కి. ఇంట్లో అవకాలయిపోయినా, బియ్యం అయిపోయినా, ఏం పట్టించుకోరు. నువ్వూ నాన్నా కలిసి నా గొంతుకోశారు" కృష్ణని వెక్కిరిస్తూ అంది

"చూశావా అమ్మా-ఇంక దీంతో నే కాపరం చెయ్యలేను. నీఎదురుగుండానే ఎల్లా అనేస్తోందో చూడమ్మా."

"మనం మహా తిన్నగా మాట్లాడి నట్టు" కొట్టించింది ప్రియంవద.

"పోరా పోరా ఏంమాటలే అవి! పగలల్లా వాడు కాలేజీలో కష్టపడి వస్తుంటాడుగదా, పుస్తకాలు ముందేసుకుని కూర్చోకపోతే—పట్నమేగాయిది — నువ్వెళ్లి తెచ్చుకోరాదూ బజారుకెళ్ళి—మీ అక్కర్లేం జేస్తోందీ బొంబాయిలో?"

"ఎంతయినా నువ్వు కొడుకునే వెనకేసుకొస్తావు. నేనేగా పరాయిదాన్ని."

తల్లీ కొడుకులు పకపక నవ్వుకున్నారు.

కమలమ్మగారి మనస్సంతా మాధుర్యంతో నిండింది కొడుకు కోడల్ని చూసి.

స్టేషన్లలో దొరికే అడ్డమైనగడ్డి అత్తగారు తినదనీ, దానివల్ల ఆమెకు ఆపూట ఉపవాసమేననీ తెలిసిన ప్రియంవద వంటలోకి సిద్ధమౌతుంటే-

"అదేమిటే కుర్రనాగమ్మా—నువ్వుండు —" అంది కమలమ్మగారు.

"నీకు భోజనం కూడా లేదు గదత్తయ్యా—నువ్వు కాస్త కోయిగా నడుం వాల్చు—నిమిషంలో తెమిల్చేస్తాను" అంది.

"గుజ్జొచ్చి పిల్లని వెక్కిరించిందిట! నా కళ్ళముందు పుట్టావ్, నాకే చెప్తావుటే—" విదిలించినట్టు మాట్లాడబోయిన ఆమెకంఠంలో అంతులేని ఆప్యాయతే గోచరించింది.

"నీచాదస్తం నీదేగాని ఏ పెక్కడున్నా తూ నీకేం తెలువత్తయ్యా? పేరుకు నువ్వు వంటే గాని అన్నీ నేనందించడమేగా?" చిన్నవ్రటనించి మేనత్తదగ్గర గల చనువిచ్చిన చొరవ అది.

37—వ పేజీ చూడండి




దైవజ్ఞపోతూరి శ్రీరామమూర్తి

**23-3-1962 శుక్రవారము మొదలు**
**29-3-1962 గురువారము వరకు**

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

ఈసమయంలో మనస్సుకు పని అధికమవుతుంది. అధికవ్యయంతో కూడిన పనులయందే ఆలోచనలు, ఆసక్తి పెరుగుతవి. అకస్మాత్తుగా మీ ఆరోగ్యంలో మార్పులు రావటంవల్ల మీ కార్యక్రమాలు ఎక్కడివక్కడ నిలచిపోతవి. అధికారులవల్ల ఈ సమయంలో అనుకూలత ఉంటుందని ఎదురుచూడవద్దు. మామూలుగా మీ వృత్తి ఉద్యోగాలకు సంబంధించిన పనులలో శ్రమ కనుపించినా, ఆర్థికంగా ఫలితం బాగుంటుంది ముఖ్య స్నేహితులతోగాని, భాగస్వాములతోగాని అభిప్రాయభేదాలు రాగల సూచన లున్నవి. ప్రయాణాలు సుఖంగా జరిగే సమయంకాదు. వ్యవహార విషయాలలో అధిక వ్యయం అవుతున్నట్లు తోస్తుంది. కాని, మీపైన ఉన్నటువంటి బాధ్యత, మానసికంగా పడే చికాకు తొలగిపోతవి. సాధ్యమైనంతవరకు ఎవ్వరినీ నమ్మి డబ్బు ముందుగా చేతికి ఈయతగిన సమయంకాదు. 24, 25 తేదులలో సంతోషవార్తలు, విలువగల వస్తువులు కొంటారు. బంధుదర్శనం.

* * *

### వృషభం !

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)

దైవబలం బాగున్న సమయం. విశేషప్రయత్నం చేయకుండా వృత్తిలో అభివృద్ధిని సాధించుకొన గలుగుతారు. కోర్టు, కచేరీలలో పనులు సుళువుగా నెరవేరి ఎదురుచూస్తున్న ఫలితం లభిస్తుంది. సంఘంలో మంచిపేరు లభిస్తుంది పెద్ద పెద్ద వ్యాపార వ్యవహార కార్యములపైన అధికారం చలాయించగలుగుతారు భూములు, ఇండ్లు మొదలయినవాటి వృద్ధి ప్రయత్నాలు అనుకూలిస్తవి. ఒక ప్రక్క బంధుమిత్రులవల్ల నిష్ఠురాలు వస్తూ ఉంటవి కాని, ప్రత్యక్షంలో మిమ్ములను ఏ విధంగానూ ఇబ్బంది పెట్టరు వారం రెండవ భాగంలో యథార్థం తెలియకుండా మీరు తొందర పడటంవల్ల అనంతరం మానసికంగా బాధపడే అవకాశా లున్నవి. స్వల్పశ్రమతో సంతృప్తికరంగా ఫలితం పొందగలుగుతారు. పిల్లల ఆరోగ్యం సరిగా యుండదు. 25, 26 తేదులలో కలహప్రసంగాలు, లాభ వార్తలు, వృత్తిలో శ్రమ

**గ్రహ స్థితి**

కర్కాటకంలో రాహువు, మకరంలో శని కేతువులు, కుంభంలో అంగారక, బుధ, గురువులు, మీనంలో సూర్య, శుక్రులు, కన్య, తుల, వృశ్చిక, ధనస్సులలో చంద్రుడు

* * *

### మిథునం !

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)

గౌరవము, బాధ్యత మాత్రం గొప్పగా కనుపిస్తూ ఉంటవి దేనికది స్వల్ప విషయంగానే కనుపించినా, అన్ని రకాల సమస్యలుచేరి మిమ్ములను ధైర్యంగా ముందుకు పోవటానికి అవకాశం లేకుండా చేస్తవి. నౌకరులు మొదలయినవారితో కొంత శ్రమపడవలసివస్తుంది. ధనవిషయంలో ఇతరులకు సహాయం చేయవలసిన అవసరం కలుగుతుంది. ముఖ్యంగా పోటీవారిలో మీ అంతస్తును నిలుపుకొనటం నిమిత్తం మీ మనస్సుకు విరుద్ధమైన పనులలో ప్రవేశించవలసివస్తుంది. విద్యార్థులకు నిరుత్సాహం తోచగల సమయం. అనేకమంది చేత పనిచేయించవలసిన సందర్భాలలో మనోనిగ్రహము, సమయానుకూలంగా ధారాళంగా డబ్బు పెట్టుబడిపెట్టటానికి తగిన అవకాశము కలిగి ఉండటం అవసరం. మీ బుద్ధిబలంవల్ల బంధుమిత్రులవల్ల మాటరాకుండా చూచుకొనగలుగుతారు. 26, 27 తేదులలో అశాంతి, పనులలో అజాగ్రత్త, చికాకు, దుబారా ఖర్చులు.

* * *

### కర్కాటకం !

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష)

న్యాయం మాట్లాడటంవల్ల విరోధాలకు సిద్ధం కావలసి వస్తుంది. లోగడ మీరు చెప్పిన మాటను సులభంగా జరుపుకోగలుగుతారు తగినంత ఆదాయం వస్తూ ఉంటుంది. మీ స్వప్రయోజనాల నిమిత్తం విశేషంగా ఖర్చుచేయవలసి వస్తూ ఉంటుంది. కుటుంబ విషయాలలో మనశ్శాంతి లభిస్తుంది. అయితే నెరవేర్చవలసిన కార్యక్రమాలు ఒకదాని తరువాత మరొకటి మిమ్ములను కాచుకొని ఉంటవి బాహ్యవిషయాలలో అపవాదులు రానున్న సమయంలో మీయందు ఆదరంతో, యథార్థాన్ని తెలుపగల పెద్దమనుష్యులు తటస్థపడతారు. వ్యవహార వ్యాపార రంగాలలో ఒక చిక్కును తొలగించుకొంటే మరొకభారం పైన పడుతూ ఉంటుంది ముఖ్యంగా పట్టుదల అవసరం. వారాంతంలో అకస్మాత్తుగా ధనలాభం ఉంటుంది. 27, 28 తేదులలో శక్తికిమించిన పనులు, వస్తునష్టం. ఆహ్వాన సూచనలు.

* * *

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

చేతిలోని అధికారాన్ని ఇతరులకు వప్పగించి వారి ఆజ్ఞకు ఎదురు చూచినట్లుగా ఉంటుంది. సాహస కార్యాలలో పెట్టుబడిపెట్టటంకాని, తొందరపడి క్రొత్త మనుష్యులతో బాయంటు చేరటంకాని మంచిదికాదు. యంత్రసంబంధమైన పనులలో గాని, అగ్ని, ఆయుధాలకు సంబంధించిన పనులలో గాని నిబ్బరము, జాగరూకత అవసరము. అధికారులతో సంప్రదింపులకు ప్రయత్నించవద్దు. మీ శక్తి సామర్థ్యాలను చల్లగా వినియోగించుకునేవారు ఉంటారు. భూములమీదను, యిండ్లు మొదలయిన వాటిమీదను పెట్టుబడిని పెంచవలసివస్తుంది వారం రెండవ భాగంలో మీరు ఎదురుచూడని మార్గాలలో ధనరూపంలో ఫలితం పొందగలుగుతారు ప్రయాణాలు చేయవలసి వస్తుంది. మాటలలో ఆవేశం వస్తుంది. కాని, నిగ్రహించుకోగలుగుతారు. 28, 29 తేదులలో సంఘంలో గౌరవం, విశేష ఆదాయం.

* * *

### కన్య:

(ఉత్తర 2,3,4 పా., హస్త, చిత్త 1, 2 పా.)

సాధారణంగా ఈ సమయంలో దేనిమీదా ప్రత్యేకమైన ఆసక్తిగాని, విరక్తిగాని కనుపించవు అప్రయత్నంగా అవకాశాలు అనుకూలిస్తూ ఉంటవి. ఉష్ణ శైత్యస్వభావాల ప్రకోపంవల్ల అనారోగ్యం చేయగల అవకాశాలున్నవి. వృత్తి, ఉద్యోగాలలో మీ కర్తవ్యాన్ని నిర్వహించటంతోబాటు తోటివారికి విశేషంగా సహాయం కూడా చేయగలుగుతారు. ఆదాయం ఒక ప్రక్క ధారాళంగా వస్తూ ఉంటుంది. వెంటనే శుభసంతోషాల నిమిత్తం ఖర్చు అవుతుంది. ప్రస్తుతం పెద్ద ఆడంబరం లేకుండా ఫలితం పొందగలుగుతారు తూర్పు, ఉత్తర దిక్కులనుంచి లాభ వార్తలు తెలుస్తవి. కుటుంబంలోని అసంతృప్తికరస్థితి క్రమంగా తొలగిపోతుంది. 23, 24 తేదులలో ధనలాభం, స్వల్ప విషయాలలో కలహ ప్రసంగాలు.

* * *

### తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)

కష్టపడుతున్నామని చెప్పుకోతగినంత పరిస్థితి కనుపించదు. అయితే సుఖంగా, ప్రశాంతంగా ఉన్నామనుకునే అవకాశాలుండవు మీ కీర్తికి ఎక్కడ భంగం వస్తుందోననే భావంతో అనవసరమైన బాధ్యతలను పైన వేసుకొనటం జరుగుతుంది. మీ ఆరోగ్యం ఇంతకుముందుకన్నా మేలుగా ఉంటుంది బంధువులవల్ల ఖర్చులు పెరగవచ్చు వ్యవహారరంగంలో మీ ఆందోళన తొలగిపోయి, అనుకూలమైన మార్గం కనుపిస్తుంది. వృత్తిలో శ్రమపడి ఘనత పొందగలుగుతారు. పదిరకాల వ్యక్తులతో పరిచయం లభిస్తుంది. ఏ సందర్భంలోనూ మీ అంతట మీరు కోరకుండా అధికారము, గౌరవము లభిస్తవి. విలాస, వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు ప్రారంభించిన కార్యం పూర్తి అయ్యేవరకు మనస్సులో అలజడి పడుతూ ఉంటారు 25, 26 తేదులలో ధన లాభం. కార్యానుకూలత, శ్రమ్మ

### వృశ్చికం :

(విశాఖ 4 పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)

"కష్టేఫలి" కొంచెం వెనుకా, ముందూ. అంతేగాని, మీ శ్రమ వృథా పోదు న్యాయ పద్ధతిలో మీ అంతస్తును నిలబెట్టుకుంటారు. కుటుంబ విషయాలలో మీమీదఉన్న బాధ్యతలను నలుగురూ సర్దుకొనటం వల్ల నిశ్చింతగా నిద్రపోగలుగుతారు. అయితే మీ నోటిలోనుంచి మాటను బయటకు లాగటానికి ప్రయత్నం చేసేవారు ఉంటారు. మొహమాటం చెడకుండా రహస్యాన్ని కాపాడుకొనండి. మీక్రింద పనిచేసేవారితో కలహ ప్రసంగాలకు అవకాశం రాకుండా చూచుకొనండి పడమరదిక్కునుంచి వచ్చే వార్తలు మొదట నిరుత్సాహకరంగాయున్నా వారాంతంలో మీకు అనుకూలిస్తవి మీ ఆరోగ్యంలో తాత్కాలికంగా మార్పులు కనుపించవచ్చు. కాని, ఆందోళనపడవలసిన అవసరంలేదు. 27, 28 తేదులలో అప్రయత్నంగా ధనయోగం, శుభ కార్యానుకూలత.

* * *

### ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

వ్యాపార కార్యకలాపాలలో మధ్యమధ్య ప్రతికూల వాతావరణం కనిపిస్తూ ఉండటంవల్ల మానసికంగా ఆందోళన కలుగుతుంది. ఉపయోగంలేని ఖర్చులు వచ్చి పడుతవి. దూరపు ప్రయాణాలు చేస్తారు. స్నేహితులు ఎంత ఆదరంతో మాట్లాడినా, ధన విషయంలో సహాయం చేస్తారనే ఆశ పెట్టుకోవద్దు ధైర్యంతో మీ సంకల్పాన్ని నెరవేర్చుకొనగలుగుతారు. రకరకాల అభిప్రాయాలుగల వ్యక్తులను చల్లగా నచ్చజెప్పి ఒక మార్గానికి తీసుకొని రాగలుగుతారు. కుటుంబంలో శుభకార్య ప్రయత్నాలు జయప్రదంగా జరుగుతవి. ఈ సమయంలో వచ్చే ఉత్తరాలవల్ల ఇప్పటి కిప్పుడే ప్రయోజనం ఉండకపోవచ్చు. సాధారణ ప్రసంగాలలో కూడా ఒకానొక సమయంలో ఉద్రేకం కలుగవచ్చు. మొత్తంమీద అన్నిటికి ధైర్యం ప్రధానం. పంతుకు గంతులేదామనే అభిప్రాయం పెట్టుకోవద్దు. 28, 29 తేదులలో ఇష్ట వస్తు ప్రాప్తి, బంధు మిత్రుల రాక.

* * *

### మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా., శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

వ్యవహార రంగంలో జయప్రదమైన కాలం. ధన విషయంలో వత్తిడి కనుపిస్తుంది బంధువుల కార్యకలాపాలలో జోక్యం పెట్టుకుని వృథాగా శ్రమ పడవలసి వస్తుంది. మీరు ఇతరులకు వ్రాసిన ఉత్తరాలయొక్క ప్రయోజనం ఈ సమయంలో అనుకూలిస్తుంది. రావలసిన ధనం ఒక్కసారిగా అందకపోవటంవల్ల ముఖ్యకార్యాలలో ఉత్సాహంతో దిగలేకపోతారు. తప్పు అంచనాలు చెప్పి, మిమ్ములను నమ్మించటానికి ప్రయత్నించేవారు ఉంటారు. ఆహార, విహారాలలో వచ్చే మార్పులవల్ల ఆరోగ్యం లోపించగల అవకాశాలున్నవి ఈసమయంలో స్నేహితుల ప్రసంగాలను విని విననట్లు నటించుకొనటం మంచిది. 23, 24 తేదులలో అధికారుల వల్ల ఉపకారము, వృత్తిలో లాభ వార్తలు.

* * *

**ఈ వారము ధరలు**

బంగారు ధర వారం రెండవ భాగంలో మందీ అవుతుంది. వెండి ధర వారం ఆరంభంలోనే కొద్ది మందీ వచ్చి అలాగే నిలుస్తుంది. ధాన్యం ధర తాత్కాలికంగా తగ్గే అవకాశాలున్నవి. పసుపు ధర కొంచెంగా పెరుగుతుంది. మిర్చి ధర తేజీలోనే నిలుస్తుంది. సెనగ ధరలో నిలకడ తక్కువ. మొత్తంమీద మందీ అని భావించవలసి ఉంటుంది. ప్రత్తి, నూలు, ధరలు వారాంతంనుంచి క్రమంగా పెరుగుతవి. ముడి ఇనుము, యంత్రాలు — వీటి ధరలలో కొద్ది పెరుగుదల కనుపిస్తుంది.

### కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా., శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

కారణం లేకుండా తగవులువచ్చే సమయం. ప్రస్తుతం మీ పనుల తీరు, మాటల ధోరణి అందరినీ సంతృప్తిపరచజాలవు. అవసరాన్ని బట్టి, డబ్బు ధారాళంగా ఖర్చుచేయటానికి సిద్ధపడవలసి వస్తుంది. ఓర్పులేనివారు ఒక రిద్దరు మీతో పోటీచేస్తారు. కాని, మీ అదృష్టం బాగున్నది. ఇతరులను దూషిస్తూ మీ అండను చేరటానికి చూచేవారుంటారు. జాగ్రత్తగా ఉండండి. ప్రయాణాలు కలిసి వస్తవి. కుటుంబంలో ప్రశాంతత కనుపిస్తుంది. సమయంలో అసలు విషయాన్ని మరిచిపోతూ ఉండటంవల్ల సంఘ కార్యకలాపాలలో ఆలస్యము, శ్రమ అధికమవుతవి. కుటుంబంలో వస్తునష్ట సూచన లున్నవి. ఇంతకుముందు ఆలోచన తోచని వ్యవహారాలలో సులభమైన మార్గం తెలుసుకొంటారు. 25, 26 తేదులలో నీచ జనసంపర్కం, దుబారా ఖర్చులు, ఆస్తివృద్ధి ప్రయత్నాలలో భంగం.

* * *

### మీనం :

(పూ. భాద్ర 4 పా., ఉ. భాద్ర, రేవతి.)

ప్రస్తుతం ఇతరుల సలహా మీకు అంతగా అనుకూలించదు. ఆదాయవ్యయాలు రెండూకూడా బాగానే ఉంటవి. దైవకార్యాలు చక్కగా చేయగలుగుతారు. ఇంతకుముందు మీకు ప్రతిబంధకంగా తయారైన మనుష్యులను చల్లగా వదిలించుకో గలుగుతారు. దూరమందున్న మిత్రులవద్దనుంచి సంతోషవార్తలు తెలుస్తవి. సంఘకార్యాలలో ఏ మాట చెపితే ఎవరికి కోపం వస్తుందోననే స్థితిలో తగుల్కొంటారు. పిల్లల ఆరోగ్యం గురించి ముందే జాగ్రత్తగా ఉండటం అవసరం. ఎవరు ఎన్ని చెప్పినా వ్యవహారవిషయాలలో తీవ్రమైన భావాలను కనబరచకుండా అందినవరకు ఫలితం దక్కించుకొనటం మంచిది. అనుభవంలేని క్రొత్త వ్యాపారాలలో ధనం వినియోగించవద్దు. 27, 28 తేదులలో గౌరవ ప్రాప్తి, పుణ్య కార్యాలు.







## సర్వాంతర్యామి

కం|| ఏ నాటి తోలుబొమ్మలో,
మా నాటికి నాటకాలు; మా తరముడుగన్
మీ నాటికి సినిమాయెను
నానాటికి హెచ్చుకట్లు! నాగంభట్లూ!

కం|| పిన్నలు పెద్దలు వృద్ధులు
మున్నుగ నీ దర్శనమున మోదింపంగన్,
మిన్నగ నడిపింపబడెడు
నిన్నెరుగని నరుడు లేడు నిజముగ సినిమా!

కం|| శాస్త్రిన తెచ్చి చూచిన
శాస్త్రినను చెప్పనింట చాపల్యమునన్
నీకే సర్వస్వ మిడెడి
యేకైక రసికుడిల నరుడెన్నగ సినిమా!

కం|| ఏ పాట దేనిలోనిదో,
నే పాత్ర నెవరు ధరించిరొ తెల్పెట్టన్నన్,
చేపకు నీదుటవలె నే,
యేపక చెప్పెడి జనంబె యబ్బిరి సినిమా!

దేవరకొండ రామకృష్ణశర్మ (కర్నూలు)

* * *

## కాలచక్రం

ఆనాటిపైన పెద్దది
ఈనాటిది చిన్నపైన ఇక నేమగునో
ఏ నాటి కట్లు మారునో
నానాటికి తీసికట్లు నాగంభొట్లూ.

ఆనాడు నీవు నేనును
ఈనాడునునీవు నేను హితులైతిమిగా
ఏనాటి కేది ప్రాప్తము
నానాటికి తీసికట్లు నాగంభొట్లూ.

ఆనాడు కాంగ్రెస్సైతిని
ఈనాడు స్వతంత్రపార్టి కెక్కితి
నహహా
ఏనాటికేది యమరునో
నానాటికి తీసికట్లు నాగంభొట్లూ.

వి. ఎస్. రావు (విడవలూర్)

* * *

## ఏమున్నది హాసనకారణం ?

ఏ తెలుగుసినిమా చూచినా
ఏ మున్నది హాసనకారణం
తెలుగుసినిమా సమస్తం
అపసవ్యాల పారాయణం.

తలకేగే ప్రేమాయణాలు
"ఓహో చందమామా! ఆహా డిటోలూ!"
తెలుగుసినిమా సమస్తం
అసహజాల కాలవాలం.

మాటలకు శబ్ద (క్తీల) వంతెనకట్ట
యత్నించే సంగీతదర్శకులు
పౌరాణికచిత్రాల్లో టెలిగ్రాఫ్
తీగలు చూపే కామెరామన్‌లూ.

తెలుగుసినిమా సమస్తం
అసమర్థతకో నివాసం
సినిలా అన్నా నమకోకండి
తెలుగుసినిమా వృద్ధికావాలండి

దాచినా దాగని సత్యాలు
వద్దన్నా జరిగొచ్చే నిజాలు
తెలుగుసినిమా సమస్తం
కావాలండి కళామయం.

ఎల్. శ్రీనివాసరావు (గూడూరు)

* * *

## మార్కుల నీతి

అడిగిన మార్కుల నెయ్యని
మిడిమేలపు గురుని నమ్మి
మడయుట కంటెన్
జడియక కాపీ గొట్టుక
కదు మార్కుల బడయుచుంట
కపటంబగునే.

భూపతి సాయినాథ్ (హైదరాబాదు)

* * *











"ఏమిటి విశేషాలు?"

"ఏ వున్నాయి? నువ్వే చెప్పాలి."—

"అద్సరేకాని, అయితే అయ్యిందిగానీ, మాంచి, గా మంచివాణ్ణి వేసేరేవ్"

"మా బాగా చెప్పావు—కరకట్టుగా పోయే కార్యమయిన మనిషి—ఆ మా రాజా."

"అందుకనేగా యీ తిప్పలూ, వూళ్లో పెదసుబ్బయ్యా, వరహాలు, నరసింహాలూ ఒకటే తిట్లు—గాళ్ళకి పడదాయె—మరి—ఎలా కుదురుతుందంట"

"బాగా చెప్పావు—రూలుబిరి తప్పిపోయేవాళ్ళకి యీ మారాజులాటివాళ్ళ మరి ఎలా నచ్చుతారు"

"అవునవును—"

"ఆ, యింకా ఏమ్మి విశేషాలు?"

"ఏ వున్నాయి-అలాపోలేరమ్మగుడి కెళుతున్నా"

"మంచిది-నే కలా గడ్డివాముకి బయల్దేరా"

* * *

ఇనస్పెక్టరు ధర్మారావు ఆవూరి కబుర్లకు ముఖ్యకారణమై పోయాడు. ట్రాన్స్ఫర్ అయి ఆ ఊరు వచ్చి పట్టుమని పదిరోజులు కూడా కాలేదు, పదిమందినోట్లోనూ అతని పేరే - అతన్ని గురించి చెప్పుకునేవాళ్లల్లో "అబ్బ—చంపేస్తున్నాడ్రా నాయినా—వచ్చి నాల్నాళ్ళు పొద్దయిందో లేదో—" అనుకునేవాళ్ళూ లేకపోలేదు.

* * *

అన్ని గడియారాలతోపాటు పోలీసు స్టేషనుతో గడియారంకూడా పది గంటలు కొట్టింది ఆ గడియారం గంటలు కొట్టడమేకాక, ధర్మారావు ఏకాగ్రతను కూడా భంగపరచింది ధర్మారావు తల గోక్కుని గడియారంకేసి చూసి, తల దించుకున్నాడు. బరువుగా, దీర్ఘ విశ్వాసాన్ని బయటపెట్టాడు. కుర్చీవెనక్కు నెట్టి లేస్తూ, అంతలోనే కూర్చున్నాడు. మళ్ళీ మౌనముద్ర ధరించాడు. ఇంతలో గడియారం పెద్దముల్లు మరో పదినిముషాలు ముందుకు నడిచింది.

"మిష్టర్ శంకర్" - అన్నాడు వున్నట్టుండి.

"యస్సార్" అంటూ శంకరం ఉలిక్కిపడి, కుర్చీవెనక్కునెట్టి లేచివచ్చి ఆతనిముందు నిల బడ్డాడు.

"అల్లి హత్య ఫైలు యిలా పట్టుకు వస్తారా" అన్నాడు తన టేబిలుమీదున్న ఫైళ్ళ పక్కకి జరుపుతూ.

"అది హత్య కాదుసార్" అన్నాడు శంకర్ ముఖంమీదికి వీలైనంత చిరునవ్వు తెచ్చుకుంటూ, ధర్మారావు మాట్లాడకుండా తల ఎత్తి



అతనివంక చూశాడు. శంకర్ తల వంచుకుని వెళ్ళి, ఆ ఫైలు పట్టుకువచ్చి, అతని టేబులుమీద పెట్టాడు.

"మిస్టర్ శంకర్—ఇది హత్యకాదని మీరు చెప్పగలరా?" అన్నాడు ధర్మారావు ఫైలు విప్పుతూ. శంకర్ యిబ్బందిగా నవ్వి, బెల్టు సరిచేసుకున్నాడు. ఆనక, "లేదుసార్—దర్యాప్తు చేసి, అలా తేల్చారు—అందుకని అలా అన్నాను నేను" అంటూ తన స్థానం వైపు వెళ్ళాడు.

"అవును—చేయరాని పనులు చేయగలగడం, చేసినవి చెయ్యనట్టు చూపించగలగడం, చెయ్యనివి చేసినట్టు నిరూపించగలగడంలాంటి వింతలు ఒక్క మానవుడే చేయగలడు యీ జగత్తులో" అంటూ ధర్మారావు ఆ ఫైలు పేజీలు తిరగెయ్య సాగాడు

* * *

సాయంకాలం అయ్యింది. పగలల్లా తన కిరణాలతో లోకాన్ని వెలుగులో ముంచివేత్తిన సూర్య భగవానుడు, ఆనాటికి తన కర్తవ్యం నెరవేరిందని, లోకంమీద తీపితో సంచరిస్తున్న తన కిరణాలను లాక్కుని, పడమటి కొండల వెనక్కి పరిగెత్తాడు.

ధర్మారావు స్నానాదులు ముగించి, యింటి ముందు ఆరుబైట మడత కుర్చీలో కూర్చుని, ఆనాటి దినపత్రిక చూసుకుంటున్నాడు. అసలే పల్లెటూరయిన ఆ వూరికి కొంచెం అవతలగా ఆ యిల్లు వుండడంవల్ల ప్రశాంతత ఆ ప్రదేశానికి కొత్త అందం అయ్యింది పత్రిక చూడడం అయిపోయి పక్కనపెట్టి, శూన్యంలోకి చూస్తూ, ఆలోచనా సముద్రంలో అతను మునిగిపోయాడు. అతని బుర్రనిండా ఆలోచనలు సుడులు సుడులుగా తిరగ సాగాయి. ఇంతలో బయట కారు ఆగిన శబ్దం అయ్యింది. ధర్మారావు కుర్చీలోంచి ముందుకు వాలి చూస్తూ, "వీరయ్యా ఎవరో యిది" అన్నాడు. జవాను వీరయ్య గమ్మునలేచి, తొంగి చూస్తూ, "రావూ బహద్దురు రామారావుగారండి సార్" అన్నాడు చిన్న గొంతుకతో.

"అంటే ఎవరు? మనింటికేం ...

ఇంతలో ఆ వ్యక్తి కారు దిగి లోపలకు వచ్చాడు. ధర్మారావు యాంత్రికంగా కుర్చీలోంచి లేస్తూ, "కూర్చోండి" అన్నాడు. ఆ వ్యక్తి చిరునవ్వుతో కుర్చీలో కూర్చున్నాడు. ధర్మారావు సౌంజ్ఞని గ్రహించి జవాను వీరయ్య రెండు కాఫీలు తేడానికి వెళ్ళిపోయాడు.

"ఏం—నన్ను గుర్తుపట్టే లేదన్నమాట—వోరి నీ యిల్లు బంగారంకానూ, అవున్లే—అంత జ్ఞాపకశక్తి వుంటే నువ్వి పోలీసు ఉద్యోగంతో ఎందుకు వుంటావులే" అంటూ ఆ వ్యక్తి నవ్వాడు.

ధర్మారావు ఆశ్చర్యంగా తలెత్తి అటువంక తేరిపార చూశాడు. అతని కళ్ళు మెరిశాయి. ముఖంమీద నవ్వు వెలిసింది.

"వ్హా—నువ్వటా—రావు బహద్దరుఅంటే ఎవరో అనుకున్నాను" అన్నాడు కుర్చీకోడుమీద ముక్కాలు వుంపు వేస్తూ.

"హ్హా—అయితే బానే గుర్తున్నానన్నమాట" అన్నాడు రావు బహద్దరు కళ్ళజోడు తీసి, కళ్ళు తుడుచుకుంటూ.

ధర్మారావు పేలవంగా నవ్వాడు—"విన్ను—నారాయణరావుని గుర్తు వుంచుకోకుండా ఎలా వుంటాను? అన్నం పెట్టిన వాడికన్నా, నోటిదగ్గర అన్నం తీసినవాణ్ణే ఎక్కువ గుర్తుంచుకుంటాము" అన్నాడు.

రావు బహద్దరు మీసాలు సరిచేసుకుని సాభిప్రాయంగా నవ్వాడు. "సర్లే—ఆ పాత గొడవల్నీ—నారాయణరావుని వొదిలై—యిప్పుడు రామారావు—యిది కొత్త గొడవ—ఆ—అన్నట్టు—నువ్వీవూరొచ్చి పదిరోజు లయ్యిందిటకదూ—నేను ఫ్యాక్టరీ పనులోత్తు ఊరెళ్ళి మూడు వారా లయ్యింది. ఇవాళ మధ్యాహ్నం వచ్చాను—తీరా వచ్చేసరికల్లా నీ సంగతి తెలిసింది. చూద్దానికి పరిగెట్టు కొచ్చేశాను. వూ—నీ ఆరోగ్యం గట్రా ఎలా వున్నాయి—" అన్నాడు కుర్చీలో వెనక్కి వాలుతూ.

ధర్మారావు ఆ ప్రశ్నకు సమాధానంగా నిట్టూర్పు విడుస్తూ, "హ్హా—నా ఆరోగ్యం సంగతా—ఆనాడు స్థితిగతులతోపాటు ఆరోగ్యంకూడా దిగజారింది. ఇక పోతే యీ కేన్సరువ్యాధి కొత్తగా వచ్చింది. ఇది నీకు తెలీదు బహుశా—యిదీ యీనాటి నా సంగతి" అన్నాడు.

"ఏన్టి—కేన్సరా—అశ్రద్ధ ఎందుకలా చేస్తావు—చాలా డేంజరుస్మే—" అన్నాడు రావు బహద్దరు.

"డేంజరు—ఎన్ని డేంజరుల్లోంచి నువ్వు బయట పడలేదు, ఈ ఒక్క డేంజరులోంచీ నేను బయటపడలేనంటావా — సరి — మరీ మంచిది" అన్నాడు ధర్మారావు.

ఈలోగా వీరయ్య కాఫీ పట్టుకొచ్చి యిచ్చాడు. కాఫీలు తాగి, మరికొంతసేపు లోకాభిరామాయణ చర్చ అయ్యాక, రావు బహద్దరు రామారావు లేస్తూ, "ఆ—ధర్మం—నే వొస్తానోయ్—రేపలా మా యింటి కోసారి రాకూడదూ—ఏం—" అంటూ బయల్దేరాడు. అతన్ని సాగనంపి, ధర్మారావు లోపలకొచ్చి కుర్చీలోవాలిపోయాడు. అతని మనస్సు కొన్ని సంవత్సరాల వెనక్కి వెళ్ళి జ్ఞాపక శక్తి పుటలు తిరగేసింది

"లోకం—మంచీ—చెడుకీ, తెలుపూ, నలుపుకూ, నానాటికీ భేదం కనుపించకుండా పోతోంది." ఆనాడు నారాయణరావుకీ, ఈనాటి ధర్మారావుకీ ఎంత వ్యత్యాసం? ఆనాడు నారాయణరావు కిరాతకుడు—దేశద్రోహి—ఆత్మద్రోహి, కులద్రోహి .. ఈనాటి రామారావు — రావు బహద్దరు. రావు బహద్దరురామారావు.... .. ."

ధర్మారావు హృదయం భగ్గుమంది. ఆనాటి తనచరిత్ర చలనచిత్రంగా తన కన్నులఎదుట నాట్యం ఆడింది అతని శరీరంలోని, నవనాడులూ కుదించుకుపోయాయి. వేళ్ళు బిగుసుకున్నాయి. కోపంతో పళ్ళు పటపటలాడాయి.

# ధ్యేయం

బరువెక్కిన హృదయంతో ఆనాడు భోజనమైనా చేయకుండా, అతను పక్కమీద వాలిపోయాడు. రాత్రంతా నిద్రపట్టక, కళ్ళు మూసినా, తెరిచినా కనుపించే సంఘటనలతో, రాత్రి వెళ్ళబుచ్చాడు.

* * *

"తెల్లవారి ఏడుగంట లయ్యింది"

"ఏడయ్యి—ఏడు గంటలయ్యింది."

కాఫీకని లేచిన ధర్మారావు తిన్నగా యింటికి వచ్చేశాడు. ఆనాటి అతని ప్రవర్తన తోటి, క్రింది తరగతుల ఉద్యోగులను ఆశ్చర్యపరచింది. ఇంటికి వచ్చిన ధర్మారావు బట్టలు మార్చుకుని, కుర్చీలో కూర్చుని సిగరెట్టు వెలిగించాడు. గాలిలోని సిగరెట్టు పొగలా, అతని మనస్సు వేయి మెలికలు తిరిగింది సిగరెట్టు నేలమీద పారేసి, కాలితో నలిపేసి, లేచి, గ్లాసుడు మంచినీళ్ళు తాగాడు. మళ్ళీ వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. అతని మనస్సు గత సంఘటనలలోని ఘటనలను గుర్తుచేయసాగింది.

దారినపోతున్న ఇద్దరమ్మాయిల కట్టూ, బొట్టూ శాస్త్రి గారికి బొత్తిగా నచ్చలేదు.

"అలాంటి అమ్మాయి మీ భార్య అయిందనుకోండి! లోకం ఏమనుకుంటుంది?" శాస్త్రిగారు పక్కింటి బ్యాంకు గుమాస్తా చంద్రాన్ని అమాయకంగా అడిగారు.

"ఏమంటుందీ! ఆఅమ్మాయి డబ్బునుచూచి పెళ్లిచేసుకున్నానంటుంది" చంద్రం సమాధానానికి తడుముకోలేదు.

టి. అబద్దయ్య (శ్రీకాకుళం)

"అవును—ఆనాడు తను తనవృత్తి నిర్వహణ కోసం, నిండు చూలాలుగానున్న తన భార్యనూ—వయసు చెల్లిన తల్లినీ, వయస్సులోవున్న కూతుర్నీ వదిలి—దూరప్రాంతాలకు వెళ్ళవలసి వచ్చింది — ప్రభుత్వాన్ని మోసగించి, రహస్య సేకరణ గావించుచున్న ఒక వ్యక్తిని పట్టుకునేటందుకు తనువరుగు లెత్తవలసి వచ్చింది...... కానీ ఫలితం శూన్యం..... ఇంటికి వచ్చేసరికి..... ......"

" .. . .. . ఎవరు? . ........" అంటూ ధర్మారావు ఆలోచనలకు అంతరాయం కలిగిన తలుపు శబ్దాన్ని విని ప్రశ్నిస్తూ, కళ్ళు తుడుచుకుని లేచి, తలుపు తీశాడు.

"నేనే—ఏం? వంట్లో బాగుండలేదా......', అంటూ రామారావు లోపలకు వచ్చాడు. "కూర్చో", అంటూ ధర్మారావు మంచంమీద కూర్చున్నాడు.

"ఏం—అలా వున్నావు—స్టేషను కెళ్ళా—నువ్వు యింటి కెళ్ళావని చెప్తే, ఇలా వచ్చాను—ఏం—" అన్నాడు రామారావు చుట్టపొగ వదులుతూ.

"ఇలా వుండక ఎలా వుంటాను? వంట్లో—అవును వంటికి, లోపలా, బయటాకూడా బాగులేదు—" అన్నాడు ధర్మారావు మంచంమీంచి లేచి వేరే కుర్చీలో కూర్చుంటూ. రామారావు ఆరిపోయిన చుట్ట మరోసారి వెలిగించి, పకపకా నవ్వి, ఆనక చిరునవ్వు నవ్వాడు.

"అబ్బాయ్! నీకూ నాకూ ఎప్పుడు సరిపడింది? నా వుద్దేశ్యాలూ, అభిప్రాయాలూ నీ అభిప్రాయాలతో ఏనాడూ ఏకీభవించలేదు. నా వుద్దేశ్యంలో మనిషి అన్నతర్వాత ఏది మంచి, ఏది పుణ్యం అనే ఆలోచనలతోకన్నా, ఏది లాభదాయకం అనే ఆలోచనతో చెయ్యాలని నా వుద్దేశ్యం—బహుశా నాతో ఏకీభవించనివాళ్ళు చాలామంది వుంటారనుకో — అయితే ఏం—నేను చేసుకున్న మార్గాన్ని అనుసరించి నేను నడచాను. ఫలితం—యీనాడు లక్షాధికారిని. నువ్వు — ప్రభుత్వాన్ని అంటిపెట్టుకుని, ఉయ్యాలలో పసిపిల్లాడులా, పైకీ, కిందకీ ఊగుతున్నావు—నీలో తెగింపులేదు చిన్నప్పటినుంచీ కూడా నువ్వు అంతే —ఆనాడూ — ఏనాడు—అది మన చిన్నతనం—గుర్తుందా—గోటింబిళ్ళ ఆటలో కూడా నువ్వు మోసం చెయ్యలేకపోయేవాడివి. ఫలితం ఏవిటంటావు—ప్రతీఆటలో—నువ్వే ఓడిపొయ్యేవాడివి—ఆనాటి ఆటలే—పెద్దయ్యాక చెయ్యాత లౌతాయి. ఆనాటి పిరికిభావమే నీలో యీనాడు స్థిరమయ్యింది. నేను చూడు—ఆనాడు నామకుణ్ణే—యీనాడు రావు బహద్దరు రామారావుని—నాపేరు చెపితే పెట్రోలు లేని కారయినా చప్పున పదిబారలైనా పొగుతుంది. ఏవంటావ్—" అన్నాడు గాలిలో తను వదలిన పొగవైపు చూస్తూ. ధర్మారావు స్వగతంగా నవ్వుకున్నాడు.

"కానీ—అన్ని ఘోరాతిఘోరాలు చేసిన ప్రతి వ్యక్తి నీలా యింత అదృష్టవంతుడౌతాడంటావా—ఆమాటకి వస్తే—ఇది అదృష్టం అసలు కాదనుకో!—కానీ—నీ వుద్దేశ్యంలో అదృష్టమేగా—ఆనాడు—యీనాటికి సుమారు యిరవై అయిదేళ్ళయ్యి వుంటుందేమో... . ."

"—అవును ఆ మాత్రం అయివుంటుంది—" అన్నాడు రామారావు.

"—అవును—ఆనాడు ప్రభుత్వ దృష్టిలో నువ్వు దేశద్రోహివి ఇటు పరప్రభుత్వాన్ని ప్రతిఘటించి, ఎదుర్కొనే వ్యక్తులకు స్నేహద్రోహివై ఎంతమంది నాశనాలకు కారకుడవయ్యావు—నిన్ను పట్టుకుని, నా ధర్మం నేను నెరవేర్చుకోలేనందువల్ల ప్రభుత్వ దృష్టిలో నేను ద్రోహిగా అనుమానించబడ్డాను. ఫలితం—నాకన్నా ఎక్కువ నీకే తెలిసి వుంటుంది" అంటూ ఆగాడు రామారావు యిదంతా ఒక ఉపన్యాసం విన్నట్టు విని, చప్పగా నవ్వేసి, చప్పున బయటికెళ్ళి, వుమ్మేసి, వచ్చి కూర్చున్నాడు. ధర్మారావు కనుకొంకుల్లో నిలిచి, క్రిందికి రాలేకపోతున్న వేడి కన్నీటి బొట్లను చేత్తో తుడుచుకున్నాడు

ఆనాటి బాతాఖానీ అంతతో ముగిసింది. రామా రావును సాగనంపి, ధర్మారావు తన ఆలోచనా ప్రపం చంలో మునిగిపొయ్యాడు.

* * *

మర్నాడుకూడా ధర్మారావు యాంత్రికంగా, పరధ్యాన్నంగా వుండడంచూసి, శంకర్ సాహసించి, "ఏమండీ అదోలా వున్నారు" అన్నాడు. ధర్మారావు నవ్వాడు.

"శంకర్‌గారూ—మీకు పూనకం అంటే ఏమిటో తెలుసా"

"తెలుసు సార్" అన్నాడు శంకర్ ఆ ప్రశ్న ఎందుకు అడిగాడో తెలుసుకునేందుకు.

"చెప్పండి" అన్నాడు ధర్మారావు.

"ఒక అమ్మవారుగానీ, మరో దేవుడుగానీ, ఒక మనిషిని ఆవహిస్తారు — అంటారండి. దీన్నే పూనకమంటారు" అన్నాడు.

"అవును—అంటే ఏదో ఒక విషయంలో పూర్తిగా మునగడం అన్నమాట—అంతేకదా! అదే! ఇప్పుడు నేను అదే స్థితిలో వున్నాను. అంటే చచ్చిపోయిన మోహన్ నాకు పూనేడన్నమాట—కానీ — ఇది వేరే రకం పూనకం అవడంవల్ల నేను పూనినవాడిలా మాట్లాడలేకపోతున్నాను — అంతే, తెలిసిందా" అన్నాడు ధర్మారావు అతనివంక చూస్తూ.

"మీరు బలేగా మాట్లాడుతారు సార్" అన్నాడు శంకర్ ఏమనాలో తెలీక.

"బాగా మాట్లాడడమేకాదు, అంతకన్నా బాగా కర్తవ్యం నెరవేరుస్తాననికూడా పేరు" అన్నాడు ధర్మారావు అతనిముఖంలోకి చూస్తూ.

శంకర్‌కి ఏమని సమాధానం చెప్పాలో తెలీక, ముఖం ముడుచుకుని కూర్చున్నాడు. మరో పది నిముషాలు అయ్యింది. ధర్మారావు అతనివంక చూస్తూ, "మిస్టర్ శంకర్—ఒక్కసారిలా వస్తారా" అన్నాడు. శంకర్ గమ్మున కుర్చీలోంచిలేచి అతనివద్దకువెళ్ళి నిలబడ్డాడు.

"కూర్చోండి" అన్నాడు ధర్మారావు. శంకర్ అతని ఎదురుగావున్న కుర్చీలో కూర్చున్నాడు.

"చూడండి, ఒక ప్రశ్న వేస్తాను. చాలా జాగ్రత్తగా ఆలోచించి సమాధానం చెప్పాలి—" అన్నాడు ధర్మారావు అతనివంక చూస్తూ. శంకరం గుడ్లప్ప గించి చూస్తూ, తల ఊపాడు.

"ఒక ఊళ్ళో రాముడనే దొంగ, భీముడనే హంత కుడూ వున్నారు. ఆ ఊళ్ళో ఒకే సమయంలో ఒక హత్యా, ఒక దోపిడీ జరిగాయి. రెండూ ఒకే చోట, అంటే ఒకే యింట్లో జరిగాయి. మీకు అనుమానం ఎవరిమీద వుంటుంది. మరోటి హత్య ధనంకోసమే చెయ్యబడింది. తప్పనిసరి అయి ఆమనిషి వాళ్ళే చంపాడనుకో—యిప్పుడు చెప్పు—" అన్నాడు ధర్మా రావు టేబులుమీద పెన్సిలుతో టక టక లాడిస్తూ.

"ఇంకేముంది, భీముడే అయివుండాలి" అన్నాడు శంకర్ వెంటనే.

"కానీ రాము డెందుకు హత్యచేసివుండకూడదు" అన్నాడు ధర్మారావు. శంకర్ బుర్ర గోక్కున్నాడు. "అవును—నీ బుద్ధికి తోచింది, చెప్పావు. అంతేకదా—ఊ—యిక నువ్వు వెళ్ళొచ్చు—అంతే" అన్నాడు ధర్మారావు కుర్చీని గోడకి జారవేశాడు. శంకర్ కుర్చీ నించి లేచి, తనసీటులో మౌనంగా చతికిలపడ్డాడు.

* * *

ఆ సాయంత్రం యింట్లో వసారాలో కూర్చుని మోహన్ హత్యాకాండనిగురించి ఆలోచిస్తుండగా రావుబహద్దూరు వచ్చాడు — వస్తూనే, "ఓరి యిల్లు బంగారంకానూ, నీ గుణం పోనిచ్చావు కాదయ్యా ఎన్నిసార్లయినా నేనే రావాలిగానీ నువ్వు మా యింటికి రాకూడదా ఏమిటి" అంటూ కుర్చీలో కూలబడ్డాడు. ధర్మారావు విరాగి లా నవ్వాడు.

"నీయిల్లు బంగారంకానూ అన్నకంటే నీ యిల్లు వల్లకాడుకానూ అన్నముక్క నాకు వాడితే బావుంటుంది. ఎందుకంటే—ఎలాగా జరిగే పోయిం దిగా — ఆమాటకూడా నీ నోటిగుండానే వింటే యిక నేనూ నిశ్చింతగా చచ్చిపోవచ్చు— ఆ—యిక— మీయింటికి రాకూడదా అన్నావు కదూ, వస్తే

---

"మా వారు తాను హరి శ్చంద్రుణ్ణని అందరికీ చెబుతూ ఉంటారు. కొంపతీసి ఆయనకు పిచ్చ ఎత్తలేదు కదా?" ఒక ఇల్లాలు వైద్యుణ్ణి అడిగింది.

"మిమ్మల్ని చంద్రమతీ అని ఆయన పిలవనంతకాలం దిగులు పడకండి." వైద్యుడు ధైర్యం చెప్పాడు.

ఎస్. విఠల్ రావు (గుడివాడ)

---

నొస్తాను. రాకుండా తప్పుతుందా" అన్నాడు రావు బహద్దూరువంక చూస్తూ. రావు బహద్దూరు చిన్న ముఖం చేసుకుని, కుర్చీలో ఇబ్బందిగా కదిలాడు. అతనిలో మార్పుని గమనించి, ధర్మారావు చిన్నగా నవ్వుకుని, 'ఆ—ఏమిటి విశేషాలు—కులాసావేనా—ఫ్యాక్టరీ ఎలా నడుస్తోంది" అంటూ సంభాషణలోకి దించాడు.

"ఆ—బావికేంపోయే! ఫ్యాక్టరీ బ్రహ్మాండంగా నడుస్తోంది. నీవో సారి మా ఫ్యాక్టరీ చూడ్డానికి రాకూడదా ఏమిటి, ఎటు రమ్మన్నా వస్తా నొస్తా నంటావు, రావు—" అన్నాడు ఉత్సాహంగా. ధర్మా రావు నవ్వాడు.

"ఏం? ఫ్యాక్టరీలో చట్టవిరుద్ధమైన కార్యాలు ఏమైనా జరుగుతున్నాయా, చెప్పు చెప్పు—యిప్పుడే వస్తాను" అన్నాడు.

"స్టీ నీ యిల్లు బంగారంకానూ" రావు బహద్దూరు పెళ్ళున నవ్వి మూల్గిన దగ్గి, "నీతో ఏమన్నా పేచీయే—భలేవాడివిలే" అన్నాడు.

"ఇంకా భలేగా వుండబోతున్నా" అన్నాడు ధర్మా రావు. రావు బహద్దూరు మరోసారి నవ్విపోశాడు. ఆపైన మరికొంత ఏవేవో మాట్లాడుకున్నాక ఎవరిదారిన వాళ్ళు పోయారు మిగిలిన ధర్మారావు రావుబహద్దూరుని గూర్చి ఆలోచిస్తూ, నిద్రకుపక్రమించాడు ఆరాత్రి.

* * *

నిద్రపట్టక పక్కమీద ఎగిరి కూర్చున్నాడు రావు బహద్దూరు. అతని శరీరం ముచ్చమటలు పోసింది. తలదిక్కున్న స్విచ్చి వేశాడు. హాయిగా మంటూ వెలుతురు వచ్చేసింది కానీ అతనికి కటిక చీకటిలానే అనిపించింది తువ్వాలుతో ముఖం తుడుచుకుని, లేచి ఫాను వేశాడు "అబ్బ—ఎంత పీడకల?" అను కున్నాడు. వెంటనే "అది కలా?" అన్న అనుమానం వచ్చింది. నిజమే—అది కలకాదు. జరిగిన విషయమే. అతని శరీరం భయంతో ముడుచుకుపోయి గడగడ లాడింది. చప్పునలేచి ఫాను అపుచేశాడు వణుకు తగ్గలేదు. ఇంతలో కరెంటు పోయింది కలలో మిగిలిన భాగం అతని కళ్ళ ఎదుట కనుపించ సాగింది. రామారావు దుప్పటీనెత్తినిండా ముసుగుతన్ని పడు కున్నాడు. దుప్పటిమీద వెండితెరమీదలా అదే ఘట్టం—"

"—అది అర్ధరాత్రి—ఒక మనిషి—ఒకయింటి తలుపు తట్టాడు. తలుపు తెరుచుకోలేదు. మళ్ళీ తట్టాడు. చుట్టుపక్కల యిళ్ళన్నీ ప్రశాంతంగా వున్నాయి కొండ లోయల్లోంచి, చెట్లనుంచి కీచు రాళ్ళ ధ్వని భయంకరంగా వస్తోంది. వుండుండి వచ్చే గాలి, చెట్ల ఎండుటాకుల మధ్యనుండి వయునించి 'గీ గీ' యన్న ధ్వని వికృతంగా చేస్తోంది—ఆ మనిషి చుట్టూ కలయజూసి, తలుపు మరోసారి తట్టాడు. సమాధానంగా తలుపు తెరుచుకుంది. తెరిచిన ఆడ మనిషి నోటిమీద అతని చెయ్యి బలంగా పడింది. అంతే — ఆ అభాగ్యజీవి లోకంలోకి తొంగిచూడ బోతున్న మరో జీవితో నేలరాలిపోయింది—ఆ వ్యక్తి ఆమెకేసి కసిగా చూసి—బయటికి రాబోయి ఒక్క క్షణం తల వంకించి నించున్నాడు—అంతే— మరో నిముషంలో ఆ యింటిలోంచి లేచిన మంటలు ఆ ఊరి ప్రజలను లేపాయి ఆవ్యక్తి ....వా...."

రామారావు కెవ్వున కేకవేస్తూ, దుప్పటిని నిగడతన్ని లేచి కూర్చున్నాడు. ఆ కేకకి నౌకరు పరిగెత్తుకు వచ్చి, "బాబుగారూ" అంటూ తలుపు తట్టడం ప్రారంభించాడు ఆశబ్దానికి రామారావు ఈలోకంలోకి వస్తూ, "ఆ — ఏం" అన్నాడు. జవాను తలుపు తట్టడం ఆపేసి, "బాబుగారూ— ఏదో పెద్దకేక వినిపించింది—అందుకు—" అన్నాడు ఆపైన ఏమనాలో తెలీక. రామారావు లేచి తలుపు తీస్తూ, "అదే, ఆకేక ఎక్కణ్ణించి వచ్చింది" అన్నాడు. జవాను కొయ్యబారిపోయాడు. తెప్పరిల్లి, "తెలీదుబాబూ" అంటూ నిష్క్రమించాడు. రావుబహద్దూరు తలుపు వేసుకుని సిగరెట్టు ముట్టించి పడకకుర్చీలో కూర్చున్నాడు. అతని బుర్రంతా వేడి ఆలోచనలతో నిండిపోయింది. అతని మనోఫలకంమీద ధర్మారావు రూపం చెరగనిరీతిగా హత్తుకుంది.

"ఆ...... ఇక ......మీ ఇంటికి రాకూడదా అన్నావుకదూ—వస్తాను—రాకుండా తప్పుతుందా?" అన్న ధర్మారావు మాటలు అతని చెవులో దేవాలయం గంటల శబ్దాల్లా రింగురింగున మోగాయి. కోపంతో అతని పళ్ళు భగ్గుమంది. సిగరెట్టుని నేలమీద పడేసి, కాలుతో కసిగా రాశాడు. "ఏమో! ధర్మారావు ......

# ధ్యేయం

ధర్మారావు ... ఇంకా భలేగావుండబోతున్నాట్ట— వుండనీ—వుండమను. నాకేం—నేనేనా వుండలేనిది— వీడి స్నేహంకోసం పాకులాడుతున్నాననుకున్నాడా— వెర్రి రాస్కెల్ . .హి . .." అని గాండ్రించి మనస్సుకి ధైర్యం పోగుచేసి యిచ్చి, లైటార్పి పక్క మీద వాలిపోయాడు.

*   *   *

నిద్రపట్టక ధర్మారావు లేచి కూర్చుని మళ్ళా, మళ్ళా మళ్ళీ మోహన్ హత్యనిగూర్చి ఆలోచించ నారంభించాడు

*   *   *

అమర్నాటి సాయంత్రం రావుబహద్దూరు బయల్దేరబోతుండగానే ధర్మారావు వచ్చాడు. వస్తూనే "ఎక్కడికీ బయల్దేరావు—నే నెదురొస్తున్నా— ఫలితంలో సగం నాది" అన్నాడు నవ్వుతూ. ఆ నవ్వుతో తనపాలుకూడా రామారావు కలిపాడు. ఇద్దరూ చెరో సోఫాలో కూర్చున్నారు. రామారావు నౌకర్ని పిలిచి, కేక్‌లూ, అవీ తన రూములోంచి తెప్పించి, "రాక రాక వచ్చావు ఏవిటి నిన్ను ఒదుల్తానా .... ఇవన్నీ తినాల్సిందే" అంటూ కూర్చున్నాడు. ధర్మారావు నవ్వుతూ విందారగించి, పానీయాలు సేవించి, సిగరెట్టు ముట్టించి, సోఫాలో వెనక్కు వాలాడు. రామారావు పైప్ వెలిగిస్తూ, "ఆ, ఏవిటి విశేషాలు—ధర్మం" అన్నాడు.

"నీ ధర్మమాని, ఏవీ లేవు" అన్నాడు ధర్మారావు

"ఆ—నీ ఉద్యోగం ఎలా వుంది. అన్నట్టు నువ్వు ఆరోగ్యంవిషయంలో అశ్రద్ధ ఎక్కువగా చేయకు— నా మాట విను" అన్నాడు.

"ఆ—ఏవి ఆరోగ్యం — ఇవతల ఆవెధవకేసు నా ప్రాణాలు తోడేస్తోంది. దానికన్నా ఈ రోగమే నయం—" అన్నాడు ధర్మారావు.

"ఏహత్య?—ఆ మోహన్రావుదేనా—పాపం. అది, ఏదో ప్రమాదమని తేల్చేశారుకానీ—అసలతనికి అలాటి ప్రమాదం సంభవించే అవకాశం ఎందుకు కలిగింది ఆ వైపు ఎందుకు వెళ్ళాడు అన్న ధోరణి లేదే! ఏవిటో—" అన్నాడు రామారావు సాభిప్రాయంగా.

"మోహన్ని అసలు నువ్వెరుగుదువా—అతను ఎలాటివాడూ — కొంచెం చెప్పవయ్యా — ఈ కేసులో ఓపక్కకివస్తే — చచ్చేలోపున ఓపని చేసినవాడినన్నా అవుతాను" అన్నాడు ధర్మారావు

రావుబహద్దూరు సోఫాలో వెనక్కువాలి, కాళ్ళు మెలిక వేసుకుని ప్రారంభించాడు.

"విను . ."

"ఊ !"

"మోహన్—చాలా అందగాడు. అతని పేరు అతని రూపానికన్నా కొంచెం తక్కువే అనుకో— మనిషి భారీ—అంటే, నా అంత ఎత్తు వుంటాడు. ఇక్కడికి నూటయాభై మైళ్ళ దూరంలో పోనీ— రెండు వందలనుకో— ఓ ఊరుంది. ఆ ఊళ్ళో వుండేవాడు, మోటారుసైకిలుమీద తరుచు అన్ని ఊళ్ళూ తిరుగుతుండేవాడు ఇకపోతే అతనికి ఎవరైనా స్నేహితులే—అంటే లెక్కలేదన్నమాట— అప్పుడప్పుడు నా దగ్గరకి వచ్చిపోతూవుండేవాడు. పోనీ యీ తిప్పలెందుకూ, నా ఫ్యాక్టరీలో ఏదో ఉద్యోగం యిస్తానంటే నవ్వేశాడు—అంటే—అతనికి ఏ పన్నీ అంటిపెట్టుకుని వుండాలన్న కోరిక లేదేమో మరి—యిది ఆ మధ్యన ఏదో పెళ్ళాడబోతున్నానని ఓవంద పట్టికెళ్ళాడు—నెలతిరిగిందో లేదో అంతే— చచ్చూరుకున్నాడు—నయమే—యింకా ఆ మూడు ముళ్ళువేసి, ఆపిల్లమెడకి యింకో ముడి కూడా వేసి వుండును. ఆ పిల్ల అదృష్టవంతురాలు. పడబోయే ముడులన్నీ తప్పించుకుంది" అంటూ కథని ఆపి, ధర్మారావువంక చూస్తూ, "ఇదబ్బాయ్! అతని సంగతి — ఏమైనా పనికొస్తే ఉపయోగించుకో" అంటూ ఆగాడు.

"అంటే మోహన్ నీకు చాలా ఋణపడ్డాడా?" అన్నాడు ధర్మారావు రామారావు కాళ్ళ మెలికతీసి నిటారుగా కూర్చుని కళ్ళజోడు తీసి, తుడుస్తూ "ఆ—ఏదో కొద్ది మొత్తం—అయినా నాకేం లెక్క— ఇదంతా చచ్చినోడ్ని చెప్పిన దేవిటి—ఆహా— మన్లో మనమాట. ఆమాటకొస్తే—నీకు తెలియదేవిటి— అద్సరే—ఏం— ఆ మొత్తంకోసం చంపేనని నీ అనుమానమా?" అన్నాడు గుక్కతిప్పుకోకుండా.

ధర్మారావు తలవంకించాడు

"ధనమూల మిదం జగత్" అన్నారు—అయినా అంత చిన్నకారణానికి నువ్వు ఒకణ్ణి హత్యచెయ్యవుగా— ఒహవేళ చేసినా, నిన్నందులో యిరికించినా, తప్పుకోలేని వాడవు కాదుగా."

"రామారావు రాళ్ళు దొర్లించినట్టు నవ్వాడు. "బాగా చెప్పావు—ఆ హత్య నామీదకు తొయ్యాలేగాని, యిదిగో—యిలా యిలా తప్పించుకోలేనూ!" అంటూ చిటికలువేసి చూపించాడు ఆనక మళ్ళీ వెటకటి నవ్వు నవ్వి నిరూపించాడు. ధర్మారావు నవ్వుతూ లేచి, "ఆ ఇక పోనా—పోతే— మరోనాడు ఫ్యాక్టరీ చూడాలి" అన్నాడు.

"ఫాక్టరీ—నా మతి మూడు. ఇల్లు చూడకుండా పోతుంటే నేనూ వూరుకున్నాను. పదపద అంతా చూద్దుగాని" అంటూ తన భవనమంతా చూపించి, ఆనక తోటా, బాటా చూపించాడు మళ్ళీ యిద్దరూ కలిసి లోపల కొచ్చి హాల్లో కూర్చున్నారు.

"ఏవిటో ధర్మం—నీ ధర్మమాని, ఏదో యిలా జీవితం గడుపుతున్నాను ఏవిటో—ఎందుకు బ్రతుకుతున్నానో, ఎప్పుడు ఎలాగ చస్తానో తెలీదు. ఏవిటో ప్రతి జీవీ యింతేకదా—యీ ప్రపంచమేయింత"— అన్నాడు రామారావు ధర్మారావువైపు చూస్తూ. ధర్మారావు సాభిప్రాయంగా నవ్వుతూ, "ఏం? అంత వైరాగ్యం తన్నుకొచ్చేసింది పాపం, ఇప్పుడు నీకేం వొచ్చింది తక్కువ—" అన్నాడు.

"ఏవుంది—చూడు—యింతుందా—ఏం వుంది ఏకాకినేకదా. యిదంతా ఎటుపోయేదో—ప్చ్"

"హ్హా—ఏకాకీ లేక, ఏకాకిలా కలకాలం బాధపడేకన్నా పోనీ, ఏకాకినో తెచ్చిపెట్టుకుని, యీ ఏకాకిత్వం పోగొట్టుకోరాదూ" అంటూ ధర్మారావు నవ్వాడు.

"ఆ కాకిత్వాలకన్నా, యీ ఏకాకిత్వమే మంచిది" అన్నాడు రామారావు లేచిన ధర్మారావు ననుసరిస్తూ.

(సశేషం)

“నువ్వేం అందివ్వక్కర్లేదు. నేనే చూసుకుం టాను.” కొంచెంచిన్నబుచ్చుకుందిగాని పట్టుమాత్రం విడవలేదు

“అదా సంగతి!” కొంచెం ఆలోచించినమీదట ఏదో అర్థమైనట్టు అంది ప్రియంవద

“ఏది సంగతి?”

“కొడుక్కి స్వహస్తపాకం తినిపించాలనా?—అల్లాగే చెప్పరాదూ. నేనేం కాదంటానా?” నవ్వేసింది.

“మహ బాగా కనిబెట్టావ్‌గాని—బియ్యం కడిగి పట్రా” ప్రియంవద వెళ్ళింది.

వంటకి అన్నీ సవరించి అత్తగారు పొయ్యిదగ్గర కూర్చుంటే పక్కనే కూర తరుగుతూ కూర్చుంది ప్రియంవద.

“ప్రియా—” కృష్ణగొంతుక పిలుస్తోంది వీధిగదిలోంచి.

ప్రియంవద పలకలేదు.

“ప్రియా—” కొంచెం గట్టిగాను, విసుగు తోను వినిపించింది మళ్ళీ

“వాడల్లా గొంతుక చించుకుని పిలుస్తుంటే చెవ్వుంకొట్టినరాయిలా కూర్చుంటావ్‌గాని కదల వేమే?”

“పనీ పాటూ లేదు ప్రియా ప్రియా అంటూ కూర్చోడం తప్ప ఆయనకి ఎదురుగా ఉన్నవే కని పించవ్ అందిచ్చేవాళ్ళుంటే—ఇక్కడ పనిలో ఉన్నావా కాస్త చూసుకోకూడదూ?”

“ముందు వెళ్లి వాడెందుకు పిలుస్తున్నాడో చూసిరా ఆ కూర నే తరుక్కుంటాను—ఊ—కదులు—”

అయిష్టంగానే కదిలింది ప్రియంవద.

ఈ లోపునే—“ప్రియా” మరింత గట్టిగా పిల్చాడు కృష్ణ.

“ఎందుకంత గావు కేకలు? అక్కడత్తయ్యకి కూర తరిగిస్తుంటే?” విసుక్కోబోయినా నవ్వాగలే దామెకు.

“నా కోటేది?”

“ఇప్పు డెందుకో సింగారం?”

“పెళ్ళిచూపులకి”

“అల్లాగేఉంది వాటం చూస్తే—”

“తమరు నోరు మూస్తారా?”

“ముయ్యకపోతే?”

“మూయిస్తాం—”

“మూయిస్తారేం?—అయితే మీ గుట్టు బయట పెట్టేస్తాను”

“ఏమిటో మహ—”

“మీరు సిగరెట్లు కాలుస్తున్నారని”

“చెప్పుకో—”

“అంతవరకూ వచ్చిందీ—అయితే ఉండండి—అత్తయ్యా—” ఇంక వాక్యం పూర్తి కాలేదు

పిలుపు విని ఇటువచ్చిన కమలమ్మగారు ఆ దృశ్యం చూసి వెంటనే వెనక్కు మళ్లింది నవ్వు కుంటూ

ఆమె రాకని వీరు గమనించలేదు

“ఛీ—సిగ్గు లేదు మనిషికి.” మందలించబోయినా మంద్రసమే ధ్వనించింది స్వరంలో.

“కపోతే చెప్పుందిట!”

# అంతరం

26-వ పేజీ తరువాయి

“ఇప్పుడైతే, నా నోరు ముయ్యగలిగారుగాని మీరు లేనప్పుడు చెప్తేనో?”

“ఆమాత్రం నమ్మకం నాకుంది.”

“బుద్ధిమంతులు!”

“ఇంతకీ నా కోటేది?”

“ఆ ఎదురుగా స్టాండు నేమిటో?”

“అరె! చూడనేలేదుస్మా!”

“మీరెందుకు చూస్తారూ, అందిచ్చేవాళ్ళుంటే? అవతల అత్తయ్యొక్కత్తీ వంట చూసుకుంటోంటే మీకు కోటు వెతికిచ్చేందుకో నౌకరు” అంటూ చేతి కదించి—“ఇంక ఆజ్ఞ యిప్పిస్తారా?” అనేసి లోపల కెళ్లింది.

కృష్ణ కోటుజేబులోని పర్సు తీసుకుని కోటు స్టాండునుంచేశాడు

“ఎందుకే పిల్చాడు?” కమలమ్మగారు కోడల్నడిగింది.

“నే చెప్పలా!—కోటు!—ఎదురుగుండానే ఉంది”

“ఉంటే మాత్రం—అందిస్తే అరిగిపోతావా?”

“అని నే నన్నానా—” అని కూర తరగడం మొదలెట్టింది

ఇంతలోకే “ప్రియా” మళ్లీ పిల్చాడు కృష్ణ.

“అబ్బబ్బ—పలకలేక చచ్చిపోతున్నాను ఆ చెప్పేదేమిటో యిక్కడికొచ్చి చెప్పరాదు బాబూ” అరిచింది.

ఆ ప్రాంతంలో కార్లమీద వెళ్లేవారెవరూ గంటకు ముప్ఫై మైళ్ళకంటే వేగంగా వెళ్ళరు. అక్కడ రోడ్లుకొండలుఎక్కుతూ దిగుతూ ఉండటంచేత వంకర టింకరగా ఉంటాయి.

ఒకవన్నెల విసనకర్ర రివ్వున కారునడుపుతోంది. పోలీసు ఎలాగైతేనేం ఆమెనుఆపి, “కారుఆపమని నేను పెట్టిన కేకలు మీకు వినిపించలేదూ?” అని గద్దించి అడిగాడు.

“కేకలు పెడుతున్నదినువ్వా? కారుక్రింద పడ్డవారేమో అనుకున్నా” ఆమె అమాయకంగా తన్నుతాను సమర్థించుకున్నది.

టి. సుబ్బరాజు, (అమలాపురం)

కృష్ణ వంటింటి గుమ్మందాకా వచ్చి—“అన్నట్టు మర్చి లేదు—బజార్లో ఏమైనా కావలిస్తే వచ్చేటప్పుడు”

“బాగా జ్ఞాపకం చేశారు ఒక డజను చెక్క కేళీ ఎళ్ళు, అరడజను బత్తాయిపళ్లూ పట్రండి. రేపు అత్తయ్యకి ఏకాదశిగా—పొద్దుటే మాత్రం వచ్చెయ్యండి — ఎవరితోనోహస్కు పెట్టుకుని కూర్చోక.”

“చిత్తం — వస్తానమ్మా — ” ఇద్దరికీ చెప్పి బయలు దేరాడు

“ఎంత జ్ఞాపకమే నీకూ—” తనవిషయంలో కోడలికిగల అమిత శ్రద్ధను గమనించిన ఆమె హృదయం పులకించిపోయింది

మేనత్త సంతోషం గుర్తించిన ప్రియంవద ముఖం వికసించింది

కమలమ్మగారు ఆలోచనలో పడింది ఏకాశి వారంరోజు లుండగా పోరడం మొదలుపెడితే పని హడావిడిలో అమాటే మర్చిపోతాడు భర్త చలి మిడే గతి తన నోటినించి మాట రాకుండానే జరి పిస్తోంది కోడలు—తనకొడుకుపెళ్లాం—కృష్ణ తల్లి తను శంకరంగారి భార్య కాదు.

వంట అయిపోయింది

“అత్తయ్యా నువ్వు తినెయ్”—అంది ప్రియ.

“వాడు రాందేటే?”

“ఆయన ఏ తొమ్మిదింటికో, పదింటికో వస్తారు స్నేహితుల ఇళ్ళుచుట్టి పగలల్లా భోజనమే లేదాయె నీకు నువ్వు తినెయ్—నేనుంటాను”

“అబ్బె—”

“అబ్బెలేదు గిబ్బెలేదు నీవు తినకపోతే ఆయ వొచ్చి నామీద విరుచుకుపడతారు ఓ గంటాలస్య మైతే నేనూ చేసేస్తాను లేకపోతే నానా తిట్లూ తిడతారు ఉపొసల్లాగే కాసుకుకూర్చుంటే నన్ను తిట్టి అలిగి, అసలు తినడమే మానేశారు ఊ కానిచ్చెయ్—” తొందర పెట్టింది.

విధిలేక భోజనానికి కూర్చుంది కమలమ్మ గారు

మళ్ళీ యింటివిషయమే గుర్తుకు వచ్చిం దామెకు రాత్రి ఎంత పొద్దుపోయినా భర్తకోసం వేచివుండాలి తను ఒక తరంలో ఎంత అంతరం!

భోజనం అయ్యేటప్పటికి మంచంమీద మెత్తటి పరుపు పరిచి, మల్లెపువ్వులాంటి దుప్పటివేసి పడక సిద్ధం చేసింది కోడలు

తమ ఊళ్లో అందరి పక్కలూ తనే సిద్ధం చెయ్యాలి ఆయ నొచ్చేటప్పటికి ఏ పదకొండో పన్నెండో అవుతుంది. అప్పు డాయనకి వడ్డించి తను తినేటప్పటికి అలసిన తనకి కటికినేలే చాలని పిస్తుంది పడుకునేటందుకు

మంచంమీద పడుకుందేగాని, నిద్ర రావడం లేదు ప్రియ తనని వంటింట్లోంచి బలవంతంగా నెట్టేసింది పైపని చెయ్యనివ్వకుండా

కోడల్ని, కొడుకుని చూస్తుంటే తనకి కడుపు నిండిపోతోంది సంతోషంతో ఆకలే కావడంలేదు—

చిలకా గోరింకల్లా అన్యోన్యంగా ఉన్నారు.

ఎంత మేనగోడలైనా తా నత్తగారు కావడంతో కొంచెం భయపడింది—ఏమంటే ఏమొస్తుందో నని వెర్రిపిల్ల తనని పని ముట్టుకో నివ్వడంలేదు.

పాలిచ్చిన్న కాపురంలో తనూ భర్తా పాతిక నిమ్మ,

కలు వాళ్ళతోఉండలేదు. ఆయన వ్యవసాయమేమిటో, వ్యవహారమేమిటో—ఆర్జనేమిటో అంతే—ఇంక ఏమీ అక్కర్లేదు. తన ఉనికినే ఆయన గుర్తించడు. పిల్లల కింత సంపాదించి పడెయ్యాలి. అదే ఆవే దన—అంతా యాంత్రికంగా ఉంటుంది తనకీనాటికీ భర్తతో కాస్త చనువుగా ఉండడమంటే భయమే. సిగ్గే, అలవాటులేని కారణంగా అస లామాటకొస్తే ఆయనతో మాట్లాడడానికి తనకి తీరుబడే ఉండదు. తనకి తీరుబడి అయినప్పు డాయనకి పని—పెళ్ళ యిన కొత్తలో సిగ్గు, భయం, పెద్దల ఉనికీ అడ్డం వచ్చేవి. కలివిడిగా ఉండడానికి—ఆయనదీ బిడియ పడే తత్వమే—ఇంతలోకే పిల్లలు—పిల్లలు కలగ గానే తనకిక వాళ్ళతోనే సరిపోయేది— భర్త దగ్గర మొదట్లోఉండే భయమే, సిగ్గే, ఈనాటికీ నిల్చి పోయాయి.

నాలుగు రోజుల తరవాత—

పొద్దున్న వంటింట్లో మసులుతుండగా అడ్డంగా ఉన్న కత్తిపీట పొరపాటున తొక్కి వేలు కోసుకుంది కమలమ్మగారు కొంచెం లోతుగానే అయింది గాయం. రక్తం ధారగా వచ్చి, "అబ్బ" అంది చతికిలబడిపోయి.

"ఏమిటత్తయ్యా" అంటూ వచ్చిన ప్రియం వద హడలిపోయి, "ఏమండీ—మిమ్మల్నే—ఇల్లా రండి" కంగారుగా పిల్చింది కృష్ణని.

గబగబ వచ్చిన కృష్ణ గుడ్డ చించి పౌడర్ అద్ది కట్టుకట్టి "ఎల్లా తెగింది?" అని అడిగాడు.

"కత్తిపీట తొక్కాను" అంది కమలమ్మగారు.

"ప్రియా! నీకు బుద్ధిలేదు. అడ్డదిడ్డంగా కత్తులూ, కత్తిపీటలూ పడెయ్యొద్దని నీ కెన్ని సార్లు చెప్పాను?" కోపంగా అన్నాడు.

"దాని తప్పేం లేదురా—నేనే పెట్టాను."

"నువ్వు పెడితే తను తియ్యొచ్చుగా." ఇంకా కోపంగానే అన్నాడు.

"ఒరేయ్! నీకు మరీ మతి పోతోంది. ఇంక నోరు మూసుకో—దాన్నంటే నామీ దొట్టే"

రెండు మూడు గుడ్డలుకట్టినా రక్తం కారు తూనే వుంది.

కృష్ణవెళ్ళి డాక్టర్ని తీసుకువచ్చి, బాండేజి కట్టించి టి. టి. ఎస్. యిప్పించాడు, కమలమ్మగా రెంత అడ్డు పెట్టినా వినకుండా. అప్పటికిగాని అతనికి తృప్తి కలగలేదు.

"అనవసరంగా నిన్ను తిట్టాడు." అనునయిం చింది కమలమ్మగారు కోడల్ని.

"నాదే తప్పులే అత్తయ్యా ఇదివరకు ఆయినా యిల్లాగే తెగ్గోసుకున్నా రోసారి. అప్పుడు చెప్పారు. మళ్ళీ మతిమరుపే అయింది" అంది నొచ్చుకుంటూ ప్రియంవద.

కమలమ్మగారి మనస్సు మళ్ళీ గతంలోకి వెళ్ళింది. తను యింట్లో ఒకసారి కాఫీలోఉన్న కంచు గ్లాసు జారి కాలి బొటనవేలుమీదపడి వేలు చిట్లింది. కాఫీ ఒలికి పోయింది. "ఒళ్ళూ పై తెలీకుండా నడుస్తుంటే గ్లాసు జారకేం చేస్తుంది—గ్లాసుడు కాఫీ నేలపాలయింది. ఆ చితికినవేలుకి కాస్త తుంపి పసరు, పసుపు పట్టించు. అదే పోతుంది" అన్నాడు భర్త—కాఫీపాటి చెయ్యలేదు తన కాలివేలు—ఇక్కడ ఎంతో ఆదుర్దాపడిపోయి రాద్ధాంతం చేశారు కొడుకూ కోడలూ,

# అంతరం

సాయంకాలం సినిమాకి బయల్దేరదీశారు కమ లమ్మగార్ని కృష్ణ, ప్రియంవద. ఇంగ్లీషు సినిమా కట! "నాకేం అర్థం అవుతుందిరా" అంది కమలమ్మగారు. "అయ్యో పిచ్చి తల్లీ—ఆ చూసే వాళ్ళంతా అర్థం అయే చూస్తున్నా రంటావా?—చూడడానికి ఏదో బాగుంటుందనిగాని" అన్నాడు కృష్ణ నవ్వుతూ థియేటర్లో ఉన్నవాటిలో పెద్దతరగతికి తీసుకువెళ్ళి సోఫాలో కూర్చోపెట్టాడు. భాష తెలి యక పోయినా భావం అర్థం అవుతూనే ఉంది పక్కనే కృష్ణ ఉండి అన్నీ విప్పి చెప్పడంచేత. ఎంతో అద్భుతంగా ఉంది సినిమా.

తను భర్తతో ఎప్పుడూ సినిమాకి వెళ్ళలేదు. ఏడాది, కోసారి బతిమాలితే యితర ఆడవాళ్ళతో వెళ్ళనిచ్చేవాడు పక్కఊళ్ళోఉన్న డేరా హాలులోకి వాళ్ళతోపాటే బెంచిలో కూర్చునేది తను. ఏ డొక్కు సినిమాయో చూసొచ్చి అదే బాగుందనుకునేవారు.

"అమ్మా! నేనూ ఈత కొడతానే" పదకొండేళ్ళ కుర్రాడు తల్లిదగ్గర మారాం చేస్తున్నాడు.

"వద్దు బాబు! మునిగిపోతావ్"

"మరి నాన్న ఈదుతున్నాడుగా."

"ఆయనకేం! భీమా చేయించు కున్నారు" అనేసి ఆమె నాలుక కరుచుకుంది.

వి. వి. తాతారావు (గుడివాడ)

మరోరోజు సాయంత్రం—

"కృష్ణా, కృష్ణా" కొటునించి పిలుపు వినిపిం చింది.

"ఎవరో చూడు—" కమలమ్మగారు కోడల్ని పురమాయించింది."

"రాహువు, కేతువు—" అంది ప్రియంవద నవ్వుతూ లేచి.

"అదేమిటే—"

"ఆయన స్నేహితులు—మూర్తిగారు శర్మ గారూను. వాళ్ళంటే ప్రపంచం అక్కర్లేదు మీ కొడుక్కి— అంటూ వీధిలోకి వెళ్ళింది.

"అల్లా బజారు కెళ్ళారు. ఇప్పుడే వస్తారు కూర్చోండి."

"మళ్ళీ వస్తామమ్మా—"

"లేదు—వచ్చేస్తుంటారు. ఈలోగా అత్తయ్యని పలకరిద్దురుగాని" ఆహ్వానించింది—

ఇద్దరూ లోపలకు వచ్చారు.

"అత్తయ్యా—వీరు శర్మగారు, వీరు మూర్తి గారు—ఆయనతోపాటే కాలేజీలో లెక్చరర్లుగా ఉంటున్నారు." పరిచయం చేసింది.

ఇద్దరూ వినయంగా నమస్కరించా రామెకు.

కమలమ్మగారు ప్రతినమస్కారం చేయ బోగా వారించారు—"మీ కృష్ణలాంటివాళ్ళమే మేమూ. మీరు ఆశీర్వదించాలి మమ్మల్ని—" అంటూ.

కమలమ్మగారి కళ్ళు చమరించాయి.

"వారం రోజులుగా వద్దామనే అనుకుంటున్నాం—వాడూ చంపుతున్నాడు రమ్మని—ఇవాళ పడింది"

"బాబూ వాడుత్త కుర్రనాగమ్మ—ఏమీ తెలీదు—పరాయిఊళ్ళో మీరే వాడికి అన్నదమ్ములు—ఆప్తులు. కొంచెం జాగ్రత్తగా చూస్తుండండేం?—" అమాయకంగాను, మనస్ఫూర్తిగాను అంది కమలమ్మ గారు.

ప్రియంవద నవ్వు ఆపుకుంది కష్టంమీద.

"వాడిని మేం జాగ్రత్తగా చూడడమేమిటమ్మా—మీ కింకా అడ్డాల్లో బిడ్డడిలా కనబడుతున్నాడు గాని మాకే సలహా కావలసినా వాడిదగ్గరకే వస్తుంటాం. వాడిని కన్న మీరు నిజంగా అదృష్టవంతులు" అన్నాడు శర్మ.

కమలమ్మగారిముఖంలో సంతోషం గర్వం—కని పించాయి.

ఇంతలోకే కృష్ణ తిరిగి వచ్చాడు.

"హల్లో— మీ రిక్కడే ఉన్నారూ—మీ యిళ్ళ కెళ్ళడం—లేరనిపించుకోవడం అయింది. అమ్మా వీళ్ళ—"తల్లికి పరిచయంచెయ్యబోతుంటే—

"అయింది పరిచయం—" అంది ప్రియంవద.

"కానీను. నువ్వున్నావుగా—అమాటే మర్చి పోయాను. అమ్మా—వీళ్ళ నాగురించి లేనిపోని వేమైనా చెప్తుంటే నమ్మకు. నేనంటే ఎవ్వరికీ కిట్టదు" నవ్వేశాడు.

"మూర్తిగారు—మీరుమాత్రం మా అత్త య్యకి ఆయన సిగ—" ప్రియ ఏదో చెప్పబోగా "ప్రియా" కోపం, అధికారం, వేడికోలూ మిళితం చేసిన స్వరంతో కృష్ణ చెప్పవద్దని సైగచేసి వారిం చగా—అక్కడితో ఆపేసి నవ్వేసింది ప్రియంవద.

"సిగ ఏమిటే—"కమలమ్మగారు అడిగింది.

"ఏంలేదమ్మా—"సిగపూలు" అని నే నో కథ రాసి పంపాను. అది ఆరు పత్రికలకి వెళ్ళి తిరిగి వచ్చింది. నన్నేడిపించడానికి వీళ్ళంతా కలిసి అది వీళ్ళ నవ్వు దల్లా వాడుతూంటారు." పెద్ద వ్యాఖ్యానం చెప్పి 'అయిందా నీ పని' అన్నట్టు ప్రియంవదకేసి చూశాడు కృష్ణ.

"ఇల్లాగే నా నోరు మూసేస్తున్నారు. అంతేకే మూర్తిగారూ మిమ్మల్ని—"

ప్రియంవద మాట మధ్యలోనే ఉండగా తనందు కుని,

"అమ్మా! మేంబటు వెళ్తొస్తాం. నువ్వూ ప్రియా భోంచేసెయ్యండి. నాకోసం కూర్చోవద్దు—పదం డోయ్—" అన్నాడు.

ముగ్గురూ బయలుదేరారు.

"ఫ్రెండ్స్ ఉంటే ఇంకెవరూ అక్కర్లేదని నే రూరికే అన్నానూ—చూశావా యిన్నాళ్ళయిందా—

ఒక్క సాయంకాలం యింట్లో ఉన్నారా?—మంచి రోజు చూసి వాళ్లతోనే చెప్పేస్తాను—అయ్యో ఈ పద్ధతి బాగు లేదని", నవ్వుతూ అంది ప్రియంవద.

"ఏం మాటలేఅవి?—వాళ్లెంత మంచివాళ్లే—అబ్బాయంటే వాళ్లకెంత యిదే?—నీ వెర్రిగాని మొగాడయింతరవాత గుడిపాములా యింట్లో కూచుంటాట్టే—వాడి కేం తోస్తుంది?" కొడుకునీ, మిత్రుల్నీ వెనకేసుకొచ్చింది కమలమ్మగారు. తన కొడుకుని మెచ్చుకోడం, తనకి గౌరవం యివ్వడం ఆమె కెంతో సంతోషం చేకూర్చడంతో వాళ్ళ కృష్ణని ప్రియంవదకు దూరంచేస్తున్న భావం ఆమెకు తట్టలేదు.

తనని అందలంమీద కూర్చోపెట్టే కృష్ణని బట్టి, ఇతరులుకూడా భక్తివినయాలు ప్రదర్శిస్తున్నారు తనపట్ల. తమ ఊళ్లో తను శంకరంగారి భార్య చుట్టాల మధ్య శంకరం పెళ్లాం తన కొక వ్యక్తిత్వం లేదు — ఘనత లేదు పల్లెటూరు కావడంవల్ల తను శుభకార్యాలలో తప్ప యిల్లు కదలదు. తనకు వేరే పరిచయస్థులంటూ ఎవరూ లేరు.

ఇక్కడ కృష్ణ అంతస్థు ఎంత పెరిగితే అంతకు పదింతలు తన అంతస్థు పెరుగుతుంది. "అంతటి కృష్ణను కన్న తల్లిగా—పుణ్యశాలినిగా"—కొడుకు ఘనతకంతకీ కారణం తన గర్భాన జన్మించడంగానే ఎంచడంతో తనకో ఉన్నత స్థానం లభ్యమైంది.

మర్నాడు మధ్యాహ్నం కృష్ణ తల్లినీ, ప్రియంవదనీ కాలేజీ చూపిస్తానని తీసుకెళ్లాడు. ప్రతిచోటా, "మా అమ్మ!" అని కృష్ణ పెద్ద పెద్దలందరికీ గర్వంగా పరిచయంచేస్తుంటే వాళ్లంతా గౌరవపురస్సరంగా నమస్కరిస్తుంటే తన జన్మతరించిందనుకుంది కమలమ్మగారు.

తన లాబరేటరీకి తీసుకువెళ్లాడు కృష్ణ.

"అమ్మా ఈ కుక్కబొమ్మ ఉంది చూడూ! యిది దగ్గిరకెడితే బొంయ్ మంటుంది. మన రేడియోలు లేవూ—అటువంటి సూత్రంమీదే ఆధారపడివుంది దీనితత్వం—"

"అమ్మా యిదింకా చిత్రం—యీ తెరలోకి చూడు ఏం కనిపిస్తోంది—"

"అంతా చీకటే—"

"ఇంకొక్క అడుగు ముందుకెయ్—"

అడుగు ముందుకేసి 'బాబోయ్' అంది కమలమ్మ గారు లోపల లైటు వెలిగి మనిషి పుర్రె కనబడడంతో—

"కింద చూడమ్మా—ఒక లైట్ పెట్టాం—ఆ వెలుతురు యీ ఖల్బుమీదపడినంతసేపూ లోపల చీకటే—కాని నీకాలు అడ్డంరాగానే వెలుతురుకి అడ్డంవచ్చి లోపల దీపం వెలుగుతుంది దానంతట అదే— సినిమాలో మాటల్ని ఈ సూత్రంతోనే పిక్చర్‌మీద కెక్కిస్తున్నారు—"

నోటితో అక్కు యిస్తే తిరిగే ఫేన్—వాటి సూత్రాలన్నీ సాధ్యమైనంత సులభశైలిలో తల్లికి విశదంచెయ్యబోతే అతని వెర్రితనానికి నవ్వుకుందామె—ఇన్ని వింతలూ తన కొడుకు తయారు చేసినవేనా అని ఆశ్చర్యపోయింది.

ఆఖరి అంశంగా టేప్ రికార్డర్ దగ్గిరకు తీసుకువెళ్లాడు. కమలమ్మగారిని ఏదేనా పాడమన్నాడు. తనకు సిగ్గువేసింది. అంతమంది ఎదుట పాడడానికి—అందరూ ప్రోత్సహించి, బలవంతపెట్టారు. తను పాడింది వెంటనే తిరిగి వినిపించాడు. ఆ పాటలోని మాధుర్యానికి అంతా ముగ్ధులయ్యారు.

చిన్నప్పుడు తనకి సంగీతం చెప్పించారు. తన కంఠాన్నంతా మెచ్చుకునేవారు. కాపురానికి వచ్చిం తరువాత సాధన చేసుకోవడమే పడలేదు. ఎప్పుడేనా మొదలుపెడితే భర్త చిరాకుపడేవాడు. అంచేతే సంగీతానికి స్వస్తి జరిగింది.

ఇన్నాళ్ల కీనాడు మళ్లీ పాడే అవకాశం కల్పించాడు కొడుకు. తను ఎల్లా పాడినా మెచ్చుకున్నారు. ఎంత ఆనందం కలిగింది!

"మీ అమ్మగారింత గొప్పగా పాడగలరని ఎప్పుడూ చెప్పలేదేరా?— నువంత బాగా పాడగలగడం వంశపారంపర్యం అన్నమాట! శర్మా, మూర్తీ అడుగుతూంటే—కృష్ణ మతిపోయి చూస్తుంటే—ప్రియంవద ఆశ్చర్యంతో మునిగిపోతూంటే—ఆ సంతోషం పట్టలేక తనకి మూర్ఛవస్తుందనిపించింది.

స్టూడెంట్స్‌వచ్చి పాఠాలు చెప్పించుకుని కృష్ణను తెగ పొగుడుతూ గౌరవిస్తుంటే ఆ గౌరవమంతా తనకే జరిగినట్లనిపించేది కమలమ్మగారికి

నెల తిరక్కుండానే భర్తదగ్గిర్నించి ఉత్తరం వచ్చింది—

సత్యం, శివం వండలేక నానాఅవస్థ పడుతున్నారవీ—తనకి తిండి వంటబట్టటం లేదనీను

ఈమాత్రం ఆనందం అనుభవించడంకూడా ఆయన సహించలేడా అని కోపమే వచ్చింది కమలమ్మగారికి. కాని మర్యాదగా ఉండదని కొడుకుతో—"ఎల్లుండిమంచిరోజే—నన్నుపంపించెయ్యరా రాజా—" అందేకాని నిజంగా పంపిచేస్తాడేమోనని బెరుకుగానే ఉందామెకు.

కాని కృష్ణ అన్నాడు—"నాన్నదంతా చిత్రం మరీను. ఇంక రెండునెల్లదాకా పంపనని రాస్తాను. రాకరాక వచ్చావు అప్పుడే వెళ్ళడం ఏమిటే?"

"సత్యం, శివం నాలుగురోజుల వంటకే అలిసిపోయారా?—పోనీ వెంకమ్మగార్ని పిలవలేకపోయారా? ఏళ్ళకి ఏళ్ళు నువ్వు వండిపెడితే తిని కూర్చోడం అలవాటయి—ఏమైనా రెణ్ణెల్లదాకా నువ్వు వెళ్ళడానికి వీల్లేదు" అంది ప్రియ కూడా.

"అల్లా అంటే ఎల్లాగర్రా" అంది కమలమ్మగారు ఆంతర్యం మరోలా ఉన్నా.

మరోరోజు రాత్రి తొమ్మిదిన్నరవుతుంది— కమలమ్మగారికి నిద్రపట్టలేదు. మేలుకునే మంచం మీద పరుంది.

"ప్రియా! ప్రియా—" వీధిలోంచి పిలుపు.

"వస్తున్నా—" ప్రియ వెళ్లి తలుపు తీసింది. కృష్ణ వచ్చాడు.

"ఇల్లు కనబడిందా మీకు?"

"దారి మర్చిపోయాను "

"అవును మరి. ఆ మూర్తిగారూ, శర్మగారూ దొరికారు మా ప్రాణాలకి. మీరు దారీ మర్చిపోతారు. దారనీ మర్చిపోతారు—"

"హాయ్‌హాయ్ — పిల్లా కవిత్వం వచ్చేస్తోంది నీకూను."

"మీ అర్ధాంగినిగా. అయినా బొత్తిగా మంచి చెడ్డా లేకుండా పోతోంది—ఎప్పుడూ పదింటికేనా యిల్లు చేరేది—రోజూ అత్తయ్య మీకోసం కాచుకుని కూర్చోడం, నేను బలవంతపెట్టడం వినుక్కుంటూ ఆవిడ తినడం—"

"మరి నువ్వు?"

"నేను చెయ్యలే దివాళ."

"అమ్మ పడుకుందా?"

"ఆ— పాపం తనచేత్తో మీకు వడ్డించాలని ఉబలాటం ఆమెకి. మీకేమో ఊళ్లేలడమే సరిపాయె—ఆవిడ ఉన్నన్నాళ్లయినా కాస్త పెందరాళే దయచెయ్యకూడదూ?"

"నిజమేస్మీ — నాకామాటే గుర్తులేదు. రేపట్నించి కాలేజీ అవగానే యింటికే వచ్చేస్తుంటాను నేరుగా."

"ఏమిటే—మీరే మాట్లాడుతూంట! ఒక్కసారి హరిశ్చంద్రుడే అయిపోతారేమిటి కొంపదీసి.

"అంటే—" సాగదీశాడు

"ఈమాట అనడం ఇప్పటి కెన్నోసారి అని."

"నాకు బుద్ధిలేక నిన్ను కట్టుకున్నాను. మాటలు నేర్చిన కుక్క యిస్కోమంటే యిస్కో మందనీ—ఇదేనా భారతనారి ఆదర్శం?"

"తమరు శ్రీరాముడతంటి పూజ్యులవి—నేను సీతాదేవిని కాలేకపోయానా?"

"ఇల్లాగే వాగుతూండు. ఎక్కడికో పారిపోతాను, ఎప్పుడో అప్పుడు "

"ఉద్ధరిస్తారు! కాని ఎడ్రస్ మాత్రం చెప్పిపొండేం—నేనూ వస్తాను మీ వెనకాలే—"

"స్వర్గానికెళ్లినా సవితిపోరు తప్పదనీ—నువ్వెందుకూ సైనాతి"

"లేకపోతే మిమ్మల్నిలా వేపించుకుతినేవా ళ్ళుండద్దూ—నిజం చెప్పండి—నేనిల్లా కాకుండా మూంగిలా పడుండి అన్నింటికీ తలవంచితే మీ కానందంగా ఉంటుందా?"

"అమ్మ బాబోయ్! అల్లా మాత్రం చెయ్యకు. అసలు యింటికే రాబుద్ధిపుట్టదు."

"వరే సంతోషించాంగాని, పదండి అన్నం వడ్డిస్తాను."

"పద. కాని ఒక్క షరతు. నువ్వు నా నోటికి అందిస్తూండు. నేను నీకు అందిస్తాను."

"బావుంది సరసం! ఇంక నాకేం పనిలేదు"

"అయితే నేను అసలు తినను"

"చెవులు మెలేస్తాను—వేషాలేస్తున్నారు—వేషాలని—"

కృష్ణ పలకలేదు

"సరే స్వామీ పదండి—మంకుపట్టులో చంటిపిల్లల్నే మరపించగలరు మీరు."

కంచంముందు కూర్చున్నారిద్దరూ—

ప్రియ కృష్ణనోటికి ముద్ద అందించింది.

పొరపాటున వేలు కొరికాడు కృష్ణ.

"అబ్బ—ఛీ—ఇందుకే నేను భయపడ్డది" కళ్లల్లో నీళ్ళు తిరిగా యామెకు.

"అరెరె—అయామ్ సారీ—"

"సారీలేదు లారీ లేదు. లెంపకాయకొట్టి క్షమించమన్నాట్ట వెనకటి కొడు" వేలు నొక్కుకుంటూ అంది

"ఏదీ బాగా నెప్పెట్టిందా?—" ఆమె వేలు తన చేతిలోకి తీసుకుని నిమిరాడు—"క్షమించు" అన్నాడు మళ్లీ బాధగా.

"పెద్ద—మళ్లీ ఈ నటనొకటి—కావాలని కొరికి" అతన్ని కావాలని రెచ్చగొడుతూ అంది.

"అసలు ముక్కూడేలా కొరకవలసింది. అప్పుడు బుద్ధిగా ఉండేదానివి పొరపాటంటే నమ్మదు — పిదు."

"అంతపని మీకు చాతకాదనీ—"

నిద్రపట్టక ఈమాటలు వింటున్న కమలమ్మగారికి వారి చిలిపితనం నవ్వు తెప్పించింది—

తనకీ భర్తకీ మధ్య యిటువంటి సంఘటన ఒక్కటుందా? అంత అదృష్టానికి తను నోచుకోందే—ప్రియంవద పూర్వజన్మ సుకృతం అది

ఏమిటి—కోడల్ని చూసి తానసూయపడుతోందా? ఛీ—ఛీ—అది అసూయకాదు. తన కొడుకు, భర్తద్వారా తాను పొందలేని ఆనందాన్ని కనీసం తనభార్య కివ్వంటే—తాను తన కొడుకు కావడంలోని విశిష్టత తనకు తెలియని ఆనందాన్ని అందిస్తోంది.

మరోరోజు—తన కాలక్షేపానికి కృష్ణ కొనిచ్చిన రామాయణంలో సీతాకల్యాణం ముగిసిన తరువాతిఘట్టం తీసింది—అదివరలో అప్పటి వరకు అయింది.

కల్యాణానంతరం సీతను తీసుకుని అయోధ్యకు తరలుతున్నారు రథాలమీద—

శ్రీరామచంద్రుడు అహల్యకు వాగ్దానం చేశాడు. తిరిగి వచ్చేటప్పుడు దర్శనం యిస్తానని. ఆమాట నిలబెట్టుకోవాలంటే రథాలని గౌతమాశ్రమం మీదుగా తరలించాలి. అలా దశరథుణ్ణి అడిగేందుకు ధైర్యంలేదు రాముడికి. ఘనమైన పనులైతే చేశాడుగాని, పదునారేళ్ల పసివాడు. తండ్రిచాటు బిడ్డడు—తండ్రంటే ఎంత గౌరవమో అంతకు రెట్టింపు భయం—తండ్రితో ఎదురుగా మాట్లాడలేడు.

అంచేతకౌసల్యనుపమిపించి తండ్రికిచెప్పమన్నాడు.

ఆమెకు ఏడుపు వచ్చింది—ప్రతిభావంతుడైన

# అంతరం

రాముడి తల్లిమాత్రమే తను. దశరథుడికి తన మీద ఏమైనా గౌరవముంటే అది రామునివల్ల కలిగినదే—అటువంటి తనను, తనకు ఉన్నతి కల్పించిన కొడుకు తానై చెప్పలేనిది తనను చెప్పమంటున్నాడు—"తండ్రీ—నీ తండ్రికి నీకంటె నే నెక్కువా?—నువ్వే చెప్పు" అంది కన్నీళ్ళతో—

శ్రీరామచంద్రుడికి పరిస్థితి అర్థమై—దుఃఖం పొంగింది—

అది చూసి కౌసల్య "అయ్యో—ఎంత పొరపాటైంది-చిట్టితండ్రిని అనవసరంగా నొప్పించాను" అనుకుని "పిచ్చితండ్రీ—బాధపడకు నేనే చెప్తానులే—" అంది.

కమలమ్మగారికి కన్నీరు కాల్వలు కట్టింది తన స్థితీ, కౌసల్య పరిస్థితీ ఒక్కలాగే ఉంది—

తనకీ ఒక వ్యక్తిత్వం ఉందనీ, తన జీవితానికీ ఒక విలువ ఉందనీ, తన కిక్కడికి వచ్చిం తరువాతే తెలిసింది కొడుకు దగ్గరుంటే తన కెంత గౌరవం

---

"దీని వెనకవైపు సంతకం చేసి ఇవ్వండి" వరదయ్యకు చెక్కు తిరిగిస్తూ బ్యాంకు గుమాస్తా చెప్పాడు. వరదయ్య దాన్ని తీసుకుని వెనకవైపున "విధేయుడు! ఇట్లు వరదయ్య" అని రాసి గుమాస్తాకు ఇచ్చాడు.

ఒ. వి. విద్యాధరరావు (విజయవాడ)

---

—ఆనందం—తనొచ్చిన యిన్ని రోజులలోను కనీసం వాడొచ్చి ఒక గంట తనతో మాట్లాడుతూ గడపలేదు—కాని తనకు అదేం బాధనిపించదు—కుర్రాడు వాడి యీడువాళ్లతో వాడికి తోస్తుందిగాని, తనతో గంటలతరబడి ఏం మాట్లాడగలడు?—

కృష్ణ రెండునెల్లదాకా తల్లిని పంపడానికి వీలుండదని రాశాడుగాని—అదేం పడలేదు. తండ్రి తన తండ్రే—నెలన్నా నిండకుండానే తనకి ఆరోగ్యం బాగులేదనీ, కమలమ్మగార్ని పంపెయ్యమనీ రాశాడు.

ఈమాటు వెళ్లక తప్పదు ఈ ఊహ ఆమెను నిలువెల్లా కంపింపజేసింది—

ఈ స్వర్గంనించి మళ్లీ ఆ నరకంలోకి వెళ్లాలి. లంకంత కొంపలో తా నొక్కతే—తెల్లారకుండా లేవాలి. మళ్లీ పడుకోవడం అర్థరాత్రికే—నడుం విరిగే చాకిరీ—ఆదరణా, అప్యాయతా ఎరగని వాతావరణం—తన శ్రమకి కృతజ్ఞతకూడా కనపరచని మనుష్యులు. తను లేనప్పుడుతప్ప తన ఉనికినే గ్రహించని భర్త—తమ పాఠాలూ, ఆటలూ తప్పించి, మిగతావి అర్థంచేసుకునే యీడులేని యింకో యిద్దరు కొడుకులు. వారిమధ్య మళ్లీ ఆ పాతజీవితం ఆరంభించాలి

"నేను వెళ్ళి నాన్నని కూడా తీసుకు వచ్చేస్తా నమ్మా—నువ్విక్కడే ఉండు. ఆయనే వస్తాడు" అన్నాడు కృష్ణ.

"అవునత్తయ్యా! సత్యం, శివం వాళ్ళ మ్మాయిన్ని ఊళ్లో హొటల్లో తింటూంటారు. చంటిపిల్లలేం కాదుగా—" వంతపాడింది ప్రియంవద.

"పిల్లేదే—ఎప్పుడూ వదలని యిల్లు—నే లేందే గడవదు తప్పదు, వెళ్ళిపోతాను" అందికమలమ్మగారు.

సాయంకాలం బజారుకి తీసుకువెళ్ళి తల్లికి రెండు పట్టు చీరలు, తండ్రికో పంచల చాపూ, తమ్ముళ్లకి ఒట్టలు కొనిచ్చాడు కృష్ణ

మొన్నాడు చామర్లకోట మెయిల్ ఎక్కించడానికివెళ్లారుకృష్ణ,ప్రియంవదా,కమలమ్మగారితో—

ఇల్లు కదిలింది మొదలు కమలమ్మగారు అశ్రుధారలు స్రవిస్తూనే ఉంది ఎంత తెంచుకుందామన్నా శక్యం కాలేదు—

"ఇన్నాళ్ళున్నా నీ దగ్గర కాస్సేపే నా మంచీ చెడ్డా మాట్లాడలేకపోయినందుకు క్షమించమ్మా—" అన్నాడు కృష్ణ గద్గదికంగా.

"ఛ పిచ్చినాన్నా—అదేమిట్రా అల్లా అంటావ్? నువ్వు నా కళ్లెదుట మసులుతూంటే వేరేమాట లెందుకూ?—అయినా నాతో మాట్లాడడానికి నీకు సంగతు లేముంటాయ్?—" అంటుంటే ఆమెకు దుఃఖం మరోసారి పెల్లుబికింది

"అమ్మా నాన్న నింక వ్యవసాయం కట్టిపెట్టమను నేనూ రాస్తాను ఇప్పటికి ఆర్జించింది చాలు. సత్యాన్నీ, శివాన్నీ తీసుకుని మీ రిద్దరూ వచ్చెయ్యండి. అంతా యిక్కడే పడుందాం—"

"మామయ్యకి నచ్చజెప్పి అంతా వచ్చెయ్యండత్తయ్యా—ఇక్కడ లింగూలిటుకూమంటూ మేమిద్దరం—అక్కడ మీరూ—ఎందుకు రెండు సంసారాలు?—"అంది ప్రియంవద

రైలు కదిలేవేళకు కమలమ్మగారికి కన్నీరు మళ్లీ విజృంభించింది—

"రాజా—ప్రియ చిన్నపిల్ల—దాన్నేం అనకు. కష్టపెట్టకు. తెలిసో తెలియకో తప్పు చేస్తే సద్దుకుపో—పెందరాళే యింటికి వచ్చేస్తూండు. ఒక్కర్తే దానికి ఏం తోచదు. ప్రతి నాలుగు రోజులకీ ఉత్తరం రాస్తూండు. సెలవులకి తప్పకుండా వచ్చెయ్యండి. అమ్మాయ్! నువ్వూ అంతే—నాదేదేనా అంటే పట్టించుకుబాధపడకు—ఆరోగ్యం తిన్నగా చూసుకోండి—" ఏడుపుతో వెక్కుతూ మాట మాటకీ ఆగుతూ అంది కమలమ్మగారు

ప్రియ ఏడ్చేసింది.

"దిగగానే టెలిగ్రాం ఇమ్మనత్తయ్యా—మాకేం తోచదు అది వచ్చేదాకా—నువ్వుత్తరాలు రాస్తూండు. సాధ్యమైనంత త్వరగా వచ్చెయ్యండి అంతా—" అంది

రైలు కదిలి వెళ్లిపోయింది

ఇంటికి వచ్చేదాక ఉగ్గపట్టుకున్న కృష్ణదుఃఖం ఒక్కసారి పొంగింది—

"ఏమిటండీ యిది!—చంటిపిల్లల్లా—వాళ్లని తీసుకొచ్చేద్దాం—వినండి—నా మీ దొట్టే—" అంది ప్రియ సానునయంగా

"కాదు ప్రియా! నీకు తెలీదు—నాన్న రాడు అమ్మని రానివ్వడు అమ్మకి అన లిక్కడనించి వెళ్లడం యిష్టంలేదు" అంటుంటే అతని గొంతు దుఃఖంతో పూడిపోయింది. ★

# భూగర్భంలోనికి సాహసయాత్ర

24వ పేజీ తరువాయి

"అలలు తీరంమీద జారి వస్తే చప్పుడు" అంటాడు మా పెదనాన్న. "ఏదో ద్వీపం ఉండి ఉండాలి."

హాన్స్, తెరచాపకఱ్ఱ ఎక్కి చూసినా భూభాగం కనిపించలేదు. సముద్రం ప్రశాంతంగానే ఉన్నది.

మూడు గంటలు గడిచాయి. అతి దూరంలో ఉన్న జలపాతం నుంచి వస్తున్న శబ్దం వలె ఉన్నది ఆ గర్జన.

ఈ విషయం మా పెదనాన్నతో చెప్తే కాద న్నట్టు తల ఆడిస్తాడు. కాని నేను పొరబడటం లేదని అనుకుంటాను. మేమంతా ఒక మహా జలపాతంలో చిక్కుకుని ఘోరంగా చనిపోబోతున్నామా? అలాగున నిలువుగా 'దిగటం' మా పెదనాన్నకి ఇష్టమేమో గాని నా మట్టుకు ......

ఏదైనా కానీయండి పెద్ద చప్పుడు చేసేది ఏదో కొన్ని మైళ్ళ అవతల ఉన్నది. శబ్దం క్రమంగా అధికం అవుతున్నది. అది సముద్రంలో నుంచా లేక ఆకాశంలో నుంచా ?

పైన తేలుతున్న మబ్బులవంక చూస్తాను. అవి ఎంత దట్టంగా ఉన్నవో అంచనా వేసి చూస్తాను. ఆకాశం ప్రశాంతంగా ఉన్నది. 'గుహ' కప్పు దగ్గరగా ఉన్న మేఘాలు కదలిక లేనట్టు కనిపిస్తున్నాయి. తీవ్రమయిన ఆ వెలుగులో ఇంచు మించు కనిపించకుండా పోతున్నాయి. ఈ వైచిత్ర్యానికి కారణం మరెక్కడయినా ఉండి ఉండాలి.

ఆతర్వాత దిగంతరేఖ పరిశీలించి చూస్తాను. ఎక్కడా పొగమంచు లేకుండా నిర్మలంగా కనిపిస్తున్నది. ఈ శబ్దం ఒక జలపాతంవల్ల ఏర్పడినట్లయితే, సముద్రం నీరు పల్లంలోనికి పడుతున్నట్లయితే మా చుట్టూ నీటి ప్రవాహం కూడా ఏర్పడాలి. కాని ప్రవాహ వేగం అధికమయినట్లు సూచన లేనేలేదు. ఒక ఖాళీసీసా నీటిలోకి విసిరాను. అది నెమ్మదిగా ఎగురుతూ తేలింది తప్ప ఎటూ పోలేదు.

నాలుగు గంటలు అవుతున్నా యనగా హాన్స్ తెరచాప కర్ర పైకి ఎక్కుతాడు. దిగంతరేఖ కలయజూస్తాడు. ఒకచోట దీక్షగా చూసి ఆగిపోయాడు. ముఖ కవళికలు మారవు, కాని కళ్ళు అక్కడే ఉండిపోతాయి

"ఏదో చూశాడు" అన్నాడు మా పెదనాన్న.

"అలాగే ఉంది"

హాన్స్ దిగి వచ్చేస్తాడు దక్షిణంవైపు చెయ్యి జాపి అంటాడు :

"డెర్‌నెర్ !"

"అక్కడా ?" అంటాడు మా పెదనాన్న

దూరదర్శిని తీసుకుని ఒక క్షణం అటువైపు జాగ్రత్తగా పరిశీలిస్తాడు క్షణం ఒక శతాబ్దం వలె ఉన్నది

"అవునవును !" అని అరుస్తాడు.

"ఏమిటి కనిపిస్తోంది ?"

"ఒక పెద్ద ఊట సముద్రంలోనుంచి పైకి ధారగా లేస్తోంది"

"మరొక సముద్ర మృగమా ?"

"అయివుండవచ్చు."

"అలాగయితే పడమర వైపు పోదాంరండి ఇవి ఎంతప్రమాదకరమైనవన్నుగాలో మీకుతెలుసుకదా!"

"ఇటే వెడదాం" అని జవాబు యిస్తాడు మా పెదనాన్న.

హాన్స్ వైపు తిరుగుతాను. హాన్స్ ఆజ్ఞ ప్రకారమే చుక్కాని త్రిప్పి పట్టుకున్నాడు.

కాని, ముప్పైఆరు మైళ్ళ దూరంలో ఉన్న ఊట కనిపించినదంటే ఆ జంతువు చాలా పెద్దది అయి ఉండాలి. దానిని తప్పించుకు వెళ్ళడం శ్రేయస్కరం. కాని మా శ్రేయస్సు కోసం ఇంత దూరం రాలేదు.

అందుకని ముందుకి సాగిపోయాము. దగ్గరకు వెళ్లినకొద్దీ ఆ ఊట ఎత్తు అధికం అవుతున్నది. తెరిపిలేకుండా అంత నీటిని పైకి వదలగల జంతువు ఏదయి ఉంటుంది ?

సాయంత్రం ఎనిమిది గంటలకు దానికి ఆరు మైళ్ల లోపు ఉన్నాము. నల్లటి ఆకారం ఒకటి ద్వీపం వలె సముద్రంమీద స్పష్టంగా కనిపిస్తున్నది. నాకంటికి అలా కనిపిస్తున్నదేమో కాని ఆరువేల అడుగుల పైన పొడుగుకలిగి ఉన్నట్లున్నది. అంత దీర్ఘమయిన జంతువు కువియర్స్ (Cuviers), బ్లూమెన్‌బాక్ (Blumen Bach)లు కూడా ఎదురుచూసిఉండరు సుషుప్తిలో ఉన్నట్లు కదలటమే లేదు. సముద్రం దానిని మేల్కొలుపలేకుండా ఉన్నది. అలల అఘాతాల ప్రభావం ఏమీ కనిపించటం లేదు. అయిదు వందల అడుగుల పైకి లేచి పడుతున్న ఆ ఊట, చెవులు చిల్లులు పడేటంత శబ్దం చేస్తున్నది. రోజుకి నూరు తిమింగలాలు మింగగల ఈ ఆకారంవైపు వెళ్లటం మా పిచ్చి!

---

ఎన్నికల్లో పోటీ చేస్తున్న ఇద్దరు అభ్యర్థులు మాటా మాటా అనుకుని కొట్లాటకు దిగారు. స్నేహితులు వారిని విడిపించి దూరంగా తీసుకువెడుతున్నారు. మళ్ళీ కొట్టుకునేందుకు అభ్యర్థులిద్దరూ ముందుకు ఉరుకుతున్నారు. "నలుగురు వెళ్లి వాణ్ణి పట్టుకోండి! నన్ను ఒక్కడు పట్టుకుంటేచాలు" అన్నాడొక అభ్యర్థి రెండవ వాడి హంగామా చూచి హడలిపోతూ.

బి. రుద్రయ్య (నరసరావుపేట)

---

నాకు భయం పట్టుకున్నది. ఈ మొండితనానికి వెళ్లను ! అవసరమయితే తెరచాప దించివేస్తాను! ఆవేశంతో వాదిస్తాను. కాని ప్రొఫెసర్‌గారు సమాధానం యివ్వరు.

హాన్స్ అకస్మాత్తుగా లేచి మునుపు నన్ను భయపెడుతున్న దానివైపు చెయ్యి జాపుతాడు.

"హొల్మ్ !" అంటాడు.

"ద్వీపం !" అని అరుస్తాడు మా పెదనాన్న.

"ద్వీపమేనా ?" అని ఆయాసపడ్తాను నేను.

"ఆహా, ద్వీపమే నని తెలుస్తూనే ఉంది" అని ప్రొఫెసర్‌గారు గట్టిగా నవ్వుతాడు.

"మరి ఆనీటి ధార ?"

"గేజిర్ (Geyjir—అయిస్‌లాండ్‌లోని హెక్లా పర్వతం వద్ద ఉన్న ఒక నీటి ఊట) ." అంటాడు హాన్స్.

"ఓహో ! గేజిర్ అన్నమాట ! అయిస్‌లాండ్‌లో గేజిర్ వంటిది" అని అతనితో ఏకీభవిస్తాడు మా పెదనాన్న.

పూర్తిగా పొరబడిపోవటం నాకు ఇష్టంలేదు. ద్వీపం జంతువు అనుకోనడమా ! కాని ప్రత్యక్షంగా ఉన్న ఈ సాక్ష్యం ఎలా కాదనను ? ఇది కేవలం ప్రకృతిసిద్ధమయిన ఒక విశేషం.

సమీపించిన కొద్దీ ఈ నీటిధార అద్భుతంగా కనిపిస్తున్నది. నిజం చెప్పాలంటే (నా తరఫున నేను మాట్లాడక తప్పదు), ఈ ద్వీపం పెద్ద తిమింగలం వలెనే ఉన్నది. నీటిమీద 60 అడుగుల ఎత్తుకి లేస్తున్నది. గేజిర్—అయిస్‌లాండిక్‌లో ఈ మాటకు 'జలప్రపాతం' అని అర్థం—ఒక వైపు దాని క్రింది భాగాలలో ప్రేలుడు శబ్దాలు, మేఘాలను అందుకునే నీటిధార; ఈ నీటిధారతో కలిసి ప్రతి నీటి బిందువూ రంగు రంగులుగా మెరిసేట్టు చేసే అక్కడి విద్యుచ్ఛక్తి కాంతి.

"పక్కగా వెడదాం" అంటాడు ప్రొఫెసర్‌గారు.

అయితే నీటి ధారకు మా తెప్ప తిరగబడిపోకుండా జాగ్రత్తగా వెళ్లాలి. హాన్స్ చాలా చాకచక్యంగా మా తెప్పను ద్వీపానికి అవతలవైపు తీసుకుపోతాడు.

నేను ఒక రాతిమీదకు దూకాను. మా పెదనాన్న నన్ను చురుకుగా అనుసరిస్తాడు. కాని, మా వేటగాడు మాత్రం ఈ అద్భుతాలకు చలించని వానివలె చుక్కాని వద్దనే కూర్చుని ఉండి పోతాడు.

మా కాళ్లక్రింద నేలలోపల నీరు ఉబుకుతున్నట్లు అదిరిపోతున్నది. వేడిగా ఉన్నది. గేజిర్ వద్దకు వెళ్లి నీటి ఉష్ణోగ్రతని థర్మామీటర్‌తో పరిశీలిస్తాను. 163 డిగ్రీల సెంటిగ్రేడ్ ఉన్నది.

అంటే ఈ నీరు ఒక కొలిమిలో నుంచి వస్తున్నదన్నమాట. మరి ప్రొఫెసర్ లిడెన్‌బ్రోక్ గారి సిద్ధాంతాలు ఖండించినట్లే అయినది కదా ! ఈ సంగతి ఆయనతో చెప్పకుండా ఉండలేక పోయాను.

"నిజంగా !" అంటాడు. "నా సిద్ధాంతానికి వ్యతిరేక మెలా అవుతోంది ?"

"అవదులే" అంటాను ఉదాసీనంగా, ఈ మొండితనం చూసి.

అయితే ఇంతవరకూ నాకు తెలియని కారణాల

# భూగర్భంలోనికి సాహసయాత్ర

మూలంగా, ప్రమాదం లేకుండా వచ్చామని నా నమ్మకం; ఇంతవరకూ వేడి అంత అధికంగా లేదు కాని ఇకమీద ఒకటి రెండు రోజులలో థర్మామీటర్లు కూడా కొలవలేనంత ఉష్ణం ఉన్న ప్రదేశాలు చేరుకుంటామని నాకు అనిపిస్తున్నది — అనిపించడం ఏమిటి, నిశ్చయంగా తెలుస్తున్నది!

కాని, చూద్దాం; అంటాడు ప్రొఫెసర్‌గారు. ఈ ద్వీపానికి తన తమ్ముడి కొడుకు పేరు పెట్టి ప్రయాణం కొనసాగించాలని ఆజ్ఞ ఇస్తాడు.

గేజిర్‌నే కొంతసేపు చూస్తూ నుంచుని ఉండిపోతాను. నీటి ధార ఎత్తు మాటిమాటికీ మారడం గమనిస్తాను. లోపల ఆవిరి ఒత్తిడి మారటం వల్లనే అనుకుంటాను.

తెరచాప ఎత్తి బయలుదేరుతాము. దక్షిణం వైపుగా తేలి వెళ్ళిపోతాము. మేము ద్వీపంమీద దిగినప్పుడు హాన్స్ తెప్పమీద సామాను సర్దుతాడు.

ద్వీపం వదిలిపోయేముందు మేము ప్రయాణం చేసిన దూరం లెక్కవేసి చూస్తాను. పుస్తకంలో వ్రాసుకుంటాను 'గ్రౌబెన్ నౌకాశ్రయం' వదలిన తర్వాత ఎనిమిది వందల మైళ్ళ దూరం వచ్చాము సరిగ్గా ఇంగ్లాండ్ క్రింద ఉన్నాము—అయిస్‌లాండ్‌కు పద్దెనిమిది వందల ఎనభై నాలుగు మైళ్ళ దూరంలో ఉన్నాము

## 35

శుక్రవారం, ఆగస్టు 21—ఆ అద్భుతమయిన గేజిర్ అదృశ్యం అయిపోయినది గాలి వేగం అధికం అయినదేమో, 'ఆక్సెల్ ద్వీపం' త్వరలో వెనుక వదలి వెళ్ళిపోయాము క్రమంగా గేజిర్ శబ్దం కూడా వినిపించటం మానివేసినది.

ఇక్కడ వాతావరణం—ఆమాట వాడటం సరి అయినట్లయితే—మారిపోయేట్లు ఉన్నది. ఉప్పునీరు ఆవిరిగా మారి గాలినిండా ఆవరించుకొని ఉన్నది. ఈ ఆవిరిలో విద్యుచ్ఛక్తి ప్రసారం అవటంవల్లనేమో 'ఆకాశం' బరువుగా ఉన్నట్లు అనిపిస్తున్నది. మబ్బులు ఒకదానికి ఒకటి దగ్గరగా జరుగుతున్నాయి. లేత ఆకుపచ్చ ఛాయ వచ్చినది. దట్టంగా ఉన్న ఈ మబ్బు తెరలో నుంచి వెలుగు కనిపించటంలేదు. ఈ మబ్బుతెర తుఫాను అనే నాటకం కోసం లేస్తుందనిపిస్తున్నది.

భూమిమీద తక్కిన జంతువుల వలె, నేను ప్రళయం రాబోతున్నదనే ఊహ వచ్చి కలవరపాటు పడ్డాను. దక్షిణం దిక్కున మేఘాలు చూస్తే తుఫాను తప్పదనిపించినది. గాలి బరువెక్కినది. సముద్రం ప్రశాంతంగా ఉన్నది.

దూరాన మబ్బులు హడావుడిగా పేర్చిన దూది పింజలను పోలిఉన్నాయి. కొంచెం, కొంచెంగా పెద్దవయి, పెద్దవయినకొద్దీ సంఖ్య తక్కువయి, చివరకు బరువు అధికం అవటంచేత దిగంతరేఖ మీదకు కూలిపోయి ఇక పైకి లేవగలవా అన్నట్లు ఉన్నాయి. గాలి అఘాతాలకు ఇటూ అటూ ఊగుతూ అన్ని మబ్బులూ కలిసి ఒక భయంకరమైన ఫలకాకారం వహించాయి. అప్పుడప్పుడు తెల్లని పొగమంచు ఉండ ఒకటి ఈ నల్లని తెరల మీదకు దిగి శీఘ్రంగా వాటిలో కలిసిపోతున్నది.

మా చుట్టూ ఉన్న వాయువులూ తేమతో నిండి ఉన్నాయి. నా ఒళ్ళంతా తడిసిపోతున్నది. నా తలమీద జుట్టు విద్యుచ్ఛక్తి ప్రభావానికి లేచి నుంచుంటున్నది. నా సహచరులు ఎవరయినా నన్ను ఈ క్షణం ముట్టుకుంటే గట్టి 'షాక్' (Shock) తినక తప్పదనిపించినది.

పొద్దున పది గంటలకు తుఫాను సూచనలు ఇంకా ఎక్కువ అవుతున్నాయి. ముందు రాబోయే దానికి ఆగి వూపిరి తీసుకుంటున్నదా అన్నట్లు గాలి నిలిచిపోతున్నది. ముందున్న మేఘరాశి తుఫాను కుక్కిన ఒక పెద్ద సంచి వలె ఉన్నది.

ఈ ప్రమాదకరమయిన చిహ్నాలు నమ్మాలని లేదు. కాని "ముందు, ముందు వాతావరణం బాగుండదు!" అని అనకుండా ఉండలేకపోతాను.

ప్రొఫెసర్‌గారు సమాధానం చెప్పడు. బాగా చికాకుగా ఉన్నాడు. ముందు అనంతంగా కనిపిస్తున్న సముద్రం పరీక్ష చేస్తున్నాడు.

"తుఫాను వస్తుంది" అంటాను నేను, దిగంతరేఖవైపు చూపిస్తూ. "ఆ మబ్బులు సముద్రం మీద పడి అణచివేసేట్లున్నాయి!"

మౌనం గాలి సద్దుమణిగిపోయింది. ప్రకృతి నిర్జీవంగా, వూపిరి తియ్యకుండా ఉన్నది. తెరచాప వాలిపోతున్నది మట్టమయిన ఆ సముద్రం మీద తెప్ప కదలిక లేకుండా ఉన్నది. మేము కదలకుండా ఉండి పోయినట్లయితే తెరచాప దించివేయడమే మంచిది కదా? తుఫాను రాగానే దాని మొదటి ఊపుకే మేమందరం సముద్రంలో పడిపోతాము.'

"దాన్ని దించేద్దాం" అంటాను. "తెరచాప స్తంభం కూడా దింపేస్తే మంచిది."

"వీల్లేదు! ఏమిటీ!" అని అరుస్తాడు మా పెదనాన్న. "వంద చెప్పు. వీల్లేదు! గాలి రానీ! తుఫాను మనకు తగలనీ! తీర మేదైనా కనిపిస్తే చాలు! తెప్ప వెయ్యి ముక్కలుగా విరిగినా ఫరవాలేదు"

మాట్లాడటం ముగించాడో లేదో దక్షిణం దిక్కు వాలకం పూర్తిగా మారిపోవటం మొదలు పెడుతున్నది. పొగమంచు నీరయి పోతున్నది. వాయువుల సాంద్రత మారి అవైపు తుపాను గాలి వీస్తున్నది. గుహ మారుమూలల నుంచి వస్తున్నది. చీకటి పడుతున్నది. 'నోట్సు' వ్రాసుకొనటానికే వీలులేకుండా ఉన్నది.

తెప్పపైకి లేస్తున్నది. ముందుకి ఎగురుతున్నది మా పెదనాన్న పడిపోతాడు. ఆయన వద్దకు పాకి వెడతాను. ఒక త్రాటి మొన గట్టిగా పట్టుకుని ప్రకృతిశక్తుల విజృంభణ సంతోషంతో చూస్తున్నాడు

హాన్స్ కదలడు. పొడుగయిన అతని జుట్టు గాలివల్ల ముఖంమీదకు తోసుకువచ్చి క్రొత్తగ కనిపిస్తున్నాడు. ఒక్కొక్క కేశం చివరా మెరుస్తున్న 'కుచ్చులు' కనిపిస్తున్నాయి. ఇక్తియో

హాన్స్, మెగాథీరియంలను తోలుకొస్తున్న అతి ప్రాచీన కాలపు మానవుడిని పోలి ఉన్నాడు.

కనీసం తెరచాప స్తంభం నిలుస్తున్నది. తెరచాప చిరిగిపోవటానికి సిద్ధంగా ఉన్న బుడగ పోలి ఉన్నది. తెరచాప వేగం ఎంత అయిఉంటుందో అంచనా వేయలేక పోతాను కాని, అలలు తగిలి చప్పుడు కాని క్రింద నుంచి పైకి ఎగిరివచ్చే నీటి వేగంకన్నా ఎక్కువలేదు. నీటితుంపరలు మా ముందు తెలుపు స్పష్టమైన ధారలుగా కనిపిస్తున్నాయి.

“తెరచాప ! తెరచాప !” అని అరుస్తాను, అది దింపివేయాలన్నట్లు సంజ్ఞలు చేస్తూ.

“వీల్లేదు !” అంటాడు మా పెదనాన్న.

“నెయ్” అంటాడు హాన్స్, తల అడ్డంగా ఆడిస్తూ.

దిగంతరేఖమీద, అంటే మేము పిచ్చిగా కొట్టుకుపోతున్న వైపున, నాకు గర్జించే జలపాతంగా మారిపోతున్నది. కాని అక్కడకు చేరుకునే ముందే మబ్బుల తెర చీల్చుకుని పోయి సముద్రం ఉడికిపోవటం ప్రారంభిస్తుంది. పైన ఎక్కడో ఏర్పడిన విద్యుచ్ఛక్తి క్రిందకు వచ్చి ఈ గొడవలో కలిసిపోతున్నది. కళ్ళు చెదిరిపోయే మెరుపుల తర్వాత ఉరుము గర్జనలు, ఈ ప్రేలుడుల మధ్య చిందరవందరగా కనిపించే మెరుపుతీగలు, ఉజ్వలంగా ప్రకాశవంత మవుతున్న మేఘరాసులు, మా పడవ పాత్రలమీద వచ్చిపడుతున్న వడగండ్లు కూడా వెలుగుతున్నాయి. పైపైకి లేస్తున్న అలలు చూస్తే లోపల అగ్నిగుండాలు మండుతున్న శిలారాసులు పోలి ఉన్నాయి ఒక్కొక్క అల శిఖరంమీదా ఒక చిన్న మంట.

ఈ కాంతి తీవ్రతకు నా కళ్ళు మిరుమిట్లు గొలిపిపోతాయి. తెరచాప స్తంభం పట్టుకుని వేళ్లాడుతాను. తుపాను తాకిడికి అది గడ్డిపోచ వంగినట్లు వంగిపోతున్నది.

(ఇక్కడ మా నావ ‘లాగ్’ సరిగ్గా లేదు. కొన్ని వివరాలు మాత్రం అప్పుడప్పుడు వ్రాసుకున్నవి దొరుకుతాయి. కాని క్లుప్తంగా, అస్పష్టంగా ఉండటంవల్ల నా భావాలు ఎలా మారుతూ వచ్చాయో తెలుసుకోవచ్చు. నా జ్ఞాపకశక్తి కన్నా ఇవే నమ్మదగినవి !)

ఆదివారం, ఆగస్టు 23—ఎక్కడ ఉన్నాము ? అతివేగంగా కొట్టుకుపోతున్నాము.

పోయిన రాత్రి భయంకరంగా ఉన్నది. తుపాను తగ్గటంలేదు. శబ్దాలతో నిండిన ప్రపంచంలో ఉన్నాము. ప్రేలుడులకు అంతులేదు. మా చెవులు రక్తం కారుతున్నాయి. ఒక మాట మాట్లాడలేము.

మెరుపులు వస్తూనే ఉన్నాయి. వంకర వంకరగా క్రిందకు వచ్చి వెనక్కి కొట్టుకుని, పైన గ్రానైట్ కప్పుకు తగలటం చూస్తాను. అది కూలిపోతే ! కొన్ని మెరుపుతీగలు చీలికలు చీలికలుగా ఉంటాయి. మరికొన్ని బాంబులవలె ప్రేలే గోళాలను పోలి ఉంటాయి. కాని మొత్తంమీద శబ్దం అధికం అయినట్లు లేదు. మానవుని చెవులకు అందే తీవ్రత యొక్క పరిమితి దాటిపోయినది. ఈ క్షణంలో కనుక ప్రపంచంలోని తుపాకి ‘మందు’ అంతా ప్రేలినట్లయితే మాకు అసలువినిపించేదికాదు!

మబ్బులమీద నుంచి ఒక విచిత్రమైన కాంతి ప్రసారం అవుతున్నది. విద్యుచ్ఛక్తి నిర్విరామంగా కదులుతూ ఉండటంచేత వాతావరణంలోని వాయువుల పరిమాణాలు మారిపోతున్నట్లు తోస్తుంది. నీటి ధారలు పైకి ఎగసి నురుగు నురుగులుగా వెనుకకు పడిపోతున్నాయి.

ఎక్కడకు వెళుతున్నాము ? ...... తెప్ప ముందు భాగంలో మా పెదనాన్న అడ్డంగా పడిపోయి ఉన్నాడు.

వేడి ఎక్కువయి పోతున్నది. థర్మామీటర్ చూస్తాను. వేడి .......... (అంకె చెరిగిపోయి ఉన్నది.)

సోమవారం, ఆగస్టు 24—దీనికి అంతులేదు ! ఈ చిక్కటి వాతావరణం మారిపోయి ఇకపైన ఈవిధంగానే ఉండిపోతుందా ?

అలసటతో నీరసం అయిపోయాము. హాన్స్ ఒక్కడే యథావిధిగా సాగిపోతున్నాడు. తెప్ప ఆగ్నేయం వైపు ప్రయాణం చేస్తూనే ఉన్నది.

---

“ఇతడు త్రాగాడని నీకెందుకు అనుమానం కలిగింది?”నిందితుణ్ణి వేలెత్తి చూపిస్తూ పోలీసుఅధికారిని జడ్జి అడిగాడు.

“అయ్యా వీడు ముక్కుకు సూటిగా వెళ్ళి దీపస్తంభాన్ని గుద్దుకుని క్రిందపడ్డాడు. లేచి వెనక్కివెళ్ళి మళ్ళీ అల్లాగేవచ్చి గుద్దుకుని పడ్డాడు. ఇలా నాలుగు సార్లు పడ్డతరువాత తలపైకెత్తి “ఓరి భగవంతుడా ! అడవిలో చిక్కుపడ్డానే” అని ఏడ్చాడు'- పోలీసు అధికారి చెప్పాడు.

బి. ఎస్. రామానందం (హైదరాబాదు)

---

‘ఆక్సెల్ ద్వీపం’ వదలిన తర్వాత అరువందల మైళ్ళ పైగా ప్రయాణం చేశాము.

మిట్టమధ్యాహ్నానికి తుపాను ఉగ్రత రెండు రెట్లు అధికం అవుతున్నది. మా సామాను అంతా తెప్పకి గట్టిగా కట్టివేయవలసి వస్తుంది. మేము కూడా త్రాళ్లతో కట్టుకుంటాము. అలలు మా తలలపైనుగా పడుతున్నాయి.

మూడు రోజులుగా ఒక్క మాట పలుకటం అసాధ్యం ! నోరు తెరిచి పెదిమలు కదుపుతాము కాని శబ్దం రాదు. చెవి దగ్గరగా అరచినా వినపడదు.

మా పెదనాన్న నావైపు జరుగుతాడు. కొన్ని మాటలు ఉచ్చరిస్తాడు. “మన పని ఆఖరు” అన్నాడుఅనుకుంటాను కాని నిశ్చయంగాతెలియదు.

అందుకని ఒక కాగితం ముక్కమీద ఇలా వ్రాసి ఇస్తాను : “ తెరచాప దింపుదాం.”

ఆయన తల మ్రొగ్గుతాడు.

మళ్ళీ పైకి ఎత్తేలోగా ఒక అగ్నిచక్రం తెప్ప మీదకు వచ్చేస్తుంది. తెరచాప స్తంభం, తెర చాపతోబాటు ఎగిరి వెళ్ళిపోతాయి ఆకాశంలోకి పైపైకి ఎగిరిపోవటం చూస్తే ఏ ‘టెరోడాక్టయిల్’ నో చూస్తున్నట్లు ఉన్నది.

భయంతో బిగుసుకు పోతాము. తెలుపూ, నీలం వర్ణాలు కలిసిన ఆ అగ్ని వలయం పది అంగుళాల వ్యాసం కలిగి ఉంటుంది. తెప్పమీద ఇటూ అటూ కదులుతున్నది. తెప్పకు కట్టిన త్రాళ్లమీద, పాత్రల మీద కొంచెం కొంచెం ఆగుతూ తుపాకి మందువైపు జరుగుతుంది. భయంకరం ! మేమంతా ప్రేలిపోతాము. ‘లేదు’ ఆ వలయం ప్రక్కకు తిరిగిపోతుంది. హాన్స్‌ను సమీపిస్తుంది. అతను తదేక దీక్షతో దానినే చూస్తాడు. ఆతర్వాత మా పెదనాన్న దానిని తప్పించుకొనేందుకని మోకరిల్లుతాడు. ఆ తర్వాత వణుకుతూ భయంతో పాలిపోయిన నేను, నా కాలి చుట్టూ నాట్యం చేస్తుంది కాలు వెనుకకు లాగివేద్దా మనుకుంటాను. లాక్కోలేను.

నత్రజని సంబంధమయిన వాయువుల వాసనతో వాతావరణం నిండిపోతుంది. గొంతుక, ఊపిరి తిత్తులు ప్రవేశించి ఆయాసపెడ్తుంది.

నా కాలు నాస్వాధీనంలో ఎందుకు లేదు. తెప్పకి మేకు కొట్టి ఉన్నదా ? ఒకవిధంగా చూస్తే, అంతే ! ఈ విద్యుత్ వలయం మూలంగా తెప్ప మీద ఇనుపసామాను అంతా అయస్కాంత శక్తితో నిండిపోయినది. పరికరాలు, పనిముట్లు, ఆయుధాలు అన్నీ ఒకదానివైపు ఒకటి జరిగి చప్పుడు చేస్తూ కలిసిపోతాయి. నా ‘బూట్సు’ లోని మేకులు తెప్పకొయ్యల మధ్య ఉన్న ఇనుప ఫలకానికి అంటుకుపోయి ఉన్నాయి. నా కాలు వెనుకకు రావటం లేదంటే ఆశ్చర్యం ఏమున్నది !

చివరకు బలంగా ప్రయత్నించి—సరిగ్గా ఆ అగ్ని వలయం కాలికి తగిలి దానితోబాటు నన్ను లాక్కుపోతుం డగా—విడిపించుకుంటాను. ...

ఎంత తీవ్రమయిన కాంతి ! ఆ గోళం మండిపోతున్నది ! దాని జ్వాలలు మమ్ము తాకుతున్నాయి.

కాని అంతా నల్లగా మారిపోతున్నది. స్పృహ తప్పే ముందు క్రిందపడిపోయి ఉన్న మా పెదనాన్న, చుక్కాని వద్ద ‘నిప్పులు కక్కుతూ’ ఉన్న హాన్స్, (అతనిని చుట్టిఉన్న విద్యుచ్ఛక్తి ఈ విచిత్రమైన దృశ్యానికి కారణం అని వేరే చెప్ప నక్కరలేదు.) చూస్తాను....

ఎక్కడికి పోతున్నాము ? మేము ఏమయి పోతాము ?

మంగళవారం, ఆగస్టు 25—నా మైకం చాలసేపు ఉన్నది. ఒళ్ళు తెలిసేసరికి తుపాను ఇంకా చెలరేగుతున్నది. మెరుపుతీగలు వాతావరణంలో విచ్చలవిడిగా తిరుగుతున్న సర్పాలను పోలి ఉన్నాయి.

ఇంకా సముద్రం మధ్యనే ఉన్నామా ? అవును, చెప్పలేనంత వేగంగా ప్రయాణం చేస్తున్నాము. ఇంగ్లాండ్ క్రిందుగా వెళ్లాము ! ఆ తర్వాత ఫ్రాన్సు క్రింద ! ఇంకా కొంతసేపటి తర్వాత ‘యూరోప్’ క్రింద !

సరికొత్త శబ్దం ఒకటి వినిపిస్తున్నది. ఈ బరువైన సముద్రం తీరం మీద రాళ్లను ఢీకొంటున్నది, అనుకుంటాను ! ...... అయితే ....

(సశేషం)

తని జలజలలాడిస్తోంది—శరీరాన్ని కృంగింది, కిటికీ రెక్కమూసి, తలుపుట్టూ చీరకొంగు తిప్పి, అంచు లాంటిన తోపింది

మంచంమీద చంటిపిల్ల అటూ ఇటూ కదిలింది—మగతనిద్రలో. వచ్చి కూచుని జోకొట్టి, నిద్రలో గొట్టింది

దూరాన ఎవరిదో గడియారం పన్నెండు కొట్టింది మెల్లిగా లేచి, మధ్యతలుపు ఓరగా తీసి చూసింది కృష్ణమూర్తి మూలుగు నిలిచి పోయింది

అలమర్లో పడేసిన ఆఫీసు ఫైళ్ళు 'జంతువు'లు, నిర్దాక్షిణ్యంగా గాండ్రిస్తున్నాయి—అతన్ని చూసి

ఎర్రటి పూలుతాలున ముసుగులో నిద్రపోతున్న కృష్ణమూర్తి పొగువడ్డ క్రోధంలా—అన్పించాడు ఆమెకి

తలుపు దగ్గరనా జేర్లవెసి వెనక్కివచ్చి కూచుని ఆలోచిస్తోంది

* * *

ఒక్కొక్క ఆడపిల్ల పుడితే—ఆమె చుట్టూ అదృష్టం, ఆనందం గంతులు వేస్తాయి అదే ఊర్మిళ పుట్టిందనగానే—దురదృష్టం వెకిలినవ్వు ఆమెని పసితనంలోనే ఏడ్పించింది అందరూ ఆమెను చూసినప్పుడు కనుబొమలు ముడిచేవారే

కారణాలు కాకతాళీయాలు

మేనమామకి 'రణాలు' రెండేళ్ళు పెట్టిన బాధ ఈమె పుట్టుకతో అతణ్ణి మృత్యువు చేర్చింది—జనక ఊర్మిళ తల్లికి విరోధి

తను ఆడపిల్ల అయి పుట్టడం—అందులోనూ యాభయ్యోపడిలో గుండెలమీద కుంపటి'గా తండ్రికి విరోధి

ప్రపంచంలోకల్లా తనని ఎక్కువగా ప్రేమించాల్సిన ఇద్దరూ అలా దూరదూరంగా ఉన్నారు

ఎదిగిన ఇద్దరి కూతుళ్ళకోసం చేసిన అప్పు పెళ్ళి బావతుది—ఇంకా ఎదురుచూస్తోంది మళ్ళీ కూతురా!

వెనకాల పడిఉండి, పుట్టకి పుట్టు ధాన్యం ఇచ్చే ఆస్తి లేదాయిరి

ఏదో—బతుకుని జీతంరాళ్ళ బరువుతో తూచి—కిందా మీదా పడి సంసారం లాక్కొస్తున్నాడు—ఆమె తండ్రి

అతను పెళ్ళాన్ని తిడతాడు "మళ్ళా ఆడపిల్లని కన్నావ్!" అని ఆ తల్లి ఈ కూతుర్ని తిడుతుంది—ఏదో కోపంతో

'మాటలంట్టే అర్థంకాని' ఆ పసితనంలోనే, ఒకళ్ళ వొకళ్ళు కారణాలుగా సృష్టించుకు తిట్టుకుంటారు!

కాలంతోపాటు—మనిషి బుద్ధితోపాటు— తల్లి మరణంతో పాటు—

ఊర్మిళ పెరిగింది

నాలుగు గోడల మధ్యనించి 'జీవితం' ముందు రోజుల్లోకి—తన చుట్టూ ప్రపంచంలోకి ఊహాలు కదుతోంది

అమ్మ పోగానే అత్తయ్య వచ్చింది

అత్తయ్య భర్త పోయాడు ఆ మధ్యనే అత్తయ్య నాన్నకి చెల్లెలు—నాన్న తనకి శత్రువు ఆమెకి ఊర్మిళంటే ఎందుకో విపరీతమైన ఇష్టం ఆమెకి

# చివరకు మిగిలింది

23వ పేజీ తరువాయి

నాలు గేళరాల ఆస్తి, ఆ ఆస్తిని చూసిపెట్టే 'ఒంటరి' మనిషీ ఉన్నారు అతను నిజానికి ఆమె స్వంతమనిషి కాదు తన భర్తకి చాలా దగ్గర మిత్రుడు ఆమెకి భర్తపోయేప్పుడు అతన్నిగురించి చెబుతూ—అతన్ని చూడమని ఒప్పచెప్పాడు అమాయకుడు పెళ్ళంటే పరమ ద్వేషం బ్రహ్మచారిగానే ఉండి పోయాడు నలభై ఏళ్ళు దరిదాపు వచ్చినా ఊర్మిళ అత్తయ్యకి మారుపేరు అమ్మ ●

అమ్మపోగానే ఎవరేనా, ఏమేనా అంటే, పరుగున వచ్చి, అత్తయ్యకడుపులో తలదాచుకు బావురు మనేది అత్తయ్యకళ్ళంట నీళ్ళు గిర్రున తిరిగేవి

అంత చిన్నతనంలో, గుండెజబ్బుతో నీరసంతో



ఒక్కనాలే ఆ పసిదాన్ని చూసి, ఎవర్ని ఏమీ అన నిచ్చేదికాదు ఊర్మిళని

ఆమె కన్నీళ్ళు చూసినప్పుడు "అత్తయ్య అను కునేది—'మనిషిని మనిషి ప్రేమించడం' అంటే అర్థం చేసుకున్నానని

ఊర్మిళకి అర్థం అయింది—బాధని కడిగేసు కోవడం ఎట్లాగో

అత్తయ్య అభిమానించడంతో నాన్న విషం చిమ్మడం కొంతవరకూ తగ్గింది

ఎప్పుడో జ్ఞాపకం వస్తుంది గావును ఊర్మిళని కేకేస్తాడు, "చిట్టీ అన్నం తిన్నావా?" అంటూ. ఏకరి లోకం కాయితాల మధ్య నించో తలెత్తి.

"ఊ" అనేది దూరాన్నించే

* * *

ఊర్మిళ పెద్దదైంది. తను అందంగా ఉండ కన్ను 'తక్కువతనం' సృష్టించుకు బాధపడుతుంది.

ఊర్మిళ అప్సరస కాదు. అలాగని కురూపికాదు. మధ్యమం. ఆమె నవ్వితే బుగ్గలు సొట్టలుపడవు. నడుస్తే జార్జెట్ చీర జారి కిందపడదు అంతా సామాన్యంగా సాగుతుంది

కొన్నేళ్ళు గడిచాయి హఠాత్తుగా ఓ రోజు చెప్పింది అత్తయ్య 'నీకు పెళ్ళ'ని, తలొంచి నవ్వి, 'ఛీ' అంది

చిన్నతనంలో అమ్మతో ఒకటి రెండు పెళ్ళిళ్ళకి వెళ్ళిన సంగతి జ్ఞాపకం వచ్చింది ఆమెకి

తలంబ్రాలూ సన్నాయీ .... నవ్వుకోడం... పన్నీరుబుడ్లు బట్టలూ . కళ్ళముందే పొగలో హోమాలు చెయ్యడం ఇంతమటుకే తెలుసు పెళ్ళంటే పది పేడేళ్ళు దాటిన ఊర్మిళకి! ప్రత్యేకత ఏమీ కన్పించలేదు ఆమె బుద్ధికుశలతలో

తను పెద్దవాళ్ళమధ్య కూచున్నప్పుడు విన్న విషయాలే తెలుసు—ఆమెకి సంప్రదాయం . .. నోములూ. వ్రతాలూ పూజలూ . .. మళ్ళా . అంతే అంతే

* * *

పందిళ్ళూ పాకలూ . బ్రాహ్మలూ
పువ్వులూ నవ్వులూ పెద్దలూ
బట్టలూ తలంబ్రాలూ—

"అయింది పెళ్ళి" అన్నాయి

కృష్ణమూర్తి కొర కొర చూశాడు.

కళ్ళకి పెట్టిన కాటుకలో చూపుల్ని కరిగించుకుని—తలొంచుకూర్చుంది

కృష్ణమూర్తికి అత్తయ్య తల్లి కాదు

కాని అత్తయ్యకిమాత్రం అతను కొడుకులాంటివాడు ఎక్కడో చదివాడు పెద్ద చదువు అబ్బలేదు అతని బీదస్థితిలో చదువు చెప్పించింది అత్తయ్య

అత్తయ్య కతను కొడుకు

అతనికి ఆమె ఎంతంటే అంత

తన ఆస్తిలో అతనికి ఏదో కొంత ముట్టజెబుతుందని అందరి వదంతి

అతని అంతర్యంలో కోరికా అదే

స్కూలు ఫైనలు—తాలూకాఫీసులో గుమస్తాగా "సెలెక్ట'యి జేరాడు ఫైనలులో 'స' కారం లోపింత జేసి, వాటిల్లో మునిగిపోయాడు

* * *

కాలం గిరగిర తిరిగి నాన్ననీ, అత్తయ్యనీ కూడా తెరమరుగుల్లోకి లక్కుపోయింది

ఇప్పుడు ఊర్మిళ ఒంటరిది

కృష్ణమూర్తి ఊహ కొంత మోసపోయింది. అత్తయ్య పోయేటప్పుడు ఓ బదునందలిచ్చి పోయింది—అంతే

అతనికి కాలం ఆగినట్టయింది చదివింది స్కూలు ఫైనలు చేసేపని గుమాస్తా ముందు జీవితందారి నరకంలోకి దారితీస్తోందా! — భయపడ్డాడు

ఊర్మిళ అతనికి భార్య

కోపంగా చూస్తాడు అసహ్యించుకుంటాడు. ఆమెబతుకుని వేళాకోళం చేస్తాడు అతనికి ఊర్మిళ ఇష్టంలేదు అత్తయ్య ఇచ్చే ఆస్తికి ఈమె 'సూచన' అతనికి, అంతే

# ఏడు కొండలు

16-వ పేజీ తరువాయి

శ్యామ్‌బాబు లేచి వీధిలోకి వెళ్ళినసాయంత్రం, ఇంటిల్లిపాదీ ఎంతో సంతోషించారు వాళ్ళ ప్రేమా, అభిమానం చూసి శ్యామ్‌బాబు ఎంతో మురిసి పోయాడు అవాళే ధర్మసూరిగారు వస్తున్నారని తెలిసింది.

సత్యన్నారాయణగారు ఆ ముందురోజే మద్రాసునుంచి వచ్చేశారనీ, కొద్దిగా పనుండడంవల్ల ధర్మసూరిగారు ఇంకొకరోజు ఆలస్యంగా బయల్దేరి అనాటి రాత్రి వస్తున్నారనీ తెలిసింది సత్యన్నారాయణగార్ని కలుసుకొని డబ్బు తీసుకువస్తానని లలితతో చెప్పాడు, శ్యామ్‌బాబు అదే శ్యామ్‌బాబు ఈనెల రోజుల తర్వాత, వీధులో అడుగుపెట్టడం

మరొక గంటన్నర పోయినతరువాత శ్యామ్‌బాబు, వెనకాల రెండు గంపలను కూలీలచేత మోయించుకొని రావటం చూచి లలిత తల్లితో, "అమ్మా! చూడవే మళ్ళీ డబ్బు చేతిలోపడింది కాబోలు బజారంతా కొనుక్కు వస్తున్నాడు బాబాయి" అంది

"మళ్ళీ రెండు మూడు రోజులదాకా మీ బాబాయిని పట్టగలమా?" అంది నవ్వుతూ జగదాంబ కాని, తీరా గంపలు తమ ఇంటిముందర దిగేటప్పటికి లలితా జగదాంబా కూడా ఆశ్చర్యపోయారు ప్రతి సారీ జీతం అందగానే తనకేగాక, ఇద్దరు ముగ్గురు వుండే కుటుంబానికి, పదిహేను రోజులదాకా సరిపోయే సామాను తేవడం శ్యామ్‌బాబు కలవాటు ఈసారి ధర్మసూరిగారి కుటుంబానికి రెండు నెలలదాకా సరిపోయే సామాను తెచ్చాడు అవికాక బిస్కట్ల పాకెట్లూ, మిఠాయిపొట్లాలూ వరుసగా తీసి శీనుకూ, రాముకూ, పద్మకూ, లలితకు ఇచ్చేస్తున్నాడు "ఇవన్నీ ఎందుకు బాబాయి?" అని లలిత అడిగింది శ్యామ్‌బాబు, "నాకు నయమైంది కదమ్మా అందుకని మీ కందరికీ టీపార్టీ చేస్తున్నాను" అన్నాడు నవ్వుతూ

సామాన్లన్నీ ధర్మసూరిగారింట్లోనే పెట్టించేశాడు, శ్యామ్‌బాబు, ఎందుకంటే అతనిని రెండు మూడు రోజులదాకా వండుకోవద్దని లలిత కోరింది అవన్నీ ఒక్కొక్కటే విప్పి చూస్తూ, జగదాంబ, "అబ్బ! మీ బాబాయి ధర్మమా అని రెండు నెలలదాకా మనం సామాన్లకు ఇబ్బంది పడక్కరలేదే" అంది లలిత అన్ని సామాన్లూ పరిశీలించి, "బాబాయి అన్నీ తీసుకువచ్చాడుగాని, అగ్గిపెట్టెలు లేవేదే" అంది నవ్వుతూ

"ఆ అగ్గిపెట్టె లేకపోవడమే ఇంత ముప్పు తెచ్చింది మీ బాబాయికి" అంది జగదాంబ మళ్ళీ ఆమె, "లలితా, నువ్వొకసారి కొట్టువాడిదగ్గరకు వెళ్ళి అగ్గిపెట్టె ఒకటి తీసుకురా, అమ్మా!" అంది. "అబ్బ! కొట్టువాడి దగ్గరకు వెళ్ళడం అంటే భయం వేస్తుందే నావేపు ఎగాదిగా తెగ జూస్తాడు ఎలాగైనా, నా వేళ్ళకి తనవేళ్ళు తగిలించాలని చూస్తాడు వెర్రి వెర్రి వేషా లేస్తాడు"

"ఇన్నాళ్ళకు ఇప్పు డీవిషయం చెబుతున్నావా? వయసులోవున్న పిల్లని పంపటం నాదే పొరపాటు కాని, వాడు ఇలాంటి చేష్టలు చేస్తున్నాడని చెప్పకుండా ఎందుకు దాచావ్?"

"మరి, ఆవిషయం చెప్తే నువ్వు వెళ్ళనియ్యవ్ నేను వెళ్తేనే వాడు సరుకులు అరువిస్తున్నాడు" అంది లలిత చిన్నబోయిన మొహంతో. జగదాంబ ఒక్క క్షణం లలిత మొహంవేపు చూసింది "పోనీలే తల్లీ. నువ్వు వెళ్ళద్దులే రామూనిగాని, శీనునిగాని వెళ్ళమను" అంది లలిత రామూను కొట్టుకు పంపించింది వాడు పదినిముషాల్లో అగ్గిపెట్టె తీసుకు వచ్చాడు అంత తొందరగా సెట్టి కొట్లో సామాను దొరకడం, లలితకు ఆశ్చర్యం కలిగింది అరువు పెట్టే కొట్లోవాళ్ళని గంటలకొద్దీ నిలబెట్టిగాని సామా నివ్వడు సెట్టి

"ఈసారి చాలా తొందరగా సామానిచ్చేడే!" అంది లలిత

"అక్కా! ఎప్పుడూ లేనిది చాలా మర్యాదగా

---

మొదటిసారిగా రాజధానీ నగరం చూడటానికి వెళ్ళిన నాంచారయ్య శాసనసభాభవనం నుంచి బయటకువస్తూ వీద్వారం లోంచి బయటకు రావాలో తోచక తికమకపడుతున్నాడు. శాసనసభకు పోటీచేసి తాజాగా ఓడిపోయిన మాధవయ్యగారు అతడికి ఎదురయ్యారు.

"అయ్యా ఇక్కడనుంచి బయటపడటం ఎలాగో చెబుతారా?" అడిగాడు నాంచారయ్య.

"ఏముంది! నా నియోజకవర్గం నుంచి పోటీచెయ్యి" పరధ్యాన్నంగా అన్నారు మాధవయ్యగారు.

సురేష్, (మద్రాసు)

---

కూడా మాట్లాడాడే మరేమో 'మీ బాకీ అంతా శ్యామ్‌బాబుగారు తీర్చేశారు. మళ్ళీ మీకెంకావాలన్నా పట్టికెళ్ళండి' అని కూడా అన్నాడే?

"ఏమిటీ? బాబాయి మన బాకీ తీర్చేశాడా?"

"అవు నక్కా"

లలిత ఇంట్లోకి పరిగెత్తుకెళ్ళి తల్లితో ఈ విషయం చెప్పింది. జగదాంబ ఆశ్చర్యపోయింది సుమారు రెండు వందల రూపాయలదాకా వుంటుంది, సెట్టిబాకీ అలాటిది శ్యామ్‌బాబు అబాకీ అంతా తీర్చెయ్యడం ఆమెకు చాలా ఆశ్చర్యం కలిగించడమే కాకుండా, ఇంత డబ్బు శ్యామ్‌బాబుకు ఎలా వచ్చిందా? అన్న సందేహం పట్టుకుంది ఎక్కడైనా దొరికిందేమో!

ఇంతట్లో లలిత శ్యామ్‌బాబు యింట్లోకి వెళ్ళి, "బాబాయి! మీరు మా బాకీ ఎందుకు తీర్చారు? ఆ సామానులన్నీ ఎందుకు తెచ్చారు?" అని అడిగింది. శ్యామ్‌బాబు నవ్వాడు.

"అది సరేగాని లలితా, డాక్టరుకు ఫీజు క్రిందం నువ్వేమైనా ఇచ్చావా?" అని అడిగాడు శ్యామ్‌బాబు.

"నేనేమీ ఇవ్వలేదు" అంది లలిత.

"అబద్ధమాడకు"

కొంచెం ఆలోచించి లలిత, "నా మెడలో ఒకబిళ్ళ వుంటే అదిచ్చాను" అంది శ్యామ్‌బాబు, "అలా ఇచ్చావా లలితా? మీ నాన్నగారికి తెలుస్తే కోప్పడరూ? పెద్ద వాళ్ళకు తెలియకుండా అలా స్వతంత్రించి నీవంటి మీద ఏముంటే అది ఎవరికిపడితే వాళ్ళకు ఇచ్చెయ్యవచ్చునా?" అని అడిగాడు లలిత సందిగ్ధంలో పడింది. తండ్రి ఏమంటాడో అని తనకీ భయంగానేవుంది. అయినా ధైర్యంగాజవాబివ్వదల్చుకుంది.

"నాన్నగారు ఏమీ అనరులే బాబాయి"

"ఒకవేళ ఏమన్నా అంటే?"

లలిత ఏమీ జవాబు చెప్పలేదు శ్యామ్‌బాబు తన జేబులోంచి ఆ బిళ్ళ తీశాడు. "ఇదుగో లలితా నీ బిళ్ళ. నువ్వు నా ప్రాణం కాపాడిన బిళ్ళకోసం, నిన్ను నేను మాట పడనిస్తానా? తీసుకో" అని ఇచ్చేశాడు

విప్పారిన మొహంతో ఆబిళ్ళ తీసుకుంది. ఆమె కన్నులలో బాబాయియందు కృతజ్ఞతాశ్రువులు వెలిసాయి. "మీరెంత మంచివారు బాబాయి!" అని, తల్లివద్దకు ఈ సంగతి చెప్పడానికి పరిగెత్తింది.

ఆవేళ సాయంకాలం ధర్మసూరిగారు వచ్చిన అరగంటసేపటిలో జరిగిన విషయాలన్నీ లలితా, జగదాంబా కలిసి ఆయనతో చెప్పారు ఆయన కొద్దిసేపు ప్రయాణబడలిక తీర్చుకొన్న తరువాత శ్యామ్‌బాబును కలుసుకుందామనుకొన్నారు

శ్యామ్‌బాబు వరుసగా అవాళ తన పాతస్నేహితు లందర్నీ కలియసాగాడు దినకర్ తమ వూరినుంచి తిరిగివచ్చి, అతనూ, అతని భార్యా కొంతవరకూ రవి పోయిన దుఃఖాన్ని మరిచి మామూలుగా తిరుగుతున్నారు డాక్టరు మిశ్రా ఇంకా తీర్థయాత్రలు చెయ్యటం పూర్తికాలేదని తెలిసింది. కాంతారావుగారు వ్యాపారాలగురించి ఆలోచించటం మానేసి భగవద్గీత శ్రద్ధగా పారాయణచేస్తున్నారు. సత్యన్నారాయణగార్నికూడా కలిసి మాట్లాడి, ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి, రాత్రి ఎనిమిది గంటలయింది.

ధర్మసూరిగారూ, శ్యామ్‌బాబూ భోజనానికి కూర్చున్నారు లలితా, జగదాంబా వడ్డిస్తున్నారు

తనకు లలిత వివిధంగా సపర్యచేసి తనను ప్రాణాపాయంనుంచి రక్షించిందో శ్యామ్‌బాబు చెప్తూ, "నా కన్నకూతురుకూడా అంత శ్రద్ధగా చేస్తుందనుకోను" అన్నారు.

దానికి ధర్మసూరిగారు, "లలిత మీ పుత్రికే అనుకోండి" అన్నారు నవ్వుతూ లలితకూడా చిరునవ్వు నవ్వింది.

"అంత అదృష్టం కలిగితే కావల్సిందేముంది?" అన్నారు శ్యామ్‌బాబు నిట్టూరుస్తూ. ధర్మసూరిగారికి శ్యామ్‌బాబు అసలు ఎందుకు అలా అన్నారో బోధపడలేదు.

"మీకు పిల్లలు లేనేలేరా?" అని అడిగారు ధర్మసూరిగారు, ఇన్నాళ్ళనుంచీ అడగకపోయినా, ఆ ప్రసక్తి వచ్చిందికాబట్టి.

"లలితంత అమ్మాయిని పోగొట్టుకున్నాను" అన్నారు దిగులుగా శ్యామ్‌బాబు అందరి మొహాల లోనూ ఆశ్చర్యం వెలిసింది.

"పోనీండి, లలిత మీ బిడ్డే అనుకోండి" అన్నారు ధర్మసూరిగారు. శ్యామ్‌బాబు తల వూపుతూ, "అలా ఊరికే అంటే లాభంలేదు" అన్నారు. ధర్మసూరి గారికి మాట పట్టింపు హెచ్చు.

"నేను ఊరికే అనడంలేదు"

"అయితే లలితను నాకు పెంపకం ఇస్తారా?"

"ఓ! నిరభ్యంతరంగా" అన్నారు ధర్మసూరి గారు జగదాంబకుమట్టుకు సంభాషణ ఇలా దిగిందేమా అనిభయంవేసింది. లలితకు ఇదంతా విచిత్రంగావుంది

"అయితే ఆమె వివాహాది విషయాలలో అంతా నా యిష్టం వచ్చినట్లే చెయ్యనిస్తారా?"

"అలాగే"

"లలితా! నీ కిష్టమేనా?" అని లలిత నడిగాడు శ్యామ్‌బాబు

"ఇష్టమే బాబాయి" అంది

జగదాంబకుమటుకు తండ్రీ కూతుళ్లిద్దరూ ఇలా ఒప్పేసుకోవడం అవివేకమనిపించింది శ్యామ్‌బాబు ఉద్దేశమేమిటో స్పష్టంగా తెలియదు. అతను పెంచుకో దల్చుకుంటే తమ పిల్లనే ఎందుకు అడగాలి అయినా లలితను తాము వదిలివుండగలరా? శ్యామ్‌బాబు పూరే మిటో, కుటుంబ పరిస్థితులేమిటో తెలియవు

ఆమె ఊహాల్ని పసికట్టిన శ్యామ్‌బాబు, "లలితను మీరు విడిచి వుండనక్కరలేదు ఆమె నాకళ్లముందు తిరుగుతూంటే చాలు ఆమె భవిష్యత్తును నిర్ణ యించవలసివచ్చినప్పుడు, మీతోపాటు నాకు కూడా సమాన బాధ్యత నిస్తే చాలు. అందుకోరకై మాత్రమే ఆమెను నేను పెంపకమడిగాను" అన్నాడు. జగ దాంబ మనస్సు శాంతించింది లలితా, ధర్మసూరి గారూ నవ్వారు.

ఒక కాలెండరు పూర్తిగా చిరిగిపోయింది.

* * *

వాల్తేరు స్టేషనులో మెయిలు ఆగింది ఫస్టు క్లాసు కంపార్టుమెంటులోంచి ఒక ఏభై ఏళ్ల వ్యక్తి దిగాడు పోర్టరుసహాయంతో సామాను పట్టించుకొని స్టేషను బయటికి వచ్చాడు. ఆయన వేసిన సూటుకు బట్టి చాలా పెద్ద ఉద్యోగస్థు డనుకోవచ్చు..

డ్రైవరు కేశవరావుగా రింటికి వెళ్లాలని టాక్సీ వాడితో చెప్పాడు టాక్సీ తిన్నగా కేశవరావుగా రింటివద్దకు వెళ్లింది.

కేశవరావుగారు మధ్యాహ్నం భోజనమైన తరువాత ఒక నిద్రతీసి మూడు గంటలకు లేస్తారు ఆయన నిద్ర లేచి మొహం కడుక్కోవడానికి వెళ్దా మనుకుంటూంటే నౌకరు ఒక చిన్న కార్డు తీసుకు వచ్చాడు. దానిమీద ఎల్ గణపతి, జనరల్ మానే జరు, 'ప్రతాప్ టెక్స్‌టయిల్స్', మద్రాసు అని ఉంది. అది చూడగానే కేశవరావుగారికి ఆశ్చర్యం వేసింది. సాధారణంగా మందుల కంపెనీలవాళ్లు ఆయనవద్దకు వస్తూంటారు వారయినా కంపెనీ సేల్సుమన్‌లేనూ జెనరల్ మానేజర్లు రారు పైగా టెక్స్‌టయిల్స్ కంపెనీవాళ్లు తన వద్దకు ఎందుకు రావాలి? బహుశా ఏదో గొప్ప కేసు అయిఉండొచ్చు మద్రాసునుంచి అంత గొప్ప వాళ్లు కేసుకోసం తనవద్దకు రావడం ఆయనకు ఆశ్చర్యంవేసింది. నౌకరుతో "ఆయనను హాల్లో కూర్చోబెట్టి, అయిదు నిముషాలలో నేను వస్తు న్నానని చెప్పు" అన్నారు నౌకరు అలాగేనని వెళ్లాడు. కేశవరావుగారు లోపలికి వెళ్లి భార్యతో, తనను కలుసుకోనడానికి ఒక ప్రముఖవ్యక్తి వచ్చాడనీ, కాఫీ హాలులోకి ఇద్దరికీ పంపమని చెప్పి, బట్టలు వేసుకొని హాల్లోకి వెళ్లారు.

కేశవరావుగార్ని చూస్తూనే, లేచి, గణపతిగారు తనను తాను ఆయనకు పరిచయంచేసుకొని ఆయనతో కరచాలనంచేశారు. గణపతిగారు తమ యింటికి రావడం తమకు చాల ఆనందదాయకమని కేశవరావుగా రన్నారు గణపతిరావుగారు చాలా నెమ్మ దస్తుడు. ఆయన మాటల్లో, గాంభీర్యం, ఆత్మ విశ్వాసం తొణికిసలాడడమే కాకుండా ఎదుటి వ్యక్తికి అతనియందు చాలా గౌరవం కలిగించ

---

"మీరొక్క పదిరూపాయలు ఇస్తే నాపుస్తకం అచ్చువేయించు కుంటా" అడిగాడు ఆవచ్చిన పెద్దమనిషి. శ్రీనివాసరావుగార్ని.

ఇదో కొత్తపద్ధతి ముష్టిలాగ ఉన్నదనుకుని "ఇంతకూ మీరు రాసినపుస్తకమేమిటి?" శ్రీనివాస రావుగారు అతడ్ని అడిగారు.

"డబ్బు సంపాదనకు కొయ్యి సులభోపాయాలు"

"మరి మీకీ కర్మవమిటి?"

"ఇదీనాపుస్తకంలోఉన్నదే!" పెద్దమనిషి తొణకకుండా సమా ధానం చెప్పాడు.

బి. వెంట్రాళ్ళు, (బందరు)

---

కోటే ఉంది ఆయన ఇంగ్లీషులోనే మాట్లా డారు. తను అంతక్రితమే వచ్చిన మద్రాసు మెయిలులో దిగాననీ, తనెప్పుడూ విశాఖపట్నం రాలే దనీ, తన స్నేహితులు ఒక రిద్దరు విశాఖపట్ట ణంలో ఉన్నారనీ వారి పేర్లు చెప్పి, వారిని కేశవ రావుగారు ఎరుగుదురేమో కనుక్కొన్నారు వారు అపట్టణంలో ప్రముఖవ్యక్తు లవటంవల్ల తమకు తెలుసునని కేశవరావుగారు చెప్పారు. వారిని గురించి ఇద్దరూ కాస్సేపు మాట్లాడుకున్నారు

గణపతిరావుగారు విశ్రాంతిగా లోకాభిరామా యణం మాట్లాడుతూ, కేశవరావుగారితో స్నేహాన్ని వృద్ధిచేసుకోవడానికి వచ్చినట్లు మాట్లాడు తూంటే కేశవరావుగారి మనస్సులో ఈయన ఎందుకువచ్చినట్లా? అన్న అనుమానం ఎక్కువైంది.

ఇంతలో కాఫీ తీసుకొని నౌకరు రావడం, వారిద్దరూ కాఫీ త్రాగడంకూడా జరిగింది.

కాఫీ త్రాగాక గణపతిగారు "మీకొక అబ్బాయి ఉన్నాడని విన్నాను. ఆయన ఏం చేస్తున్నారు?" అని అడిగారు.

"ఎం ఎస్‌సీ. పరీక్షకు వెళ్తున్నాడు. పైన మేడమీద తనగదిలో ఉన్నాడు. పిలిపించనా?"

"వద్దు. వద్దు. ఆయనను నేను తరువాత కలుస్తాను. ముందు మీతోకొంచెం మాట్లాడాలి"

అబ్బాయి సంగ తెత్తగానే, ఇదేదో పెళ్లివ్యవ హారమని కేశవరావుగారికి అనుమానం వేసింది.

"అసలు మా ప్రతాప్‌గారే స్వయంగా వచ్చి మాట్లాడదా మనుకున్నారు ఒక కొత్త ఫ్యాక్టరీ కట్టడంగురించి, ఆయనే స్వయంగా వెళ్లవలసి వచ్చింది. అందుకని ఇక్కడికి నన్ను పంపించారు. ప్రతాప్‌గారు మీకు తెలుసునా?"

"అంటే ప్రముఖవ్యాపారస్థులు, ప్రతాప్‌గారా?"

"అవును ఆయనకు బొంబాయి, మద్రాసు, అహమ్మదాబాద్ మొదలైన నగరాలలో టెక్స్ టయిల్ మిల్సు ఉన్నాయి నేను మద్రాసులో ఉన్న మిల్సుకు జనరల్ మానేజర్ని."

"అలాగా! వారి గురించి వినటమే కాని, వారి పరిచయం లేదు వారు తెలుగువారేనా?"

"పదహారణాలా ఆంధ్రులు. స్వచ్ఛమైన భాష మాట్లాడతారు. చాలా సహృదయులు. వారికి ధన సంపదఎంతఉందోసద్గుణసంపత్తికూడాఅంతాఉంది."

"అటువంటి కోటీశ్వరులకు నాతో అవసరం కల్గడం ..... "

"పట్టే అవసరం కాదు వారి అమ్మాయిని, మీఅబ్బాయికిచ్చి వివాహం చేద్దామనుకుంటున్నారు"

కేశవరావుగారు "ఆ!" అన్నారు. ఆయన తను విన్న మాటల్ని నమ్మటమా? మానడమా? అన్న సందిగ్ధావస్థలో పడ్డారు.

"ప్రతాప్‌గారి అమ్మాయినా? మా అబ్బా యికా? మీరు నిజంగానే అంటున్నారా?" అని అడిగారు, మనస్సులోంచి వస్తున్న ఆనందాన్ని ఆపు కుంటూ, ఒకవేళ అది నిజంకాదేమో అనే సందేహం పీడిస్తూంటే.

"మీ అబ్బాయికే. అతని పేరు శంకర్ అనీ, మీకు ఒక్కడే అబ్బాయనీ, మీ పేరు కేశవరావుగా రనీ, అన్ని వివరాలూ చెప్పి నన్ను పంపారు"

"అవును. మా అబ్బాయి పేరు శంకర్. కాని వారికీ సంగతెలా తెలుసు?" అని అడిగారు కేశవ రావుగారు, ఇంకా అనుమానం తీరక.

"వా ల్తేరు (?) ప్రాంతాల కొకసారి వచ్చినప్పుడు, మీ అబ్బాయిని యాదాలాభంగా కలియడం జరిగిందట. వారి అమ్మాయికి తగిన వరు డితనే అని ఆయన మనసులో పడింది. మీ అబ్బాయిని కలుసుకొని మీ వివరాలన్నీ అడిగారుట"

"ఆసంగతి మా అబ్బాయి చెప్పలేదే అసలు వారిని కలుసుకున్నట్లే చెప్పలేదు"

"ఆయన చూడటానికి చాలా సామాన్యుడిలా ఉంటారులెండి. తను ఫలానా అనికూడా చెప్పు కోరు ఆయనదొక వింత స్వభావం"

"అలాగా! మావాడు ఒక పెద్ద క్రికెట్ ఆట గాడులెండి అంతర్ విశ్వవిద్యాలయాల ఆటలో బహుమతిపొందాడు ఆసందర్భంలో మద్రాసు కూడా వెళ్లాడు. అక్కడ కూడా మాశారేమో?"

# ఏడుకొండలు

"అయిఉండవచ్చు."

కేశవరావుగారు ఆనందం పట్టలేక, లోపలికి వెళ్లి భార్యతో ఈ విషయం చెప్పారు. ఆమెను కూడా పిల్చుకువచ్చి గణపతిరావుగారికి పరిచయంచేశారు. కొడుకునికూడా పిల్చి చెబ్దామనుకొన్నారు గాని, ఇంతలో ఒక విషయం ఆయనకు జ్ఞాపకమొచ్చి బాధకలిగించింది. "గణపతి గారూ! ఒక్క విషయం నన్ను బాధిస్తోంది. మా అబ్బాయి, చిన్నతనంవల్ల ఒక పెంకిపట్టు పట్టుకు కూర్చున్నాడు. అదేమిటంటే, వాళ్ల మేనమామ కూతుర్నే గాని, మరొకపిల్లను చేసుకోనని. అందువల్ల మేము వాడికి కొంత బోధ పర్చాలి....." అని కేశవరావుగారు అంటూంటే, గణపతిగారు "మీకు అటువంటి భయం అక్కర లేదు. నేను మీ అబ్బాయితో అయిదునిముషాలు మాట్లాడానంటే, తప్పక ఒప్పించగల్ను. నన్నొకసారి మీ అబ్బాయిని కలవనివ్వండి" అన్నారు. కేశవరావుగారు, అలా జరిగితే తాము చాలా సంతోషిస్తామనీ, శంకర్ మేడమీద తనగదిలో ఉన్నాడనీ, అక్కడికి తాను గణపతిగారిని తీసుకువెళ్తామనీ అన్నారు.

గణపతిగారు తను ఏకాంతంగా శంకర్‌ని కలియాలని, ఒక్కరే మేడమీదకి వెళ్లారు. ఆయన వెళ్లినతరువాత, కేశవరావుగారూ, సత్యవతీ తమ అబ్బాయికి ఇంత మంచి సంబంధం వచ్చిందని చాల సంతోషపడ్డారు. కాని శంకర్ ఒప్పుకోడని వాళ్లకి తెలుసు. ఎటువంటి సంబంధం వచ్చినా వద్దనేస్తున్నాడు. సత్యవతి తను శంకర్‌కి ఎలాగైనా వెళ్లి చెప్తే బాగుండు ననుకొంది.

"ఆయన, వాణ్ణి ఒప్పిస్తాననే ధైర్యంతో వెళ్లారుగా. ఆయన తిరిగిరానీ. నువ్వు వెళ్లి మాట్లాడుదూ గాని. అయినా ఇంత మొండివాణ్ణి నే నెక్కడా చూళ్లేదు. ఆ దౌర్భాగ్యపుపిల్లనే చేసుకుంటానని కూర్చున్నాడుగాని, మనమాట కాస్తంతైనా విన్నాడా?"

"ఇప్పుడు వింటాడేమో చూద్దాం ఉండండి.'

"ఆ! వింటాడని నాకేం నమ్మకంలేదు."

"ఏమోనండీ. వింటాడేమో! అయినా, కట్నకానుకల విషయం ఏమైనా ప్రసక్తి వచ్చిందా?"

"అబ్బే! ఇంకా రాలేదు. అయినా మనం ఈ సంబంధం విషయంలో కొత్తపద్ధతి అవలంబించాలి. కట్నకానుకల వూసే ఎత్తొద్దు. ఏమో? వాళ్ల మనస్సులో ఏముందో? మనం నోరు విడిచి అడిగితే, లక్షో. రెండు లక్షలో మన మొహాన పారెయ్యొచ్చు అప్పుడు వాళ్ల తాహతుకు తగినట్లు మనం పిల్లకి ఏమైనా పెట్టాలంటే? మనతరమా? అసలలాంటి పట్టింపులకు పోతే, సంబంధమే చెడిపోవచ్చు ఆయనకు ఒకర్తే కూతురంట! ఆస్తంతా ఆ అమ్మాయికే ఇస్తాడట ఒకవేళ ఇంకా పిల్లలు పుట్టినా, ఈ అమ్మాయి వాటాకి వచ్చేది, చాలా ఉంటుందట"

"అవన్నీ నిజమే ననుకోండి " అని సత్యవతి ఏదో అనబోతుంటే మేడమీద అడుగుల చప్పుడైంది ఆత్రుతతో దంపతు లిద్దరూ మేడ మెట్లవైపు చూశారు (సశేషం)

# సినీ విహారం

14–వ పేజీ తరువాయి

మార్చి 10 వ తేదీ సాయంకాలం బొంబాయి తారలు ఇక్కడకు రాగానే దక్షిణ భారత ఫిలిం జర్నలిస్టుల సంఘం ఈ క్రికెట్‌తార లందరినీ హోటల్ సవోయ్ (ఇండియా) లో సత్కరించింది.

ఈ క్రికెట్‌ఆట ఏర్పాటులో రెండు మహత్తరమైన ఆశయా లున్నాయనీ, ఒకటి కేన్సర్ ఆసుపత్రి నిధిసేకరణ, మరొకటి దక్షిణ, ఉత్తర ప్రాంతాల తారలందరూ తరుచు సమావేశం కావటానికి ఇది ప్రారంభం అనీ దిలీప్ కుమార్ ఆ సభలో ప్రసంగించాడు. నిజమే. పదేళ్ల తరువాతగాని ఈ సమ్మేళనం సంభవించలేదు. తారల్లో ఉత్తరాది తారలు, దక్షిణాది తారలు అనే ప్రాంతీయ సరిహద్దులు లేవనీ, కళాకారులు ఏ మూలనున్నా అంతా ఒకరేననీ నిరూపించుకునే ప్రయత్నం ప్రశంసాపాత్రంగా కనుపించింది.

బ్రిటిష్‌వారు ఇండియాను విడిచి వెళ్లిపోతూ దిగబెట్టిన వారసత్వపు ఆస్తి ఈ క్రికెట్ ఆట. ఆనాటినుంచి ఆ ఆట అంటే భారతదేశం జనాభాకు ఆసక్తి విపరీతంగా పెరుగుతూ ఈనాటికి క్రికెట్ ఆటలో బ్రిటన్‌కంటె పైచెయ్యి తనదేనని ఇండియా నిరూపించుకుంది. అయితే ఆ ఆట ఎన్నడూ ఆడవాళ్లచేతుల్లోకి ఏ దేశంలోనూ వెళ్లలేదు. ఫుట్‌బాల్, హాకీలు మహిళలవశం అయినవికాని, క్రికెట్‌మాత్రం పురుషలక్షణం గల ఆటగానే చెలాయించుకుంటూ ఉంది. కాని, తొలిసారిగా ఆ ఆటను ఆడిన మహిళలు సినిమా తారలే కావటం ఒక విశేషం.

ఇన్ని విచిత్రాలు సమావేశమైన ఈ క్రికెట్ ఆట మదరాసు స్టేడియంలో ఈనెల 11 వ తేదీన ఉదయం పదిన్నరగంటలనుంచి సాయంకాలం 5 గంటలవరకూ ఏకధాటీ వినోదంగా సాగింది. ఈ ఆటగాళ్లలో క్రికెట్ బేట్‌తో, బంతితో పరిచయంగల తారలు డజన్‌మంది మాత్రమే ఉండి ఉంటారు. కాలేజీచదువులు వెలిగించిన వెలుగులకు మాత్రం క్రికెట్ అనుభవం లేకపోయినా ఆ ఆటకాణీ సుపరిచితమైన ఉంటుంది. మిగిలినవాళ్లందరికీ ఆ ఆట నిజంగా వేడుకే. వెండితెరమీద వినోదం అందించటమే ఉద్యోగంగాగల ఈ తారలందరికీ క్రికెట్ ఫీల్డుపై కూడా వినోదం అందించటం అంటే ఉగ్గుపాలతో నేర్చిన విద్యగా కనబడింది.

ఆ ఒక్కరోజున ఈ తారలందరూ చలనచిత్రనిర్మాణ కర్మాగారాలకూ, పాత్రలకూ దూరంగా వచ్చేసి, క్రికెట్ ప్లేయర్స్ దుస్తులను మాత్రం ధరించి విచ్చలవిడిగా వినోదం అందించి ప్రేక్షకులనేకాకుండా తమకు తాము ఉల్లాసాన్ని అందించారు; అందించుకున్నారు.

ఆట ప్రారంభానికి ముందు ఈపోటీ నిర్వాహకులు మహమ్మద్ అలీదంపతులు తారలను మంత్రి శ్రీ సుబ్రహ్మణ్యంగారికి పరిచయం చేస్తూ

50-వ పేజీ చూడండి



అమృతకళా ప్రొడక్షన్స్‌వారి 'ఇద్దరు కొడుకులు'లో సరోజాదేవి, అశోకన్.

చిత్రసమీక్ష

# ఇద్దరు కొడుకులు

తను పోలీసు ఉద్యోగి. తన అన్న, ప్రియురాలి తండ్రి, దుండగులు, హంతకులూ, దొంగ వ్యాపారులూ అని తెలిసింది. అత డేంచేయాలి? బంధుత్వం గొప్పదా, విధ్యుక్త ధర్మమా? ఇవేవీ కావు. కర్తవ్యం అమ్మమాట మీరకపోవటం. అదే తమిళంలో 'తాయ్ సొల్లై తట్టాదే', తెలుగులో అమృతకళావారి "ఇద్దరు కొడుకులు."

ఒకానొక పోలీసు ఉద్యోగి తండ్రిని బాంకర్, దొంగ వ్యాపారి, మాధవయ్య (ఎం. ఆర్. రాధ) హత్య చేస్తాడు. ఆ మాధవయ్య కూతురునే (సరోజాదేవి) పోలీసు ఉద్యోగి (ఎం. జి. రామచంద్రన్) ప్రేమిస్తాడు. పోలీసు ఉద్యోగి అన్న తమ్ముడిపాలిటి 'విలన్' ఐపోయి తమ్ముడి ప్రియురాలిని చెర పట్టాలని ప్రయత్నిస్తాడు. అమ్మ మాట విన్న పోలీసు ఉద్యోగి అమాంతం అన్నతో పోట్లాడి ప్రియురాలిని విడిపించుకోటం, ప్రియురాలి తండ్రి పోలీసులకు పట్టుబడగా, అన్న విషవాయువల్ల మరణించటంతో కథాంతం.

నటీనటు లందరూ వీలైనన్ని 'ఫ్రేముల్లో' చక్కగా కనిపించేందుకు యథాశక్తి ప్రయత్నించారు.

తర్జుమా సాహిత్యం కూర్చిన గబ్బిట వెంకటరావు రచనలో 'పాట ఒకే పాట' అనే పాట, 'పట్టుచీరా జీరాడ' అనే పాటా వినసొంపుగా ఉన్నాయి.

ప్రతి ఫ్రేము చక్కగా కనపడే ఛాయాగ్రహణం, ఫరవాలేదనిపించే సంగీతం, (ఎల్. మల్లేశ్వరరావు), సాహిత్యం గల ఈ చిత్రం తర్జుమా ఎలా ఉంటే ఏం అనుకుంటే తెలుగు ప్రజలు ఆదరించే అదృష్టం పట్టవచ్చు. "దాన్నే అంటారు ముఖాత విందం" అని.

—నాగరాజ్.



బాబూమూవీస్‌వారి 'మంచి మనసులు'లో నాగేశ్వరరావు, వాసంతి.



శ్యామప్రసాద్ 'మూవీస్‌వారి స్వర్ణగౌరి'లో హేమలత, కృష్ణకుమారి.

# సినీవిహారం

మాలాలంకృతుల్ని చేశారు. అనంతరం తారాగణం పాతికవేల అభిమానులు అందరికి దగ్గరగా ''పెరేడ్'' చేసి వారి హర్షధ్వానాలను అందుకున్నారు. పది నిముషాలు ఆలస్యంగా వచ్చిన పద్మశ్రీ అశోక్ కుమార్‌ని అభిమానులు మరింత స్వంతంచేసుకుని ఆతని కరస్పర్శలకు నోచుకున్నారు.

ఐదుగంటలసేపు సాగిన ఈ ఆట ప్రతిక్షణం ప్రేక్షకలోకానికి చిత్రాతిచిత్రంగా వినోదకరంగా సాగింది. హాస్యనటులు ఆటలో హాస్యం చూపించారు; హీరోలు, హీరోయిన్‌లు, విలన్‌లు అంతా కమేడియన్స్‌గా మారిపోయారు. క్రికెట్ ఆట సూత్రాలన్నిటినీ విచ్చలవిడిగా అతిక్రమించటంలో ఒక్కొక్కరు పోటీపడి చూపరులకు చక్కలిగింతలు పెట్టారు.

(బౌల్) విసరబడిన బంతి వికెట్లమధ్యనే తుళ్లిపడటం, కొట్టబడిన బంతి మూరెడునుంచి బారెడుమాత్రం దొర్లటం, కొంచెం కంగారుగా పరుగెత్తే బంతిని కాలితో ఆపడం, దానిని బౌండరీ వరకూ వెళ్లినట్లు చేతితో మోసుకుపోవడం, వికెట్ కీపర్ అంటే వికెట్లను చూస్తూ పడుక్కోవటం మహిళాతారలు క్రికెట్‌ను నూరుపాళ్ల బంతులాటలా ఆడటం ఆనాటి తమాషాలు.

ఈ తమాషాలను అసమానంగా అందించిన తారల్లో చంద్రబాబు, జోహార్, ఆగాలు అగ్రతాంబూలం స్వీకరిస్తారు. క్రికెట్‌ఆట పావుగంట జరిగిందో లేదో తోడితారలందరూ అలసిపోయారని చంద్రబాబు ఒకే ఒక కూల్‌డ్రింక్ సీసాను ఫీల్డింగ్, బాటింగ్ చేస్తున్న తారలందరి దగ్గరకూ వెళ్లి ఒక్కొక్క గుక్కెడు దాహం తీర్చడం చాలా వినోదం కలిగించింది. ఆతరువాత ఆటలో దెబ్బతగిలినవాళ్లకోసమని స్ట్రెచర్ స్టేడియంలో ఉంటుంది. దానిని మోసుకొచ్చి వికెట్ దగ్గర తీరుబడిగా పడుక్కున్న ఆగాను కాజ్వోలు 'కాజుయాల్టీ'గా తీసుకుపోదామనుకున్నాడు.

రాజ్ కపూర్ జెమినీగణేశన్‌లు ఒక్కొక్క తారనే ''బేటింగ్' చేయుటానికి తీసుకువెళ్లడం, ఔట్ అయినవారిని పెవిలియన్‌కు తీసుకురావటం చాలా స్పోర్టివ్‌గా వినోదం పుట్టించింది. శివాజీ గణేశన్, రమణమూర్తి, హర్‌నాథ్ రాజా, బౌలింగ్, ఎస్. వి. రంగారావు, సావిత్రి బాట్స్‌మన్, వుమన్ జంట ఆట చిరస్మరణీయంగా ఉన్నవి. ఐ. ఎస్. జోహార్ ఔట్‌కాగానే అంపైర్‌కాళ్లపైబడి శరణువేడటం, జానీవాకర్, ఆగాల మిమిక్రీ, అంతకంటె ముఖ్యంగా జమున, వాసంతి, రాగిణి, వహీదా, సావిత్రి, రాజసులోచనల క్రికెట్ దుస్తులు చూడ ముచ్చటగా ఉన్నవి.

బొంబాయి తారలకు ఇటువంటి వేడుకలు అలవాటైంది. మనతారలే వెనకబడి ఉన్నారు. క్రికెట్ మాత్రమే కాకుండా ఇటువంటి నిధుల సేకరణలకు వివిధ వినోద ప్రదర్శనలు, గాన,

---

'గుండమ్మకథ'లో విజయలక్ష్మి.

నృత్య, నాటకప్రదర్శనలు కూడా దక్షిణభారత తారలు ఏర్పాటుచేయటం ప్రారంభించాలి.

ఇంక స్టేడియంనుంచి స్టూడియోవిహారానికి వస్తాను.

## యువతి నిర్ణయం

ఆ ఇల్లు పల్లెలో కమ్మరం చేసేవారి ఇల్లులాగే ఉంది. ముందు పొలులోకి ఒక యువకుడు చాలా కోపంగా ఒక యువతిని బరబరా లాక్కొచ్చి పడేశాడు. అతని కోపాగ్నికి కారణం ఆమెనడవడికలో రవ్వంత పొరపాటు కలిగినట్లు అతనికి అనుమానం కలగడమే.

స్వయంగా, స్పష్టంగా వేణు ఆమెను మరొక పరాయి యువకునితో సరసమాడటం చూశాడు; సహించలేక దహించుకుపోయింది అతని మనస్సు. ఆమె వేణుకి అన్నగారి కూతురు; పేరు జయ.

జయ మంచిపిల్లే. అందులో అతనికి సందేహం లేదు. కాని, వయస్సు ప్రభావానికి లొంగిపోతోం దేమోనని భయం అతనిలో కలిగిన మరుక్షణంలోనే ఆమెకు నీతి బోధించాలని నడుం కట్టాడు.

"చిన్నాన్నా! ఆయన నీకు పరాయివాడు కావచ్చు. నాకాక్కడు" అని ఆమె అనేసరికి అతనిలో ఆవేశం ప్రతిలిప్తకు పెరగటం ప్రారంభించింది.

"ఆయన నాభర్త. నాకు కాబోయే భర్త" అని ఆమె చాలా స్పష్టంగా చెప్పేసరికి అతను మరింత



బాబూమూవీస్‌వారి 'మంచి మనసులు'లో జానకి.

# వస్మోల్



వస్మోల్ను ప్రతి రోజు వాడండి. అది నెరసిన జుట్టును నల్లగా ఉండేలా చేయును. మీరు యువ్వనవంతముగా కనపడతారు మరియు ఆ అనుభవమును పొందుతారు.

జ్ఞాపకముంచుకోండి, కేశములను నల్లగాచేసే వస్మోల్ ఒక్కటే అన్నిప్రకారము పనిచేస్తుంది.

మూనె మరియు పోమేడ్ రూపములో అన్ని దుకాణములలోను లభిస్తోంది.

ఎన్నో చోట్ల లక్షలాదిమంది వాడుతున్నారు



---

# కుటుంబము అంతకీ...

కాల్గేట్ ఆల్ - పర్పస్ టాల్క్లో వింతైన పుష్పముల చాలసేపు ఉండే పరిమళము లభిస్తుంది



పొడుపు మరియు పేరుగాంచిన కాల్గేట్ నాణ్యత....



స్నానానంతరము, దుస్తులు ధరించే ముందు మరియు వీధిలోకి వెళ్లునపుడు, కాల్గేట్ టాల్క్ను మీ ఒళ్లంతా జల్లుకోండి....



మృదువైన మరియు సౌమ్యమైన యీ పౌడరు పాపాయి లేత చర్మమునకు దివ్యమైనది.




## కాల్గేట్
## ఆల్-పర్పస్ టాల్క్

CAPT G I TEL

---

## డాక్టర్ వృత్తి చేయండి!

ఇంటిలో విరామంగా కూర్చొని వుండేప్పుడు, పోస్టల్ ట్యూషన్ ద్వారా, హోమియోపతి చదువుకొని, గవర్నమెంటురిజిస్టర్డు కాలేజిద్వారా డిప్లొమా పొందండి. ప్రాస్పెక్టస్ ఉచితము. వివరములకు వెంటనే వ్రాయండి.

INDIAN HOMOEOPATHIC COLLEGE
(APW) JULLUNDUR CITY

---

## శ్రీబాలాంజనేయ ప్రశ్న

సంతానము, రోగములు, గ్రహబాధలు, వివాహం, పారిపోయిన పశువులు, మనుష్యులయొక్క ఆచూకీ, దొంగిలించిన సొమ్ము, వీడిపోయినభార్య మీరు కోరిన 5 ప్రశ్నలకు వెంటనే వ్రాసి పంపగలను. రూ 2 ఎం.ఓ. చేయండి. నెలలవారీగా 12 నెలలకు 1 సంవత్సరం జాతకము రూ 2. పూర్తి పేరు, జాబు వ్రాసిన టైము తెలిపిన చాలును.

హనుమాన్ జ్యోతిషాలయము,
10వ లైను, అరండల్ పేట, గుంటూరు 2.

---

## RATNAM'S N-OIL

(పైపూతకుమాత్రమే)

అంగవరములు బలహీనత చెంది. చిన్న దినచో తిరిగి యథాప్రకారం అయి పూర్తి సౌఖ్య మనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి కలది. 1 సీసా రూ. 10 లు వి. పి. 1-4-0 కావలసినవారు ముందుగా 1-4-0 పంపేది. ఇంగులో స్పెషల్ రకం అర్ధంటుకునకు రూ. 25-0-0 లు.

డాక్టర్ రత్నం సన్స్, (Estd 1904)
సులక పేటబిల్డింగ్స్, ఆజంపురాగార్డెన్ దగ్గర, హైదరాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)

---

## ఉచితము

కామశాస్త్రము, సామాన్య విజ్ఞానము, సాముద్రికము, జ్యోతిషము గూర్చిన పుస్తకముల లిస్టుకు మీ అడ్రసు గల స్టాంపు అంటించిన కవరుతో మాకు వ్రాసిన ఉచితముగా పంపగలము. మీకు కావలసినవాటికి వ్రాయండి.

VERMAN & Co..
P. B. 51 (A) SAHARANPUR,
U. P.



"ప్రాణస్నేహితులు"లో కృష్ణకుమారి.

# సినీవిహారం

రెచ్చిపోయి "జయా! ఏమిటి నువ్వంటున్నది? నువ్వు కుమార్‌ని పెళ్ళి చేసుకుంటావా?" అని ప్రశ్నించాడు.

"ఏం? చేసుకోకూడదా?" అని జయ ఎంతో ధైర్యంతో పినతండ్రికి జవాబిచ్చింది.

"ఆవేశంలో మాట్లాడుతున్నావా? ముందూ వెనకా ఆలోచించావా? నిన్నతను ఆఖరువరకూ ఏలుకుంటాడా? లేదమ్మా! లేదు. అతని సంగతి నీకు తెలియదు" అని పితృవాత్సల్యంతో నలిగిపోతూ జవాబిచ్చాడు వేణు.

ఆ అమ్మాయి ప్రేమించిన వ్యక్తి కుమార్ కుమార్ అంటే క్రూరుడని లోకం ఏనాడో తీర్పుచెప్పింది. అయితే ఆమె కంటికి, మనస్సుకి అతని క్రౌర్యం కనబడలేదు. అంచేత ఆమె నమ్మకాలు వేరుగా మొలకలెత్తాయి.

"నాక్కాదు చిన్నాన్నా! నీకే తెలియదు. ఆయన మనకెంత సహాయం చేశారో నీకు తెలియదు" అని ఆమె వాదన. అతనికి కనువిప్పుగా కనబడటం లేదు. ఆమె ఇంకా చెబుతూనే ఉంది:



"భీష్మ"లో కృష్ణుడుగా హరనాథ్.



"గుండమ్మకథ"లో ఎన్. టి. రామారావు, ఎస్. వి. రంగారావు, నాగేశ్వరరావు.

# సినీ విహారం

నీ పరీక్షకు డబ్బు కట్టలేక నాన్న అల్లాడుతూంటే దేవుడిలా వచ్చి ఆదుకున్నారు."

ఆ సంగతి ఆతనికి తెలియదు; అంచేత ఆశ్చర్య పడ్డాడు: "నా పరీక్షలకు కుమార్ సహాయం చేశాడు" అని.

"చిన్నాన్నా! మనిషి మంచితనానికి డబ్బే కొలత బద్ద కాదు. నీకు తెలిసింది ఆ మనిషి మాత్రమే! నా కాయన మనస్సు కూడా తెలుసు" అన్నది జయ.

ఈ సందిగ్ధంతో నిండిన సన్నివేశం బాబూ మువీస్ చిత్రం "మంచిమనసులు" లోనిది. వేణుగా నాగేశ్వరరావు, జయగా వాసంతి రస వత్తరంగా నటించారు. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు, కామెరామన్ పి. ఎల్. రాయ్ సన్నివేశం కోరే తీక్షణతను కోణాల్లో చూపించారు. రచయిత : ఆచార్య ఆత్రేయ, అసోసియేట్ డైరెక్టర్, ఎడిటర్ టి. కృష్ణ బి. ఏ, సహాయ దర్శకులు పెండ్యాల ఆంజనేయులు, బి. ఏ స్వామి. కళ కృష్ణారావు, సౌండ్ మీనన్, స్టూడియో వాహిని, నిర్మాత సి. సుందరం.

## దుష్టచతుష్టయం ఎత్తులు

ఆ పెద్ద లోగిలిలోని హాలులో యజమానిఆతని మిత్రులు ముగ్గురు తీరుబడిగా కూర్చుని కుట్రలు పన్నుతున్నారు. ఆ ఇంటి నౌకరుకి మాత్రం వారు దురాలోచనపరులని ఎప్పుడో తెలుసు కాబట్టి వారికి ఎదురు చెప్పే స్వతంత్రుడుగా నిలబడ్డాడు.

ఈ ఐదుగురి వయస్సూ ఐదుపదులు దాటి నట్లే ఉన్నారు. అంతా ముసలిరూపుల్లో ఉన్నారు. బుద్ధులుకూడా పురాతనంగానే వాసనకొడుతున్నాయి. ఆ ఇంటి యజమాని దౌష్ట్యాలెన్నో చాలావాటిని అనుభవించిన నౌకరు యథా ప్రకారం ఆరోజునా యజమానికి ఎదురుమాట చెప్పాడు. ఒకేయ్ డిస్మిస్ చేస్తానని ఆయన

వెదిరించాడు. అదేదో త్వరగా చెయ్యండి. వెలజీతం ఎంతో తెలుస్తుందని జవాబిచ్చి ప్రేక్షకుల్ని నవ్వించాడు నౌకరు.

ఇంత వారి ప్రసంగం మరొక మోతుబరి మీదకు వెళ్లింది. "ఊళ్లోవాళ్లందరిదగ్గరా చందాలు వసూలుచేస్తున్నాట్ట" అని ముసలి నక్క పలకగానే ఆ యజమాని "ఏమిటేమిటీ ? స్కూలా ? మనకి పెద్ద డేంజర్ కదటయ్యా" అని కార్యక్రమం సూచించాడు. "అదే నే చెబుదా మనుకున్నాను. మీరు చెప్పేశారు." అని వంత పాట పాడాడు మరో ముదుసలి.

ఈ ముదివగ్గుల సభ ఆర్. ఆర్. పిక్చర్స్ చిత్రానికి చెందినది. నాగభూషణం, బాలకృష్ణ, అల్లు రామలింగయ్య, మహంకాళి వెంకయ్య దుష్ట చతుష్టయంగాను, నౌకరుగా పద్మనాభం చక్కగా నటించారు. ఈచిత్రానికి దర్శకుడు టి. ఆర్. రామన్న; రచన : ఆచార్య ఆత్రేయ, కామెరా : రహమాన్, సౌండ్ : వళనిబాబు, సహాయ దర్శ కుడు : శర్మ. ఈ చిత్రంతో ఎన్. టి. రామారావు, రమణమూర్తి, బి. సరోజాదేవి, శారద, టి. ఆర్. రాజకుమారి, ఛాయాదేవి ప్రధానపాత్రలు నిర్వహిస్తున్నారు.

## బుడుగు 'దాగుడుమూతలు'

బుడుగు కథారచయిత, వ్యంగ్యనవలారచయిత శ్రీ ముళ్లపూడి వెంకటరమణ, డి. బి. ఎన్. వారితో కలిసి ఆంధ్రావనితో "దాగుడుమూత" లాడబోతున్నాడు.

డి. బి. ఎన్. ప్రొడక్షన్స్‌వారి ఆధ్వర్యంలో జరిగే ఈ "దాగుడుమూతల్లో" ఎన్. టి. రామారావు, రేలంగి, రమణారెడ్డి, సూర్యకాంతం, ఆదుర్తి సుబ్బారావు ( దర్శకత్వం ), ముళ్లపూడి వెంకటరమణ ( కథ, మాటలు ), ప్రసాదరావు ( సంగీతం ), కృష్ణారావు ( కళ ), ప్రభృతులు పాల్గొంటారు. ★



"సిరిసంపదలు"లో రేలంగి

# మనమూ-మనదేహస్థితి

15-వ పేజీ తరువాయి

ప్రక్క వెలిగే దీపా లన్నింటినీ ఒక్క ఎలక్ట్రిక్ తీగె కలిపినట్లు ప్రాణులన్నిటినీ కలిపే దేదయినా ఉన్నదా? ఉంటే అది ఏది? అటువంటిది ఉన్నా ఒకేరకం దీపాలన్నీ ఒకేకాంతితో వెలిగినట్లు అన్ని ప్రాణులూ ఒకేలా వ్యవహరించరేమి? ఇది దేహాల్లో భేదమా? దేహంలో ప్రవేశించి ఆడించే ప్రాణశక్తిలో భేదమా? ఈ భేదానికి కారణమేమిటి? సృష్టిపరిణామమే అయితే, లక్ష సంవత్సరముల నాడు మానవదేహం ఇప్పుడున్నట్లే ఉన్నదా? లేక వేరుగా ఉన్నదా? లక్ష సంవత్సరముల తర్వాత ఇప్పుడున్నట్లుగానే ఉంటుందా? వేరుగా ఉంటుందా? లక్ష సంవత్సరములనాడు మానవుల నుండి మానవులు ఉత్పత్తి అయ్యే విధానం ఈనాటి లాగే ఉన్నదా? లేక, 'హైడ్రా' అనే సూక్ష్మజీవి శరీరంనుంచి మొగ్గ లేర్పడి, వూడి, జీవు లయినట్లుగా శరీరఖండములనుండి జీవులు ఉత్పత్తి అయ్యేవారా? ఆనాటి ప్రాణ్యభివృద్ధి విధానములను (Reproductive Methods) ఊహించ డానికి మన కాధారము లేమిటి? శిశూత్పత్తికి కారణభూతములయిన, శుక్లశోణితకణముల కలయిక శరీరబాహిరములయిన ప్రదేశములలో జరుగగలదా? జరిగి జీవిగా వృద్ధిచెందగలదా? ఈ ప్రశ్నలూ, ఇటువంటి ప్రశ్నలూ, బుద్ధి ఏర్పడి నప్పటినుంచీ మానవులను ఎదుర్కొంటూనే ఉన్నవి. ఎదుర్కొంటూనే ఉంటవి? ఈ ప్రశ్నలు ఈనాటివి కావు. వీటికి సమాధానం తెలుసుకొంటానికి మానవుడు చేసిన, చేస్తున్న, చేయబోతున్న ప్రయత్నఫలితమే విజ్ఞానము. పై ప్రశ్నలు కపిల కణాదాది మహర్షులనూ ఎదుర్కొన్నవి, ఈనాడు ఎలెక్సికెరాల్ వంటి శాస్త్రజ్ఞులనూ ఎదుర్కొంటున్నవి. జిజ్ఞాస, గవేషణ (Research) అన్నవి, ఈనాటివి కావు. ఒక జాతికి గాని, ఒక కాలానికిగాని పరిమితములైనవి కావు. అసాధారణమైన సంఘటన, ఏదయినా బుద్ధిమంతుల దృష్టిని ఆకర్షిస్తుంది. దీని ఫలితంగా వారిలో 'గవేషణ' ఆరంభ మౌతుంది. ఆ ఉద్యమంలో వారు ఉపయోగించే పరికరములూ, సాధనములూ ఆకాలమునుబట్టి ఉంటవి. వారి బుద్ధిశక్తినిబట్టి ఆ సంఘటనకు వారు కారణం కనిపెట్టారు అప్పు డది వైజ్ఞానికసత్య మవుతుంది. కనిపెట్టలేని వాడు అది మానవమైన రహస్యంగా ఉండిపోతుంది. కారణంలేని కార్యం అంటూ ఉండదు. విశ్వసంఘటనలన్నింటికీ ఏదో కారణం ఉండే తీరాలి. ఆ ప్రశ్నకు కపిల కణాదాది ఋషులు తమకు తోచినట్లు సమాధానం చెప్పేరు, ఈనాటి శాస్త్రజ్ఞులూ తమకు తోచిన సమాధానం చెబుతున్నారు. కపిల కణాదుల నాడూ, వస్తువు, శక్తి (Matter & Energy) ఊహింపబడ్డవి. పూర్వులు వీటిని ప్రకృతీ పురుషుడూ అన్నారు—ఇవి మొదట్లోనే రెండా? లేక ఒకదానినుంచి ఉద్భవించిన రెండు వస్తువులా? అన్న ప్రశ్నకు ఆనాడూ ఏకైక సమాధానం లేదు. ఆధునిక విజ్ఞానం యీనా డున్న స్థితిలో, వస్తువూ, శక్తీ పరస్పరసంబంధం ఉన్న రెండు సంభావనలు (Conceptions). వస్తువులను ఆశ్రయించి శక్తి ఉన్నది. శక్తిని ఆవరించి వస్తూవున్నది. ఒక జీవకణమైనా వస్తుఖండమే, జీవకణంలో వుండే దుర్భిణులకందని సూక్ష్మాతిసూక్ష్మకణములయినా వస్తుఖండములే. వేదాంతములు సంభావించిన తన్మాత్రలయినా వస్తుఖండములే. అన్నింటిలోనూ ప్రాణశక్తి ఉన్నది. కాని, మనం, మన ఇంద్రియములద్వారా గ్రహించి పరిశీలించగల ప్రాణశక్తి కొన్నింటిలోనే ఉన్నది. వాటినే ఆధునిక విజ్ఞానం జీవించేవి (Living) అనీ, మిగతావాటిని జీవించనివి (Nonliving) అనీ విభజించింది. విజ్ఞానం ఆధునికమైనకొద్దీ ఈ విభేదం సన్నగిల్లిపోతుందేమో!

అనేక కారణములచేత, ప్రాచీనులు ప్రాణశక్తిని గురించి తెలుసుకుంటానికి చేసిన సాధనములూ, వాటిద్వారా వారు నిరూపించిన సత్యములూ, సంస్కృతభాషాంతర్గతములూ, అల్పసంఖ్యాకులకు హస్తగతములూ అయి సామాన్యులకు తెలియకుండా పోయినవి. కాని అనేక పాశ్చాత్య తత్వజ్ఞులు, శాస్త్రజ్ఞులు సంస్కృత భాష నేర్చుకుని, వాటిని అర్థంచేసుకుని అధిక వ్యయంతో అతి సంక్లిష్టములయిన సాధనములతో దీర్ఘగవేషణతో తాము నిరూపించిన సత్యములను "ప్రాచీనులయిన ఋషులు ఏనాడో నిరూపించారు" అని తెలుసుకుని, నిజమయిన విజ్ఞానవేత్తలు, విజ్ఞానవేత్తలను మెచ్చుకోవలసిన రీతిగా మెచ్చుకొని, ఋషులు రచించిన గ్రంథములను తమ భాషలలోకి అనువదించుకున్నారు. ప్రకృతీ పురుషుల విషయంలో, ఋషులమధ్యా ఏకాభిప్రాయం లేదు; ఆధునికశాస్త్రజ్ఞుల మధ్యా లేదు. ఐన్‌స్టైయిన్ వంటి శాస్త్రజ్ఞుడు, వస్తువుకూ, శక్తికీ మధ్యఉన్న సంబంధాన్ని ఒక గణితసూత్రంద్వారా నిరూపించాడు. అది E=MC2, ఇక్కడ 'E' అన్నమాట 'ఎనర్జీ' కి చిహ్నము. ఎనర్జీ అంటే శక్తి. 'C' అన్న అక్షరం కాంతికిరణం ప్రయాణ వేగము. కాంతి సెకండుకు 180,000 మైళ్ల వేగంతో ప్రయాణం చేస్తుందని శాస్త్రజ్ఞులు అంచనావేశారు. అంటే ఒక గ్రాము పరిమాణంగల వస్తువులో శక్తి = గ్రాము × 180000 × 180000 గుణకము అన్నమాట!

మన పూర్వులు "అణోరణీయాన్ మహతో మహీయాన్" అన్నారు. "అణువు చితికితే అణి వస్తుంది. అది ఈ భూమికంటె శక్తివంతమయినది" అని. ఇన్ని సాధనముల సహాయంతో కలిగిన అణువిజ్ఞానమును, వేల సంవత్సరముల నాడు, కేవలం బుద్ధివిశేషంతో ఊహించిన ఋషుల విజ్ఞానము ఏ బుద్ధిమంతుడయిన శాస్త్రజ్ఞణ్ణయినా దిగ్భ్రముణ్ణి చేస్తుంది. కాని కొందరికి విజ్ఞానమంటే పాశ్చాత్యవిజ్ఞానం మాత్రమే. అల్లాగే మరికొందరికి ఆధునిక విజ్ఞానం విజ్ఞా

వమే కాదు. ఈ ఉభయవైఖరులు సరి అయి నవి కావు. ప్రాచీన విజ్ఞానం కేవలం దేహ శక్తిని యోగసాధనతో అధికం చేసుకుని సాధిం చింది. ఆ శక్తి సామాన్యులందరికీ అలవడదు. ఆధునిక విజ్ఞానం అనేక సాధనములతో ఏర్పడ్డది. దాని ఫలితములను మనం ఇంద్రియములద్వారా చూచి అనుభవించవచ్చును. కాని ప్రాచీనులయినా అర్వాచీనులయినా విజ్ఞానులు నిరూపించిన సత్యము లన్నీ ఒక్కటిగానే ఉన్నవి. ఆధునిక విజ్ఞానం సరి అయినదని నిరూపించినప్పుడుగూడా ప్రాచీన విజ్ఞానాన్ని మెచ్చుకోలేనివారు, ఆత్మనింద, పరో త్కర్ష, భావదాస్యమూ మూర్తీభవించిన మహా శయులు.

ప్రయోగ నిర్ధారితములయిన అనేక సత్యముల సముదాయమే విజ్ఞానము. దానికి ప్రాచీన, అర్వా చీన, పూర్వ అధునిక విభేదములు ఉండవు; ఉండ రాదు.

విజ్ఞానం, శుద్ధ విజ్ఞానమనీ ఔపయోగిక విజ్ఞానమనీ రెండురకములు. (Pure and Applied Sciences) జీవితంలో నిత్యమూ ఉప యోగపడే విజ్ఞానం, ఔపయోగిక విజ్ఞానం. అన్ని విజ్ఞానముల కలయికతో వైద్యవిజ్ఞానం ఏర్ప డింది. అన్నివిజ్ఞానముల మూల సూత్రములూ తెలుసుకొంటేనేగాని శరీర విజ్ఞానం అర్థం కాదు. జీవితాన్ని గురించీ, ప్రాణశక్తినిగురించీ తెలుసుకుని శరీరం ఆరోగ్యంగా, దీర్ఘకాలం జీవించ డానికీ, ప్రకృతిని స్వాధీనం చేసుకుని సుఖించ డానికీ పూర్వులు అనేక సాధనములు సూచించారు. అవన్నీ ఊహాగానములు కావు. ఆధునిక విజ్ఞాన సహాయంతో ఆసూచనలు సరిఅయినవో కావో నిరూపించి, సరిఅయినవైతే వాటిని సాధించ డానికి పునః ప్రయత్నంచేయడం ఎంతైనా అవసరం. ఈనాడు నెత్తురుపోటుకు వినియో గించే "సర్పగంధ' ప్రపంచానికి ఆయుర్వేదం సమర్పించిన కానుక. నగరాల్లో, పత్రికావిలేఖరు లనూ, శాస్త్రజ్ఞులనూ దిగ్భ్రమలనుచేసే సత్య సాయి, పద్మిమలైస్వామివంటి యోగు లెందరో, యోగ శక్తినీ, మంత్రశక్తినీ నిరూపిస్తున్నారు. వారు ఇచ్ఛామాత్రంచేత ఏ వస్తువు కావాలంటే, ఆ వస్తువును సృష్టించగలరు. ఏ లోహాన్నయినా సృష్టించగలరు. ఇందులో రహస్యమేమీ లేదు. బహిరంగంగా వా రాపని చేస్తున్నారు విజ్ఞాని అయినవాడు, వారి కాశక్తి ఎల్లా లభించింది ? అని ఆలోచిస్తాడు. కుహనావిజ్ఞాని ఇదంతా ఏదో "హంబగ్" అని నిరసిస్తాడు.

దేహ ధర్మములను పరిశీలించి, దైహిక మానసిక అవసరములు సర్వులకూ సరఫరా అయ్యేటట్లుగా సంఘనిర్మాణమూ, సాంఘిక జీవితమూ ఏర్పడాలి. అల్లా జరుగనినాడు మానవజీవితం దుర్భరమై నశించిపోతుంది. విజ్ఞాన మెంత అవసరమో, మానవ శ్రేయస్సుకు మాత్రమే దానిని వినియోగింపజేసే వివేకమూ అంతే అవసరము. శాంతినీ తృప్తినీ ఈయని విజ్ఞానం విజ్ఞానం కాదు. అశాంతి, అనే కాలూ అనారోగ్యానికి మూలకారణాలు. ఉద్రేకములతో, నెత్తురుపోటూ, కడుపులో పుళ్లూ ఏర్పడతవని అధునిక పరిశోధనలు నిరూపించినవి. ఆ విషయం జీర్ణకోశ వ్యాధులు చర్చిస్తున్నప్పుడు సోదాహర ణంగా వివరిస్తాను.

ఇంతవరకు ఆధునిక విజ్ఞానం శరీరేతర సాధన ములతో వస్తుపరిశోధన మాత్రమే చేసింది. కాని, అణువిచ్ఛేదనచేసిన తరువాత విజ్ఞానానికి పెద్ద గోడ ఎదురైంది. ఆ గోడ పగులగొట్టుకుని ముందుకు పోతేనే గాని విజ్ఞానవేత్త, ప్రాణశక్తి స్వరూప స్వభావములు నిరూపించలేడు. ఈనాడు ప్రతి సుప్రసిద్ధ శాస్త్రజ్ఞుడూ ప్రాణశక్తి మీదనే తన బుద్ధిని కేంద్రీకరిస్తున్నాడు. ఆ ఉద్యమం లోనే ప్రోటీన్ కణములో ఉన్న అణునిర్మితి విశేషమును గ్రహించాడు. కొన్ని అణువులు ఒక రకంగా చేరినప్పుడుగాని ప్రాణశక్తి ప్రసరణ జరగదని ఏనాడు ఆధునిక విజ్ఞానవేత్త గ్రహిం చాడో ఆనాడే విజ్ఞానపరిధి ఆధ్యాత్మిక పరిధి లోకి విస్తరించింది. ఈ పరిశోధన ఇతర పరి శోధనలవంటిది కాదు. ఇది ప్రాచీ నార్వాచీన విజ్ఞానముల మధ్య వంతెనవంటిది. సజీవ నిర్జీవ ప్రపంచముల మధ్య సరిహద్దు వంటిది. ఆత్మకూ పరమాత్మకూ, అండపిండములకూ, భూ ఖగోళ ములకూ, ప్రాణానికీ ప్రకృతికీ మధ్య ఉన్న సంబంధమును నిరూపించే సత్యసూచనివంటిది. ఈ ఉద్యమంలో ప్రాచీన విజ్ఞానం ఆధునిక విజ్ఞాన వేత్తలకు ఎంతో సహకరిస్తుంది. అందుకే ఆ విజ్ఞాన సముపార్జనకై సర్వ దేశాలవారూ సంస్కృత పీఠాలు స్థాపిస్తున్నారు. ప్రోటీన్ నిజస్వరూపము తెలుసుకున్ననాడు ప్రాణస్వరూపమునే తెలుసు కొంటాము. ప్రోటీనుకణమును నిర్మించగలిగిన నాడు, ప్రోటోప్లాజమునే నిర్మిస్తాము. మృత్యు వునే జయిస్తాము. సత్యాన్వేషులూ, దురభిప్రాయ రహితులూ, అయిన విజ్ఞానులు సాధించలేని దేదీ లేదు.

"మాన్పింది మందు. మాన్పేది వైద్యం." బాధ నివారించగలిగిన ప్రతి విషయమూ వైద్యశాస్త్రంలో భాగమే. గ్రుడ్డిగా దేనినీ నమ్మరాదు. ప్రయోగ రీత్యా దేనినీ పరిశీలించకుండా నిరసించనూ రాదు. ఈ వైఖరితో ప్రాచీన అర్వాచీన సంస్కృతులను మేళవిస్తే మన దేహస్థితి అర్థమౌతుంది. దేహంలో ఉండే లోపాలూ అర్థమవుతవి. ఆ లోపాలు సవ రించడంలో మనం సాధించగల విషయమ్మూ, ఆ విజయం యొక్క పరిమితులూ అర్థమవుతవి.

సాధారణ రసాయనిక వస్తువులనుండి దేహ ధాతువులలో నున్న ప్రోటో 'ప్లాజము' ప్రాణి దేహములో మాత్రమే తయారవుతుంది. యంత్రా గారాల్లో తయారుకాదు. జీవి, అత్యంతాదర్శం జీవించడం జీవించడానికి అత్యవసరమైనది. ధాతు విజ్ఞానం. వైద్యశాస్త్రానికయినా, రాజకీయాల కయినా, వేదాంతాని కయినా, యోగశాస్త్రాని కయినా, అర్థశాస్త్రానికయినా పరమావధి, జీవి జీవించడానికి సహకరించడమే. ప్రాణంతో ఉన్నంత మాత్రాన అది జీవించడమనిపించుకోదు. ★






# తెరవెనుక తారలు

13-వ పేజీ తరువాయి

కోవటం, అనుసరించటం మేకప్‌మన్ల విధులు. ఇవిగాక తల, మీసం, గడ్డాల విగ్గులు.

"భీష్మ" పాత్ర మూడు దశలలో చూపించవలసి వచ్చింది ఆచిత్రానికి కళాదర్శకుడు వాలి, దర్శకుడు బి. ఏ. సుబ్బారావుగార్లు వూహించుకున్న పాత్రను శ్రీ రామారావులో పీతాంబరం ఎలాసృష్టించాడో పరిశీలించవచ్చు. యవ్వనంపొంగులో ఉన్న గాంగేయుడు ఏవిధంగా కనబడుతున్నాడో, భీష్మ ప్రతిజ్ఞచేసిన త్యాగమూర్తిగా ఏవిధంగా కనుపిస్తున్నాడో, ఆచార్యుడు కురువృద్ధుగా ఏ మూర్తిత్వాన్ని అందుకున్నాడో మీరు తేలికగా పోల్చుకోగలరు కాని, ఆపాత్రకు జీవం అందించిన విధం అంత సులభంమాత్రం కాదు.

వార్ధక్యం సూచించడానికి, వికృతంగా ఉండాల్సిన ఆకృతుల్ని స్ఫురింపజేయటానికి ఒక నటుడికి ప్లాస్టిక్‌మేకప్‌చేసే ఆచారం అమలులో ఉంది. ఇందుకు నిదర్శనంగా ఈ వ్యాసంలోనే ప్లాస్టిక్ మేకప్‌తో ముసలి శబరిపాత్రను శ్రీమతి పండరీబాయిలో పీతాంబరం సృష్టించిన ఛాయాచిత్రం ప్రచురించబడింది ఆయనే భీష్ముడిపాత్రకు మాత్రం ముదివగ్గు ప్రాయంలో ప్లాస్టిక్ మేకప్ వేయకుండా మేక్స్‌ఫేక్టర్ రంగులతోనే సహజత్వాన్ని చూప్పించాడు. "గ్లామర్ బోయ్" శ్రీ రామారావులో మూడుదశల భీష్మ రూపాల్లోనూ గ్లామర్ తగ్గకుండా పీతాంబరం చేయుగల్గారంటే మేకప్ ప్రభావం, మేకప్‌మాన్ ప్రతిభ స్పష్టమౌతూనే ఉంటుంది.

పీతాంబరం స్వగ్రామం మలబార్‌లోని ఇరంజాలకుడు. అది త్రిచూర్‌కి దగ్గరగా ఉన్న పల్లెటూరు; కొబ్బరినూనెకు ప్రసిద్ధిచెందిన ప్రదేశం.

ప్రఖ్యాత చిత్రకారుడు శ్రీ కె. మాధవన్ స్వగ్రామంకూడా అక్కడే. పీతాంబరం చిన్ననాడు ఆయన బొమ్మలు వ్రాస్తూంటే ఏదో తెలియని ఆవేశంతో శ్రద్ధగా చూస్తూ గంటలు, రోజులు దొర్లిస్తూండేవాడు. శ్రీ మాధవన్ ఈ యువకుని ఉత్సాహాన్ని గ్రహించి అతనిని చెన్నపట్టణానికి తీసుకునివచ్చి న్యూటోన్ స్టూడియోలో భాగస్థుడు, కళాదర్శకుడు అయిన శ్రీ నాగూర్‌కు పరిచయం చేశారు. న్యూటోన్‌లో ప్రవేశం దొరికింది. మేకప్ శాఖాధిపతి హరిబాబుగారి దగ్గర పీతాంబరాన్ని శ్రీ నాగూర్ మేకప్ నేర్చుకోమని ఆదేశించారు. జీతం భత్యం లేకుండా కొన్నాళ్లు, అప్రెంటిస్ కొన్నాళ్లు పీతాంబరం ఆశాఖలో ఎనిమిది సంవత్సరాలపాటు పనిచేశాడు. గురుదేవుడైన హరిబాబుగారి వద్దనే శుశ్రూషచేసి పెద్దవాడయాడు. ఆయనే అతనికి గురువు.

వాహినీసంస్థ చిత్రాలన్నీ ఆస్టూడియోలో ఆరోజుల్లో నిర్మించబడుతూండేవి. వాహినీవారు సొంత స్టూడియో కట్టినపిదట మేకప్ శాఖాధిపతిగా హరిబాబుగారినే నియమించారు. పీతాంబరంకూడా గురువుతోబాటే వాహినీ స్టూడియోకి వచ్చి ఫస్ట్ అసిస్టెంట్‌గా పని చేయటం ప్రారంభించాడు.

విజయావారు వాహినీ స్టూడియోను లీజ్‌కు తీసుకోగానే శ్రీయుతులు నాగిరెడ్డి, చక్రపాణి గార్లు ఛీఫ్ మేకప్‌మన్ పదవిని పీతాంబరానికి అందించి ప్రోత్సహించారు. ఆనాటినుంచి ఇంతవరకూ పీతాంబరం అదే పదవిలో ఉంటున్నాడు. విజయాధిపతులతోబాటు శ్రీ కె. వి. రెడ్డి ప్రోత్సాహంవల్ల తాను పెద్దవాడయిన కృతజ్ఞత పీతాంబరంలో ఉంది. అందుచేత ఆ త్రిమూర్తుల్ని గురువులవలె అతను పూజిస్తాడు.

ఇటు సాంకేతికనిపుణులలో కొత్తవారికి చేయూతనివ్వటమే కాకుండా అటు నటీనటులలో కొత్తవారినికూడా విజయాసంస్థ ప్రోత్సహించింది. శ్రీయుతులు ఎస్. వి. రంగారావు, ఎన్. టి రామారావుగార్లు విజయాలో అడుగుపెట్టగానే ప్రప్రథమంగా వారు పీతాంబరం మేకప్ కుర్చీలోనే కూర్చుని రూపురేఖలను దిద్దుకున్నారు. ఈ నటద్వయానికి విభిన్నమైన వేషాలను మాయాబజార్, రాజా — పేద చిత్రాలలో ధరింపజేసిన ఘనతకూడా పీతాంబరానికే దక్కింది. అంచేత ఈ ముగ్గురూ పాత స్నేహితులైపోయారు

విజయావారు నిర్మించిన "మాయాబజార్" చిత్రంలో అందరి నటీనటులకు పీతాంబరం అలంకారాలు అందించాడు, మొట్టమొదటిసారిగా శ్రీ ఎన్. టి. ఆర్. కు కృష్ణుడు మేకప్ వేశాడు; ఘటోత్కచుడుగా పౌరాణికపాత్రలకు ప్రప్రథమంగా శ్రీ ఎస్. వి. రంగారావుకు మేకప్ చేశాడు; యవ్వనం పొంగే వయస్సులోని అభిమన్యు, శశిరేఖలుగా శ్రీ నాగేశ్వరరావుకి, శ్రీమతి సావిత్రికి మేకప్‌చేశాడు. రూపాల కళాకారుడుగా పీతాంబరానికి ఈ చిత్రం చాలా సంతృప్తినిచ్చినట్లు వెల్లడించాడు.

విజయాసంస్థ నిర్మించే చిత్రాలలోనే కాకుండా పీతాంబరం ఇతర నిర్మాతల తెలుగు, తమిళ చిత్రాలకు మేకప్‌మాన్‌గాకూడా పనిచేస్తూంటాడు. అంటే వందలకొలది చిత్రాలకు ఆయన మేకప్‌మన్ ఇప్పటికి.

ఆయనకు ఇప్పటికీ ఆనందాన్నిచ్చిన పాత్ర శిల్పనలు చాలా ఉన్నవి. "శ్రీ వేంకటేశ్వర మాహాత్మ్యం" చిత్రంలో శ్రీనివాసుడుగా శ్రీ ఎన్. టి. ఆర్‌ను అలంకరించి మురిసిపోయాడు; ఏడుకొండలవాడే ఆయన అనేభావం పీతాంబరానికీ కలిగింది. "దేవాంతకుడు" చిత్రంలో శ్రీ ఎన్. టి. ఆర్ ను మహిళామణిగా రూపొందించిన ప్రతిభ కూడా పీథాంబరానికే దక్కింది.

మాయాబజార్, మిస్సమ్మ చిత్రాలలో శ్రీమతి సావిత్రి అలంకరణకు, పరివర్తన, దొంగరాముడు, ఇద్దరు మిత్రులు (డబుల్ రోల్) లో శ్రీ నాగేశ్వరరావు, శ్రీ గుమ్మడి అలంకారాలకు పీతాంబరం సంబరపడుతూంటాడు. శ్రీమతి సావిత్రి, జెమినిగణేశన్‌లు నటించే తమిళచిత్రాల పాత్రలకు వారిరూపాల్నిఆనాటినుంచి నేటివరకూఎక్కువగా పీతాంబరమే తీర్చిదిద్దుతూంటాడు. శ్రీమతులు జానకి, శ్రీరంజనిలు తమ పాత్రల రూపురేఖలను పీతాంబరంవద్దనే తీర్చిదిద్దు కుంటూంటారు ★

# మనమూ-మనరాష్ట్రం

11వ పేజీ తరువాయి

దానిని అదుపులో పెట్టడం మునీశ్వరులకు కూడా సాధ్యం కాదు.

ఇంతకు ఆయన మనస్సు మార్చుకున్నది ఒక అల్లూరి విషయంలోనే గదా! అల్లూరి అంటే



శ్రీ కె. బ్రహ్మానందరెడ్డి.

తనకున్న భయ మేమిటో స్పష్టంచేసే ఉన్నారు. "నీవూ, నేనూ ఒకచోట ఉండటం నీకూ, నాకూ, రాష్ట్రానికీ క్షేమం కాదు. నీవు ఢిల్లీ నుంచి వచ్చినప్పుడు నన్ను ఇక్కడినుంచి పంపేశావు. అట్లాగే నేను తిరిగి రాష్ట్రానికి వచ్చినప్పుడు నిన్ను ఢిల్లీకి పంపడం నా ధర్మం" అంటూ తన రాజనీతిని వెల్లడించారు. భారత రాజకీయ శాస్త్రవేత్తలలో మూలపురుషుడు కౌటిల్యుడు. ఆయన ప్రవచించిన ధర్మ మేమిటి? శ్రీ సంజీవరెడ్డి ప్రకాశంగారి శిష్యులు, కళా వెంకట రావుగారి సహచరులు. మొదటివారిలో ఉన్న పట్టుదల, గాంభీర్యము, రెండవ వారిలో ఉన్న 'చాణక్య నీతి' వారికి అలవడింది. శ్రీ రెడ్డి చాణక్యనీతి ప్రత్యర్థులు గ్రహించారు. ఇక



శ్రీ పి. వి. నరసింహారావు.











# మనము–మన రాష్ట్రం

పాచిక పారదనుకుంటారేమో? అదేంలేదు. రేపు ఎలాగో నెహ్రూ, జగజ్జీవనరాంలు కల్పించుకొని 'శ్రీ సంజీవయ్యా నీవు సంజీవరెడ్డి మంత్రి వర్గంలో చేరు. లేదా కేంద్రానికి వచ్చెయ్'' అని చెప్పడం జరగవచ్చు. ఎందుకంటే, కాస్త మాట వినేవాడు ఆయనే గనుక. అప్పుడు శ్రీ నెహ్రూ అంతటివారి మాట నేనెలా కాదనగలను. ఇదివరకు ఆయన మాట వినే పోటీ విరమించాను. ఇప్పుడు



శ్రీ ఎ. వెంకట్రామయ్య.

ఆయన మాట ప్రకారమే శ్రీ రెడ్డి మంత్రి వర్గంలో చేరతానూ లేదా ఢిల్లీ పోతాను. ఇందులో నా తప్పేమీ లేదు. పైవారి ఆజ్ఞ'' అంటూ ఒక ప్రకటన పారేసి వూరుకోవచ్చు. ఇక మిగిలేది ఒక్క అల్లూరి. ఆయన భవిష్యత్తు ఆయనేచూచుకోగలరు.

ఇక శ్రీరెడ్డి ఏర్పాటుచేసిన మంత్రివర్గానికి వద్దాం. 10 మంది మంత్రులు (ఒకరు ఇంకా వస్తున్నారు) 6గురు సహాయమంత్రులు ఏర్పాటయ్యారు. ఇందులో ఆరుగురు రెడ్లు, ముగ్గురు జమీందార్లు. మూడున్నర కోట్ల జనాభాలో రెడ్ల సంఖ్య అంత ఎక్కువ కాకపోవచ్చు. అయితేనేం సామ్రాజ్యా లేలిన జాతి కాబట్టి, పరిపాలనా దురంధరత్వం, రాజకీయ చతురత వారి సొత్తు. కనుకనే ప్రజాస్వామ్యం వచ్చినా, సామ్రాజ్య వైభవానుభవం గలవా రవడం చేత అంతమంది రెడ్లను ఎన్నుకోడం జరిగి ఉంటుంది. ఇక పోతే జమీందార్లను తీసుకున్న కారణం బ్రిటిష్ హయాంలో వారి ధర్మ పరిపాలన, రాజ్యాధికార దర్ప ప్రదర్శనలో వారి నైపుణ్యము కావచ్చు. ఇందులో కులాభిమానం, వర్గాభిమానం లేవనే అనాలి. ఒకవేళ అలాంటి ఆరోపణ వచ్చినా, మిగతా కులాలకు కూడా తలా ఒక మంత్రిత్వం ఇవ్వలేదు కనుక నా విమర్శలు వస్తాయేమోనని పసిగట్టే ఉపమంత్రిపదవులు రిజర్వులో పెట్టారు. కనుక ఢోకా ఉండదు. ఆరుగురు సహాయమంత్రులున్నప్పుడు 16 గురు ఉపమంత్రులున్నా పర్వా లేదు. బెంగాల్, మహారాష్ట్రాలలో లేరా? శ్రీ రెడ్డి కాంగ్రెస్ అధ్యక్షులవడంవల్ల, విశాల దృష్టి అలవడింది. మంత్రివర్గంలో కూడా వైశాల్యం కన్పిస్తూంది. కనుక ఏవిధంగా చూచినా ఈ మంత్రివర్గం విమర్శనాతీతం. ★

# గళ్లనుడికట్టు - 95

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | | 2 | ■ | ■ | ■ | 3 | | 4 | ■ |
| 5 | | ■ | 6 | 7 | ■ | 8 | | ■ | 9 | 10 |
| | ■ | ■ | ■ | | ■ | | ■ | ■ | ■ | |
| 11 | 12 | ■ | 13 | | 14 | | 15 | ■ | 16 | |
| ■ | 17 | 18 | | ■ | | ■ | 19 | 20 | | ■ |
| ■ | ■ | | ■ | ■ | ■ | ■ | ■ | | ■ | ■ |
| ■ | 21 | | 22 | ■ | 23 | ■ | 24 | | 25 | ■ |
| 26 | | ■ | 27 | 28 | | 29 | | ■ | 30 | 31 |
| | ■ | ■ | ■ | | ■ | | ■ | ■ | ■ | |
| 32 | 33 | ■ | 34 | | ■ | 35 | 36 | ■ | 37 | |
| ■ | 38 | | | ■ | ■ | ■ | 39 | | | ■ |

## అడ్డం

1. తెలివి ఎక్కడా కరువుకాదు!
3 పూర్వము.
5. తరంగము.
6. కపి తన తండ్రి కావాలంటే?
8. దిశ.
9. పళ్ళు కలది ! కోయుగలదు !
11. కందులు ఒకటయితే నలుపా?
13. పద్మప్రియు డెవరు?
16 తలకి చుట్టేది.
17. పగను గోపురముగా మార్చవచ్చు!
19. పేరు.
21 పరితాపం!
24. భూమి.
26. యాతన లోపమయితే ఒక షష్ఠీ ఏకవచనంలో ఉన్న సర్వనామం.
27. కుతుకము.
30. తడి, అని నిఘంటువు.
32. బూటకము సగం తగ్గినా అదే; కాని తిరగ బడాలి!
34. ఎర్రని చెట్ల గుంపు!
35. స్వప్నము.
37. విలువకల వస్తువు తిరగబడింది!
38. శుకము.
39. క్షణము దప్పి అయితే రాత్రి నీళ్ళు దొరుకుతాయి!

## నిలువు

1. యౌవనము గలది, సొక్కి!
2. కోతి.
3. ముఖంమీద కనిపించేది!
4. నగరం
5. ఎన్నో!
7. చీకటి చిందరవందర అయిపోయింది.
8. చేత కూడా చిందరవందర!
10. పుణ్యదినమా?
12. గదులలో రెండే కావాలి!
13. వస్త్రపు చుట్టు.
14. అల్లరి, కొట్టేవేళ, తీసేవేళ!
15. లిపి చివర నొక్కి పలికినా మారదు!
16. సర్పము.
18. మొదలైన?
20. పెద్దది కానిది కలగాపులగం!
21. ఆనతిలో భాగం అదే.
22. పటం కుదిరినవానిలో డాంబికుడున్నాడు జాగ్రత్త!
23. ఆలోచన.
24. నేను తక్కిన వారితో కలిస్తే?
25. నిదుర.
26. మీగడ—.
28. ఒక దిక్కు.
29. తిలకములో హారము!
31. వారధి.
33. భూతము.
34 పుచ్ఛము.
36. వెయ్యి వందలు!
37. ఒక ఆయుధం.





"వైద్యులభేషజం" అన్న గ్రంథం రాసిన ప్రబుద్ధు డితడే" అంటూ ఒక సర్జన్ తోటి వైద్యులకు బల్లమీద ఉన్న వ్యక్తిని చూపుతున్నట్లు వేసిన కార్టూన్ ఆ ఏటి కార్టూన్ల ప్రదర్శనలో బహుమతి పొందింది.

బి. రామచంద్రయ్య (వాల్తేరు)

## 94-వ గళ్ళనుడికట్టుకు జవాబు

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 పొ | దు | 2 ప్రు | ■ | 3 పి | ల | 4 క | ■ | 5 కం | గి | 6 స |
| వ | ■ | ను | ■ | లు | ■ | ర్ర | ■ | క | ■ | న్న |
| ■ | 7 వే | గు | 8 జు | క్క | ■ | 9 ర | 10 మ | ర | 11 మి | ■ |
| 12 వ | గ | ■ | మ్మ | ■ | ■ | ■ | ర | ■ | 13 ర | 14 వ |
| న్నె | ■ | 15 దు | డు | 16 కు | ■ | 17 మ | ల | 18 క | ■ | త్రి |
| ■ | 19 డా | బా | ■ | 20 టు | క్క | రి | ■ | 21 డ | ప్పు | ■ |
| 22 వ | ■ | 23 రా | 24 వ | ము | ■ | 25 ది | 26 గు | వ | ■ | 27 వా |
| 28 నా | 29 తి | ■ | ల | ■ | ■ | ■ | మ్మ | ■ | 30 బా | న |
| ■ | 31 అ | 32 ల | జ | 33 డి | ■ | 34 అ | డి | 35 యా | స | ■ |
| 36 ర | ■ | త్తు | ■ | ను | ■ | స్త్ర | ■ | మి | ■ | 37 వె |
| 38 ము | ల | క | ■ | 39 నా | మ | ము | ■ | 40 ని | దు | ర |

లిస్టులు—149, హిందూమహాసభ—8, సోషలిస్టు పార్టీ—59.

అన్ని శాసన సభలలోను కలిపి గెల్చుకున్న స్థానాల సంఖ్యను బట్టి ఇప్పుడు స్వతంత్రపార్టీ రెండవ స్థానం ఆక్రమించింది. ఈ పార్టీకి మొత్తం 167 శాసనసభా స్థానాలు లభించాయి. గత ఎన్నికలలో మొత్తం 188 స్థానాలు గెలుచుకుని రెండవ స్థానం ఆక్రమించిన ప్రజాసోషలిస్టు పార్టీ ఈ ఎన్నికలలో 149 స్థానాలు మాత్రమే సంపాదించి నాలుగవ స్థానం పొందింది. క్రితం సారి 107 స్థానాలు సంపాదించి మూడవ స్థానం ఆక్రమించిన కమ్యూనిస్టు పార్టీ, ఇప్పుడు 153 స్థానాలు గెలుచుకుని ఆ మూడవ స్థానాన్ని నిల్పుకున్నది.

కాంగ్రెసుపార్టీ మహారాష్ట్రములో ప్రముఖమైన విజయం సాధించింది. మహారాష్ట్ర శాసన సభలోని మొత్తం 264 స్థానాలలో 214 కాంగ్రెసు వశం అయ్యాయి. ఆ రాష్ట్రానికి లోక్‌సభలో గల 44 స్థానాలలో 41 స్థానాలు కాంగ్రెసుపార్టీ గెలుచుకున్నది.

ఉత్తరప్రదేశ్ నుంచి 1957 ఎన్నికల్లో 70 లోక్‌సభ స్థానాలు గెలుచుకున్న కాంగ్రెసుపార్టీ ఈమారు 60 స్థానాలు మాత్రమే సాధించ గలిగింది. పశ్చిమ బెంగాల్ నుంచి క్రితంసారి 22 స్థానాలు గెలుచుకుంటే ఈసారి 21 స్థానాలు మాత్రమే సంపాదించగలిగింది.

కాంగ్రెసుపార్టీ మద్రాసులో క్రితంసారి 31 లోక్‌సభ స్థానాలు సాధించింది. ఆ బలాన్ని ఇప్పుడు నిల్పుకున్నది. పంజాబులో యిదివరకు 21 స్థానాలు వస్తే, ఇప్పుడు 13 స్థానాలు మాత్రమే వచ్చాయి. మధ్యప్రదేశ్‌లో ఇప్పుడు 24 స్థానాలు మాత్రమే గెలుచుకో గలిగింది. అంటే క్రితంసారి సాధించిన స్థానాల కంటే 11 స్థానాలు తక్కువన్నమాట. బీహార్‌లో వెనుక గెలుచుకున్న 41 స్థానాలలో ఇప్పుడు తొమ్మిది కోల్పోయింది. ఆంధ్రలో క్రితంసారి 37 స్థానాలు సాధిస్తే యీమారు 34 మాత్రమే దక్కించుకోగలిగింది.

1957 ఎన్నికల్లో ఆంధ్రప్రదేష్ నుంచి లోక్‌సభకు ఇద్దరు కమ్యూనిస్టులు ఎన్నికయ్యారు. ఈమారు ఏడుగురు ఎన్నికయ్యారు. వీరు కేరళనుంచి వెనుక తొమ్మిది స్థానాలు గెలుచుకుంటే ఇప్పుడు ఆరు స్థానాలు మాత్రమే గెలుచుకో గలిగారు. పశ్చిమ బెంగాల్ నుంచి 1957 ఎన్నికల్లో ఆరు స్థానాలు సంపాదిస్తే ఈసారి తొమ్మిది స్థానాలు సంపాదించారు.

స్వతంత్రపార్టీ బీహార్ నుంచి లోక్‌సభ స్థానాలు అధికంగా గెలుచుకున్నది. ఈ రాష్ట్రంలో ఏడు స్థానాలు ఈ పార్టీ వశం అయ్యాయి. శాసనసభల ఎన్నికల్లో కూడా స్వతంత్రపార్టీకి బీహార్‌లోనే అధికంగా స్థానాలు—50 స్థానాలు—లభించాయి.

1957 ఎన్నికల్లో ప్రజాసోషలిస్టుపార్టీ 19 లోక్‌సభ స్థానాలు గెలుచుకుంటే యీసారి 10 స్థానాలు మాత్రమే నిల్పుకోగలిగింది.

జనసంఘం లోక్‌సభలో తన బలాన్ని అభివృద్ధి పరచుకున్నది. ఈ పార్టీకి యిదివరలో

# న్యూఢిల్లీ లేఖ

7–వ పేజీ తరువాయి

నాలుగు స్థానాలు ఉంటే ఇప్పుడు 14 స్థానాలు లభించాయి.

* * *

ఇక్కడ ఏర్పాటైన సమాచార స్వేచ్ఛాసదస్సు, ప్రధానమంత్రి ప్రసంగంతో సమాప్తమైంది. ఇలాంటి సదస్సులవల్ల వాటిలోపాల్గొనే సభ్యుల కంఠనాళాలకు వ్యాయామం లభించటం వినా ఏమైనా ప్రయోజనం ఉన్నదా ? అన్న విషయం చర్చనీయాంశంగానే ఉన్నది. అయితే యాత్రికుల సంఖ్య పెరిగిందని సంతోషించే అవకాశం మాత్రం లేకపోలేదు.

సదస్సులకు, పత్రికాప్రతినిధుల సమావేశాలకు అమెరికా పుట్టినిల్లు. ఆదేశం భాగ్యవంతమైనది కనుక ఈ సదస్సులకయ్యే వేతి చుమురు భాగవతాన్ని భరించగలదు. విదేశీద్రవ్యం ఆర్జించే అవకాశం ఉంటుందనే ఆశతో భారత దేశం కూడా అంతర్జాతీయ సదస్సులు నిర్వహించటంపట్ల ఆసక్తి చూపవచ్చు.

వెనుక హిందూస్థాన్ టైమ్సు పత్రికలో పనిచేసిన శ్రీ దుర్గాదాస్ సమాచార స్వేచ్ఛా సదస్సులో మహోపన్యాసం గావించారు. "వార్తా పత్రికల పాఠకులకు, వార్తలు వ్యాఖ్యానించి, కుదించి చెప్పటం అవసరం కాబట్టి పత్రికా రచయితలు తమపద్ధతిని కొద్దిగా సవరించుకోవాలి" అని వారు సెలవిచ్చారు. శ్రీ దుర్గాదాస్ విదేశీ రాయబారుల కార్యాలయాలలో పనిచేసి అనుభవం గడించినవారు. అందువల్ల తాము ఇచ్చిన సలహాను ఇదివరకే అమలుచేసి చూపామనీ, తాము వ్యాఖ్యానించి చెప్పిన వార్తలను లక్షలాది ప్రజలు చదివి జీర్ణించుకున్నారనీ కూడా వారు అనిఉంటే బాగుండేది.

* * *

కేంద్ర సచివాలయం ఆవరణలో జాతీయ వస్తుప్రదర్శనశాలకు ఎదురుగా జాతీయ రంగస్థల భవన నిర్మాణం జరుగుతుందని, ఈ నిర్మాణానికి సంబంధించిన పథకాలు, డిజైన్లు తయారవుతున్నాయనీ అధికారప్రకటన వెలువడింది.

జాతీయ రంగస్థల భవనం ఆవశ్యకతను అవకాశం దొరికినప్పుడల్లా వక్కాణిస్తూవచ్చిన పండిత డి. పి. శర్మకు, ఈ ప్రకటన ఆనందం కలిగించి ఉంటుంది. స్వర్గీయ మౌలానా అజాద్ ఆత్మకూడాదీనివల్ల కొంత ఊరట చెంది ఉంటుంది. అప్పట్లో వారు (మౌలానా అజాద్) కొందరు నిపుణులతో కూడిన ఒక సంఘంచేత ఒక బ్లూ ప్రింట్ తయారు చేయించారు. దీనిని తయారుచేయడంకోసం ఈ నిపుణులసంఘం యూరప్‌కూడా పర్యటించి వచ్చింది. ఇదివరలో శ్రీ రాష్ట్రపతిజీ దర్బార్‌లో మహా ఘనతవహించిన నిజాం ప్రభువుగారి ప్రతినిధిగా వ్యవహరించిన పెద్దమనిషి ఈ ప్రతినిధివర్గానికి నాయకత్వం వహించారు.

శ్రీ హుమయూన్ కబీర్ ఇప్పుడు లోక్‌సభకు తిరిగి ఎన్నికయ్యారు కనుక, దేశంలో వీలైనంత ఎక్కువసంఖ్యలో రంగస్థలాలు— అన్నిటికంటే పెద్దది ఢిల్లీలో—నిర్మించేందుకు ప్రజలు అనుమతించారని చెప్పుకోవచ్చు. ఢిల్లీలో బహిరంగ రంగస్థలం (ఓపెన్ ఎయిర్ థియేటర్) కట్టేందుకు తృతీయ పంచవర్షప్రణాళికలో కూడా కేటాయింపులు జరిగాయి.

శ్రీ కబీర్ సాంస్కృతిక వ్యవహారాలశాఖ మంత్రిగా ఉంటున్నారు. సంస్కృతి అంటే విదేశాలతో సాంస్కృతికఒప్పందాలు కుదుర్చుకోవటం, సర్కసుబృందాల రాకపోకలకు సదుపాయాలు కలిగించటం అని వారి అభిప్రాయం. అందుకే కాబోలు సంస్కృతి పేరుమీదుగా ఎలాంటి విషయాలకు ప్రాధాన్యం లభించిందో తిలకించండి. జంతుప్రదర్శనశాల ఏర్పాటుచేసే కార్యక్రమం అన్నిటికంటే ముఖ్యమైనదిగా భావించారు. మన దేశంలో ఉన్న అమెరికారాయబారి ధర్మమా అని ఈ ప్రదర్శనశాలకు అమెరికా నుంచి కూడా జంతువులు వచ్చిపడ్డాయి. ఈ తీరు చూస్తే అనతికాలంలోనే న్యూఢిల్లీలోని జంతుప్రదర్శనశాల అంతర్జాతీయ ఖ్యాతి గడించవచ్చుననిపిస్తోంది. వస్తుప్రదర్శనశాలకు ద్వితీయస్థానం ఇచ్చారు. దీని కప్పుడే ప్రారంభోత్సవం జరిగింది. తృతీయస్థానం జాతీయరంగస్థలభవన నిర్మాణానికిచ్చారు.

తమను అదుపులో ఉంచేందుకు పరిపాలకులు రొట్టెలు సరఫరాచేసి, సర్కసులు చూపిస్తే చాలునని వెనుకటికి రోమన్లు అనుకునేవారట. ఇప్పుడు మనకు అమెరికన్ దొరలు రొట్టెల తయారీకి కావలసిన గోధుమలు సరఫరా చెయ్యానే చేస్తున్నారు; శ్రీ కబీర్ సర్కసులు ఏర్పాటు చేయిస్తున్నారు

శ్రీ కబీర్ పురాతత్వశాఖ వ్యవహారాలు కూడా చూస్తున్నారు. అయినప్పటికీ భారతీయ శిల్ప సంపదను—ముఖ్యంగా దేవాలయాల శిల్పాలను—ప్రపంచానికి చాటి చెప్పినవాడు ఒక విదేశీయుడు!

తృతీయ పంచవర్షప్రణాళికలో గ్రంథాలయాలను గూర్చిన ప్రస్తావనలో ఇలా ఉన్నది: "సమగ్ర విద్యావిధానంలో గ్రంథాలయాల ప్రాముఖ్యం ఎంతైనా ఉన్నది. ఢిల్లీ, కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాలలో ఉన్న నాలుగు జాతీయ గ్రంథాలయాలను వృద్ధిపరచేందుకు తృతీయ ప్రణాళికా కాలంలో చర్యలు తీసుకొనబడుతవి."

ప్రభుత్వం ప్రకటించిన భవన నిర్మాణ కార్యక్రమం, ఢిల్లీలో జాతీయ గ్రంథాలయం సంగతే ప్రస్తావించలేదు. ఇలాంటి గ్రంథాలయం ఒకటి ఇదివరకే ఉన్నదని మనం భావించాలి. కాని యదార్థానికి ఇది ప్రణాళికలో మాత్రమే ఉన్నది. మరొక విధంగా కూడా ఈ విషయాన్ని వ్యాఖ్యానించవచ్చు. శ్రీ కబీర్ ముస్లిమ్ కాబట్టి, 'చిత్రం, చిత్రం' అనేశ్రీ మాలీగారి కంటే ప్రభుత్వంలో ఆయనకు ఎక్కువ పలుకుబడి ఉన్నది. ఏమైతేనేమి, జంతుప్రదర్శనశాల, వస్తుప్రదర్శనశాల, రంగస్థల భవనాలు నిర్మించటం పూర్తి అయిన తరువాతనే, జాతీయగ్రంథాలయంసంగతి ఆలోచిస్తారు. సామ్యవాదవ్యవస్థ, సంక్షేమ రాజ్యం ఇలా వ్యవహరిస్తాయన్నమాట! అలా కాకపోతే భారత రాజధాని నగరంలో ఒకవంక రంగస్థల భవనాలు, వేరొక వంక మురికివాడలు ఉండటం సహజీవనానికి ప్రత్యక్షోదాహరణం అవుతుంది!



# యువ ప్రపంచం

## యువకుల వ్యాపకాలు

ఇటీవల వి. ఎస్. ఏ. గారు చిన్న పద్యం యువప్రపంచంలో ప్రచురిస్తే చదివాను. దానిలో చాలా నిజం ఉందనిపించింది. నేటి యువ ప్రపంచంలో 'ఏదో' చెయ్యాలనే కోరిక ఉంటూనే ఉంటుంది. పాఠాలు చదవడం కాక వేరే చేసేదేముంటుందంటారు కొందరు. కాని, ఇది సరియైన వాదం కాదు. యువతీ యువకులలో 'సృజనాత్మక' భావాలు చాలా ఉంటాయి. కొందరు 'క్రీడారంగం'లో మునిగిపోతారు. మన దేశంలో మాత్రం శారీరక వ్యాయామం మీద అంత 'మోజు' లేదు. కళ్ళజోడు పెట్టుకుని పుస్తకం మీదకు వంగిచదవడం తప్ప, పెద్ద వ్యాపకం వేరే మన విద్యార్థులలో, విద్యార్థినులలో లేదు. ఇక మిగిలినవి సినిమాలు, కాఫీ హోటళ్లు, రాజకీయాలు.

సినిమాల సంగతి సరేసరి. ఏ మాత్రం తెలివితేటలున్న యువకుని (లేక యువతి) కైనా ఇవి చూసిన తర్వాత భయం వేస్తుంది.

కాఫీ హోటళ్లు, కల్లీకొట్లు సైతం యువప్రపంచం సృజనాత్మక భావాలు పండేందుకు తోడ్పడవు.

రాజకీయాలు మిగులుతాయి. ఇది పెద్ద గంద్రగోళం. అసలు ఎవరికి దేనికి ఎదురుతిరుగాలో తెలియనే తెలియదు. కాంగ్రెస్‌పార్టీ హిందూమతాల విషయంలో 'నాస్తికత' వర్తించనే వర్తించదని ఒక అమెరికన్ పత్రిక రాసింది! దీనిని గురించి రాయటంకన్నా బుద్ధితక్కువ ఉండదని భయంవేసి ఊరుకుంటున్నాను.

ఇన్ని నిరాశలతో, నిస్పృహలతో బాటు మన యువప్రపంచానికి 'సెక్స్' సమస్యలు వేరే ఉన్నాయి. వీటిమీద వ్యాఖ్యలు కొల్లలు. అందుకనే వి. ఎస్. ఏ. గారి ఎత్తిపొడుపుకి సమాధానం ఇవ్వలేము.

డి. ఏ. ఏ. (గుంటూరు)



చిత్రం: కె. ఎస్. లలితామణి. (గుంటూరు)

## గమనిక

'యువప్రపంచం' శీర్షికకు వచ్చే వ్యాసాలూ, ఉత్తరాలూ కూడా చాలామట్టుకు 'కాంపోజిషన్' వ్యాసాలను పోలి ఉంటున్నాయి. యువప్రపంచానికి సంభవించే సమస్యలు చర్చించే బదులు చాలవరకూ అప్రస్తుతమయిన విషయాలు ఉద్బోధించే పద్ధతి కనిపిస్తున్నది! రాజకీయ నాయకుల ఉపన్యాసాలే పునశ్చరణ చేసి లాభంలేదు! యువ రచయితలు ఇది గమనించి నేటి యువప్రపంచం ఎదుర్కొనే సమస్యలను నిర్మొహమాటంగా చర్చించినట్లయితే ఈ శీర్షిక లక్ష్యం కొంతమట్టుకు నెరవేరుతుంది!

## ఉగాది సంచిక ప్రత్యేక ఆకర్షణలు

### (6-4-'62 సంచిక)

* రాగమాలిక : కథ – శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి.
* క్ష్యా : వ్యాసం – శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న.
* 'నేటి మన సినిమాలు' వ్యాసరచనపోటీ ఫలితాలు.
* ఫిలిం బాలట్.
* యువ రచయితలకు ఒక ప్రత్యేక ప్రకటన.
* జీవితం నేర్పిన పాఠాలు : వ్యాసం – డాక్టర్ ఆర్. సి. మజుందార్.



## రు. 1000 : నవలల పోటీ

పై పోటీలో నెగ్గిన నవల ప్రచురణ హక్కులను గురించి కొందరు సందేహాలు వెల్లడిస్తూ వ్రాశారు. ప్రచురణ హక్కులు ప్రథమ ముద్రణ వరకే మాకు చెంది ఉంటాయి.

రచయితకు ఈ ముద్రణ కాపీల అమ్మకం మీద 'రాయల్టీ' కూడా ఇస్తాము. పూర్తి వివరాలు వేరే తెలియజేస్తాము.




diEted, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7 Thambuchetty Street Madras-1. Chief Editor : S. Sambhu Prasad.

